# భారతి ఇరువదియారవ సంపుటము, భా-౨

## అకారాది విషయ సూచిక



హైదరాబాదు మిలిటరీగవర్నరు మేజర్ జనరల్ జె. యన్. చౌదరి

చిత్రకారుడు : శ్రీ కాతా రామమోహనశాస్త్రి





కాందిశీకులు

చిత్రకారుడు: శ్రీ యం. సూర్యనారాయణమూర్తి.






విరోధి సం.
ఆషాఢము

# భారతి

సంపుటము 26
సంచిక 7

# వలపుతలఁపు

•

శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు

వలపులు పొంగిపొర్లు పరువంపు టలంపులు, మేనివంపులున్
గలసిన చందమున్, మనసుకల్పిన నందముచందమున్, గెలం
కుల తెగ పొర్లిపోవు తళుకుల్ పులకించెడు వాలుచూపుకో
పులు తలపు న్నెదో మఱలఁ బోవని లోకములోనఁ జూపెడున్.

పరగతధర్మభావనల పట్టున నాత్మసమన్వయంబు కొం
దరు పొనరించి రద్ది యొక దారి; సరే - అటులేన్ సమగ్రసుం
దరమగు వస్తుతత్త్వము మనంబునకున్ గొనిరాఁగలాదె! వే
గిరము గనంగ పార్శ్వమునికిన్ బరికించినయంత తేలునే!!

నాయిక ముగ్ధయట్టులె కనంబడుగాని, విచారవైఖరిన్
బోయిన ప్రౌఢయే! సహజమో - సహవాసనివాససంస్కృతుల్
పూయునొ - " కింనుఖల్విహా తపోవనరోధివికారకేగమ
నియత " అన్నపట్టు కరుణించిన జాడలు గుర్తు వచ్చెడిన్!

“మాం దూరా దరవింద” అన్నయెడ భామంబెట్లు? “బాగయ్యె! అ
య్యాందోళస్థితి పూర్వరంగమ? అథవ్యాపారమా? బుద్ధియెం
దెందే పోకలపోయినన్ మనసులో నేకాని, మో మత్కులున్
డెందంబున్ వివరించునన్న నుడి నాడెంబౌట గు ర్తయ్యెడిన్!

ఏవిధి దీని నీ వభినయించెద విచ్చట పైవిచేష్టలున్
లో విమతుల్ పరస్పరవిరుద్ధము లౌటయె గాక తాము కూ
డా విమతుల్ గదా! ఎద హుటాహుటి కొంకును జూప నెట్లు “గ
త్వైవ ప్రతినివృత్త” యన? నిచ్చట నిన్నెటు మర్వనయ్యెడిన్!

ఇదియొకఁడేల - నామనసు నిట్టటు లూపెడు పట్టులందు కా
నిది యొకఁడైననుం గలదె! నే నిది యొక్క టి యెత్తి వ్రేలఁజూ
పెద నన తక్కువాని పదవిన్ మఱి విన్నన సేతకాదె! మం
చిది - ఇఁకనైన నిగ్గురిచి సేతు సమగ్రవిభావనావిధిన్.

సరిసుఖదుఃఖభావనల జాలున చాలిన కూర్మి లేదు - వే
సరితిని - యత్నకల్పనలఁ జక్కఁగఁ దీర్చిన ‘రేపు’ లన్నియున్
సరిపడె ‘నిన్నలన్’ నగుచు; చప్పనో! యుప్పనో! జీవనంపుదా
సరిపదముల్ పదం బిడఁగ సల్పిన దా స్మృతి యొక్కటే సుమీ!



# నన్నయ్యగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి

ప్రధాన కథ

○

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఇంతవరకు కొన్ని యుపాఖ్యానములనుగురించి వ్రాసితిని. ఇప్పుడు ప్రధానకథానిర్వహణమునుగూర్చి వ్రాసెదను. ఇది రెండుమూడు వ్యాసము లగును. ఇది మొదటిది.

భారత మితిహాసము. కావ్యము గాదు. అందు చేతనో యేమో పాండవులను దీసికొని వారిని వర్ణించుట, కథ వారిదగ్గరనే ప్రారంభించుట జరుగదు. పాండవులు శతశృంగపర్వతమునుండి హస్తినాపురము జేరునప్పటికి ధర్మరాజు పదునారేండ్ల వయస్సువాడు. భీముడు, అర్జునుడు, కవలు నొకరికంటె నొక రేడాది యేడాది చిన్నవారు. అంతవరకు వీరికి విద్యాబుద్ధులు జరిగినట్లే లేదు. దుర్యోధనుడును, భీముడును పదునేనేండ్ల వయస్సువారు. నూరుమంది కౌరవుల కదియే వయస్సు. ఆనూర్వు రన్నదమ్ములు నొకనికంటె నొకడు రోజు చిన్నవాడు. దుర్యోధనునకును చివరివాడైన విరజసునకును మూడు నెలల పది దినములు వయస్సులో దారతమ్యము.

ఇట్లు వచ్చిన పాండవులు 'ధృతరాష్ట్రునెయ్యమున సంతతవర్ధిశు లగు'చున్నారు. ఇచట 'నెయ్యమున' అన్న శబ్దము వాడుటచేత ధృతరాష్ట్రునియొక్క మనోభావ మెట్టిదో చెప్పబడినది. ఇది కట్టి స్నేహము. వారియందు ధృతరాష్ట్రునకు ప్రేమ లేదు. కొడుకుల యందు ప్రేమ యున్నది. ఈ భేద మప్పుడే నిరూపింపబడినది.

ఈ పాండవులు దుర్యోధనాదులతో కుమారక్రీడారతులై యుండిరి.

ఇచ్చట మూడు పద్యములు వ్రాయబడినవి— రెండు కందపద్యములు, ఒక సీసపద్యము. పాండవకౌరవవిరోధమునకు నీ విరోధకథకు నీ మూడు పద్యములలోని తాత్పర్యము మూలభూతము. ఈ మూడు పద్యములు సరిగా దెలిసినగాని కౌరవపాండవవైర మర్థము కాదు.

ఇది యర్థమగుటకు నందలి పరిస్థితులన్నియు జక్కగా నవగాహనము జేసికొనవలయును. పాండవు లచట బుట్టి పెరుగలేదు. కౌరవు లచట బుట్టి పెరిగినారు. ఆ స్థితికి ప్రత్యక్షముగా వారసులవలె గనిపించెడివారు కౌరవులు. పుట్టిననాటినుండి పదునేను వత్సరములు రాజభోగము లనుభవించుచు రాజకుమారులు పొందవలసిన మన్ననల బొందుచు, రాజకుమారభావమునందు బాదుకొని పోయినవారు దుర్యోధనాదులు. వీ రంద రుద్ధతులు. ఈయుద్ధతత్వమునకు గారణము పైన జెప్పినదియే.

అట్టి పెంపకము లేదు. రాజభోగము లనుభవించి యెరుగరు. అందరిచేత రాజకుమారులుగా గౌరవింపబడి

యెఱుగరు. ఇట్టివారు పాండుసుతులు. అందుచేత వారు 'వినయాన్వితులు'.

మొదటి పద్యములో వినయాన్వితులై పాండవులు ధార్తరాష్ట్రులతో నొడగూడియున్నారని చెప్పెను. రెండవ పద్యములో 'ఉద్ధతులు రాజసుతులు భీమునకు గీడ్పడ దొడగి'రని చెప్పెను.

నన్నయ్యగారి తాత్పర్య మంతయు గౌరవు లుద్ధతు లని చెప్పుటలో నున్నది. వా రిదివరకు పాండవుల నెరుగరు. ఏ మైదారేండ్ల వయసులోననో వారు వారు కలిసికొనినచో బాల్యక్రీడలయందు సౌహార్ద మేర్పడియుండెడిదేమో ? పదునేనుపదునారేండ్లప్పుడు మొదటిసారి కలిసికొనుట. కౌరవులకు 'మేమే రాజకుమారులము. మీ రెవరు?' అను దుర్భావము సహజముగా నుండును. అట్టి భావముతోనే వారు పాండవులయెడ బ్రవర్తింతురు. ఆప్రవర్తనచేతనే వా 'రుద్ధతు' లని వ్రాయబడినది. మన యింటిలో మన పిల్లవానితోబాటు చుట్టపు పిల్లవాడుగూడ జదువుకొనుచుండినచో మన పిల్లవాడు చుట్టపు పిల్లవానిమీద నధికారము జేసినట్లు.

ఈ పెదతండ్రి కొడుకుల యౌద్ధత్యమును పాండవులు సహింపలేరు. వారి యసహనము నే విధముగాను చూపించుటకు వీలు లేదు. వీరికి వీరికి నాటలలో కక్షలు పెరుగుచున్నవి. ఈ సంగతి పెద్దవారికి తెలియనే తెలియదు. బాల్యములో నిట్టి యనుభవము లున్న వారికిగాని యీవిషయము విస్పష్టముగా దెలియదు.

ఈ కక్షలు మిక్కిలిగా పెరిగినవి. మొదట సామాన్యముగా నున్నవి.

"వదలక పెనగి పదుండ్రం
బదియేవుర నొక్క పెట్ట పట్టి ధరిత్రిం
జెదర బడవైచి పవనజు
డదయుండై వీపులొలియ నందర నీడ్చున్."

కౌరవులు పదిపదినేనుమంది యొక్కసారిగా భీమునిమీదికి బోదురు. అందఱ నతడు క్రింద బడవైచి లాగును.

వారి స్పర్ధ లింక నెక్కువైనవి. వా రొకరిమీద నొకరు పగ సాధించుకొన మొదలిడిరి. కౌరవులు పాండవుల నేదియో చేయుదురు. పోయి చెట్లెక్కుదురు. భీముడు చెట్లను కదల్చును. వారు క్రింద బడుదురు. 'మమ్ము పదిమంది నొక్కసారి నీబుజముమీద నెక్కించుకొని నీళ్లలో నీదుము; నీబలము జూతు'మని యెగతాళి చేయుదురు. అత డందర బుజాన నెక్కించుకొని నడినీట ముంచి యేడ్పించును. ఈ క్రీడామాత్సర్యము నానాటికి పెరిగిపోయినది. పెద్దలకు దెలియుటకు వీలులేదు. తెలిసినచో నందరను జీవాట్లు పెట్టుదురుగాని దానివలన లాభము లేదు.

కౌరవులలో పెద్దవాడు దుర్యోధనుడు కానిచో నేమయ్యెడిదో తెలియదు. దుర్యోధనుడు సహజముగా దురభిమాని. రెండవది యీ గడచిన పదునేను పదునారు వత్సరములుగా నతడే రాజస్థానీయుడు. తండ్రి గ్రుడ్డివాడు. ఇత డా పీట నేది చెప్పిన నదియే జరుగును. అతని మాట కెదురు లేదు. జన మతడే రాజనుకొనుచున్నారు. జనము లతడే రాజనుకొనుచున్నారనియు నన్నయ్యగారు కథాధోరణిలో వ్యంగ్యముగానే చెప్పెను.

"జనపతి పంపగ సారథి
ఘనవిషకృష్ణోరగముల గరపించె"

ఈ కరపించినది నిదురవోవుచున్న భీముని. ఇచట 'జనపతి' యన్న శబ్దము వాడుటచేత దుర్యోధను డానాటికి హస్తినలో నెట్టి స్థితి ననుభవించుచున్నాడో స్ఫురించవలయును. పైన నతడుద్ధతుడు. ఉద్ధతోద్ధతుడు. తనకు పాండవు లొదిగియుండవలయు నని కోరును. వా రొదిగియుండరు సరిగదా! భీమునివలన నాటలలో గూడ వారిని గెలువలేకుండెను. అందుచేత శకునిదుశ్శాసనాదులతో నాలోచించి భీముని జంపుటకు నిశ్చయించెను.

ఇటనుండి భీముని జంపుటకు బ్రయత్నములు చెప్పబడెను. భీముని జంపుటకు బ్రయత్నములు సేయుట, యవి విఫలములగుటతో వారి వైరము రూఢమగును.

వైరముయొక్క కారణములు భీముని జంపింప వలయు నన్నంతవరకు వచ్చినవి. వారి కుమారక్రీడలలో భీముడు తన బలము ప్రదర్శించుట మాత్రముగా జెప్ప బడినది. ఇంతటి మహావైరవృక్షమునకు నీ మూడు పద్యములలోని క్రీడామాత్సర్యము బీజ మగుచున్నది.

పైన జెప్పబడిన పరిస్థితి యంతయు సమన్వయించుకొననిచో నీ క్రీడామాత్సర్యమున కంత శక్తి చాలదు.

నన్నయ్యగారి శిల్పరహస్యమే యిది. ఆయన లోకమునందలి పరిస్థితులను సర్వాంకషముగా దెలిసిన వాడు. జీవితములోని భిన్నఘట్టముల రహస్యముల నెరిగినవాడు. పాండవులు వినయాన్వితులని చెప్పుటచేత, రాజసుతులుద్ధతులని చెప్పుటచేత, దరువాత దుర్యోధనుని జనపతి యని చెప్పుటచేత నీ ఘట్టములోని యాంతరమహార్థ మంతయు పాఠకుడు గ్రహించికొనుటకు వదలి తాను లోకసామాన్యముగా గథ చెప్పినట్లు చెప్పును. తల్లోకము తెలిసినచో నా లోక సామాన్యత తెలియును.

ఈ దుర్యోధనునకు పైని చెప్పిన కారణములే గాక మరి పెద్ద కారణమే కలదు. పాండవులు వచ్చి నప్పటి నుండి జనులందరు, మంత్రులందరు యుధిష్ఠిరుడే రాజు ననుచున్నారు. యుధిష్ఠిరుడు చనిపోయినచో రాజ్యము తనదే. యుధిష్ఠిరుడు చనిపోనక్కరలేదు. అతనిని చెఱసాలలో నుంచవచ్చును. కాని భీము డుండగా ధర్మరాజును బంధించుటకు వీలు లేదు. కనుక భీముని వధింపవలయును,

"ఉపాంశువధ జేసి మర్త్యము వ
దోద్ధతుం జంపి ని
స్సపత్నముగ ధర్మనందను న
శక్తు బంధించి యే
నపాండవముగా సముద్రవల
యాఖిలక్షోణి మ
త్కృపాణపటుశక్తి నత్యధిక
కీర్తినై యేలెదన్."

ఇది దుర్యోధనుని నిశ్చయము. 'నిస్సపత్నముగ' ననుటచేత పైని చెప్పిన యర్థము భాసించుచున్నది. 'అపాండవముగా' ననుటచేత నతనికి పాండవులయెడ నెంత విరోధభావము పెరిగినదో తెలియుచున్నది. అపాండవముగా ధాత్రి చేసెద నని యెప్పుడో వైరము ప్రబలిన తర్వాత యుద్ధభూమియం దనుకొనవలసిన మాట. దానిని దుర్యోధను డిప్పుడే వాడినాడు. అతని వైరభావతైక్ష్ణ్య మిటువంటిది.

భీముని రహస్యముగా వధియించును. అపుడు ధర్మరాజును బంధించును. ఈ రెండువాక్యములయొక్క యర్థమేమి? ధర్మరాజు నిదివరకే పట్టుకొని బంధింప ప్రయత్నించెనా? భీముని యప్రమత్తతవలన నది సాధ్యము కాలేదా? దుర్యోధను డిదివరకే పాండవుల కపకారమును జేయుట కూహించెను. భీమునివలన నా ప్రయత్నములు సాగలేదు. పాండవుల స్థితి యతనికి నూదియై వచ్చి దబ్బనమై తేలిన ట్లనిపించెను.

ఇందులో నొక విచిత్రమైన సంసారస్థితి గలదు. ఈ సంసారపు పరిస్థితులలోననే యీ భారత కథవంటి కథ వృద్ధి బొందుటకు వీలున్నది. కౌరవ పాండవు లన్నదమ్ముల బిడ్డ లగుటయే యీ కథ యిట్లు సాగుటకు కారణము. అన్నదమ్ముల బిడ్డలు కానిచో, బంధుత్వము లేనిచో నీకథలోని కొన్నిసన్నివేశము లకు సందర్భము లేదు. ఇది యొక విచిత్రమైన కథ. లోకములో నిట్టి కథలు జరుగుచునేయుండును. అన్న దమ్ములకు, నన్నదమ్ముల బిడ్డలకు ప్రబలవిరోధము. ఆ విరోధ మా యిద్దరు పురుషుల మధ్యనే. తక్కిన బంధువు లందరు స్త్రీలు పురుషులు నుభయులకు సమానులే. అంత విరోధములో నొకనియింటికి పచ్చని తోరణము గట్టినచో నాయన్నయో యన్నకొడుకో వచ్చి యింటిలో భోజనము చేసిపోవును. వారి యాడ వాండ్రు,వీరి యాడువాండ్రు మాటాడుచునే యుందురు. వారివారి సంతానము, తండ్రులకు ప్రబలవిరోధ మైనను, గలిసి యాడుకొనుచునే యుందురు. ఆ పురుషులు మాత్రమే యొకరి నొకరు సాధించుకొనుచుందురు. ఇది లోకముయొక్క స్వభావము. భారతకథ యీదృశ సంసారస్థితినుండి బయలు దేరినది. అది యెట్లు జరి

శాపము బొందునో? పరిణమించినంత మేర నీబంధుత్వమూ విరోధము నెట్టి హద్దులలో నుంచునో సమగ్రముగ నూహించి దానినంతయు స్ఫూర్తిగా భాసింపజేయుచు వ్రాసినవాడు నన్నయ్య. ఈ సంగతి తరువాత వ్రాసెదను.

ఇపుడు దుర్యోధనుడు భీముని రహస్యముగా వధించి ధర్మరాజును బంధించి రాజ్యము తాను తీసికొనవలయు ననిగదా యూహ! భీముని బంధించ రాదా? అదియే యసాధ్యమైన విషయము. ఈ యాటలలో నెన్నిసార్లో భీముని బంధించుటకు, వధించుటకు ప్రయత్నములు చేసెను. కాని సాధ్యపడలేదు. ఈసంగతి విదురభీష్మధృతరాష్ట్రులకు తెలియరాదు. రాజభటుల చేతనే వారిని బంధింపించవచ్చును. కాని తన కంత వ్యక్తిత్వము రాలేదు. ఏది చేసినను రహస్యముగా చేయవలయును. తరువాత తనకు తెలియ దనవచ్చును. ఇది యంతయు బంధుత్వమువలన వచ్చిన బాధ. వీరిలో వీరి కింత వైరము పెరిగిన దని పెద్దల కెవ్వరకు తెలియనే తెలియదు. తెలిసిన నేదో పిల్లలలో పిల్లలకు వైర మనుకొనుచుండిరిగాని తొందర ముదిరి యూపర వెళ్లి యగునని యెవరు ననుకొనరైరి. తండ్రితో చెప్పి లాభము లేదు. అతడును పసితన మని నిరాదరించును. యువరాజుగా చేయదగిన వయసుగాని, విద్యాబుద్ధులుగాని వీరిలో నెవరికిని లేవు. భవిష్యత్తులో నేమి జరుగునో యెవరికిని తెలియదు. నిస్సపత్నముగా దాను ధారుణి నేలుదు నన్న యూహ దుర్యోధనున కట్టి వయస్సులో గలిగెను. దుర్యోధనున కప్పటికి బదునెనిమి దేండ్లుండునో యుండవో? దుర్యోధనునకు వయస్సు చాలదు. ఊహ లిటువంటివి.

౧. భీముని త్రాళ్లతో గట్టి నీళ్ల ద్రోయించెను.

౨. పాములచేత గరిపించెను.

౩. విషము పెట్టించెను.

“దుర్యోధనుండు భీమునకు దనచేసిన యెగ్గు లెల్లను గృతఘ్నునకుం జేసిన లగ్గులుంబోలె నిష్ఫలంబులైన సిగ్గుపడి వెండియు బాండవుల కెల్ల నపాయంబు సేయ నుపాయంబు జింతించుచుండు.”

ఇదియంతయు నిరువదిపద్యములలో జరిగినది. కుమారాస్త్రవిద్యాప్రదర్శనమువరకు దుర్యోధనుడు మరల మాటాడలేదు.

భీముని దా నేమియు జేయలేకపోయెను. సిగ్గుపడి యూరకుండెను. కచ్చ మనసులో బెట్టుకొనెను.

బాల్యవిరోధ మిట్లే యుండును. అదియును బంధుత్వములో నేర్పడినచో?

నన్నయ్యగారి భారతకథారంభ మిట్లున్నది. ఆయన చేసిన దేమియు లేదు. ఉన్న పరిస్థితు లున్నట్లు చిత్రించెను. ఆ పరిస్థితియొక్క భిన్నాంశములను బరిశీలించినచో నాయన చెప్పినదానిలోని గొప్పదనము తెలియును. ఆ కథయందలి యర్థము ప్రసన్నమగును.



# మధురపండితరాజము

●

శ్రీ పింగళి లక్ష్మీకాంతం

## —గజబృంహితము—

విహరింపఁగాఁబొమ్ము విపినవీథుల ఘటాపరివారపరివృతప్రాభవముగ
సవరింపఁగాఁ బొమ్ము జలకేళికరిణీకరోత్సృష్టకణసేచనోత్సవముగ
ఆరగింపఁగఁబొమ్ము నోరూరఁగడుపారఁ గమ్మనైన మృణాళకాండభుక్తి
కావింపఁబొమ్ము ఘీంకారపూర్వకము పర్వతసానువులయందు వప్రకేళి
రాకు మీా దెసకుఁ మృగరాజుమీఁది-సమరజయకాంక్ష మాతంగసార్వభౌమ!
కోరదేనియు శుభము నీ కుంభమునకు-ఒల్లవేనియు ముప్పు నీ యూథమునకు.

దంతికులాధిపా! యొక హితమ్ము వచించెద నిల్వుమీా, గజ
భ్రాంతిఁ గఠోరతీక్ష్ణనఖరప్రవిదారితగండశైలదు
ర్దాంతరుషోద్ధతుండు మృగరాజిపుడిప్పుడె కూర్కునై గుహా
భ్యంతరమందుఁ జొచ్చెను మదాంధుఁడవై యటు చేరఁబోకుమీా!

ముదమున దానధారలకు మూఁగి కటమ్ము లలంకరించు తు
మ్మెదలను గర్ణచాలనసమీరహతిన్ భయపెట్టి చోపుచో
మదకరికిన్ స్వకీయకటమండనహానియె కాని గండుతు
మ్మెదలకు నేమి లోప మనిమీలితపద్మవనమ్ము లుండఁగన్?

*  *  *

## —సింహగర్జనము—

మత్తమాతంగరాజకుంభస్థలంబు-శైశవమునందె చీల్చు కేసరికి నిప్డు
యౌవనోదయ మయ్యె నేప్రాణి యింక-శౌర్యపటిమప్రదర్శనస్థాన మగును?

మృగపతి వసించు గిరిదరీగృహమునందుఁ-గరటికుంభస్థలీమౌక్తికములు దొరకు
వరదుతలదాచుకొను నేలబొరియయందు-దొరకు నొకదూడతోఁకయో, నరమొ ఖుర
[మొ!

కరికిఁ గరిణికి నెవ్వాని గర్జితములు-దానశోషణగర్భపాతము లొనర్చు
ఆ మృగేంద్రుఁడు ముదిసి తారాడలేక-యూడలేళుల హాస్యాల కర్హమయ్యె.

—చిలుకపలుకు—

అమలినవృత్తి స్వేచ్ఛమెయి నాకనమందును భూమిపై విహం-
గములు విహారముల్ సలుపఁగా సృజియించిన ధాత, కీరపో
తమునకుఁ బంజరంపుఁ జెర తా ఘటియింపఁగ నేల యంచు న
బ్రము పడ నేల, తన్మధుర భాషల కయ్యదియే ఫలం బగున్.

పలుకునేర్పును, రూపసంపదయు, సుభగ-చారుశీలము, మధురవాచానిరూఢి
యున్నవే యన్ను శుకమున కొక్కటేని-ముద్దుగొల్పెనె మార్జాలమునకు సుంత?

ఆవాసం బపరంజిపంజరము, నిత్యాహారపానీయసం
సేవల్ రాజసుతోచితమ్ములు, సభాసీనుండవై చేయు ప్ర
స్తావంబుల్ రఘురామనామపరముల్, ధన్యుండ వన్నింట, నీ
భావం బా వనవృక్షకోటరదిశన్ బర్వెత్త నేలా శుకా?



# పాలకురికి సోమనాథుడు

•

శ్రీ బండారు తమ్మయ్య

విభూతిపత్రికాధిపతులుగా నుండిన శ్రీ పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు వెలకొలిపిన శివ ధర్మగ్రంథమాలికలో నూతనముగా వెల్వడిన "పాలకురికి సోమనాథకవి" అను నా రచించిన గ్రంథము గూర్చి పయి శీర్షికతో నవంబరు ౧౯౪౮ భారతిసంచికలో శ్రీ చిలుకూరి నారాయణరావుపంతులుగారు ప్రకటించిన వ్యాసమును పాఠకమహాశయులు చిత్తగించియేయుందురు. శ్రీ నారాయణరావుగారు నాకు చిరమిత్రులు. నా కన్నతవిద్యాసంపన్నులు. బహు పట్టభద్రులయి చిరకాల మధ్యాపకవృత్తియం దుండి నిరంతరము భాషాసేవ చేసి, చేయుచున్న ధన్యజీవులు. నే నన్నెన్నో ప్రవేశపరీక్షతో జదువు చాలించి విధి విరామము లెఱుంగని రివెన్యూడిపార్టుమెంటులో నొలువునకు గుదిరి జీవిత మంతే గడపినవాడను. మాతృభాషపయి గొంత సహజాభిమాన మున్నను దానికయి తగిన సేవ యొనర్చుటకు వలయు విద్యగాని, యవకాశములుగాని నాకు బ్రాప్తముకాలేదు. ఇట్లు విద్యాసంపదాదివిశేషములలో మా యిరువురకు హస్తిమశకాంతర మున్నను కృష్ణ కుచేలన్యాయమున నారాయణరావు గారితో జిరకాలమునుండి నాకు గొంత మైత్రి కుదిరినది. వారి సహజమధురస్వభావమే యందుకు గారణమని చెప్పదగును. ఆ మిత్రతికలిమిచే వారు పండితారాధ్య చరిత్రమునకు బీఠిక వ్రాయునపు డంతకుమున్న బసవపురాణపీఠికలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మత, సారస్వత, చారిత్రకవిషయములలో వెలువరించిన కొన్ని యభిప్రాయములగూర్చి నే నందందు బ్రకటించిన వ్యాసములు గల పత్రికలను దమ యుపయోగమునకయి పంపుమని శ్రీ నారాయణరావుగారు నన్ను గోరుటయు, నందుపయి నేనును నాకును వారికిని గూడ మిత్రులు, పూజ్యులు నగు పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారును వారికి గావలసిన పత్రికలను, గ్రంథసామగ్రినిబంపి చిరకాలము వారియొద్ద నుంచుటయుజరిగినది. పంతులుగారు తమ పీఠికలో నా యభిప్రాయముల గొన్నింటిని మన్నించి గ్రహించిరి. మఱికొన్నియెడల స్వతంత్రములగు భిన్నాభిప్రాయముల వెలువరించిరి. ఇట్టియెడల భేదాభిప్రాయము లుండుట వారు సెలవిచ్చినట్లు సాజమే. అది కాదని గాని, యభిప్రాయభేదము లున్నంతమాత్రమున భాషాసేవకు లొకరి నొకరు కొలదిసేయుచు నొండొరులపయి దుముకుట న్యాయ్యమనిగాని బుద్ధిమంతు లెవరు ననజాలరు.

౧౯౪౦ సంవత్సరములో పండితారాధ్యచరిత్రము వెలువడినవెంటనే నారాయణరావుగారి పీఠికలోని కొన్ని విషయములగూర్చి శ్రీ వీరభద్రశర్మగారు, శేషాద్రిరమణకవులు మున్నగువారు "విభూతి" మొదలగు పత్రికలలో విమర్శనములు ప్రకటించిరి. ఆసందర్భములో నితరు లేమి వ్రాసినను నేనుమాత్రము వారి యభిప్రాయభేదములగూర్చి నే మియు జర్చింపదలంప లేదని శ్రీ నారాయణరావుగారికి లేఖాముఖమున నివేదించియే యుంటిని. అప్పటికి నాకు సోమనాథుని గూర్చి ప్రత్యేక గ్రంథము వ్రాయు నాశయము లేనే లేదు. తరువాత శ్రీ వీరభద్రశర్మగారి యాదేశమువలన ౧౯౪౨ సంవత్సర ప్రాంతముననే యీగ్రంథరచనమున కుద్యమించితిని. అందుచే గ్రంథమం దాయా తావుల బసవపురాణవృషాధిపశతకపీఠికలలో దత్పీఠికాకర్తలు ప్రకటించిన యభిప్రాయభేదములపయి నే నదివఱలో వ్రాసిన విమర్శవిషయములను మరల సంగ్రహముగ జేర్కొనుటయు శ్రీనారాయణరావుగారు పండితారాధ్యచరిత్రపీఠికలో వెల్లడించిన నూతనాభిప్రాయములగూడ నుదాహరించి యందుగూర్చికూడ గొంత చర్చించుటయు నావశ్యకము లయ్యెను. ఇట్టి

చర్చ లెవరి యభిప్రాయములయెడ గావించినను భవభూతిమహాకవి ఘంటాఘోషముగ జెప్పిన "కాలో హ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ" అను సూక్తి ననుసరించి యనంతమగు లోకముయొక్కయు భావిపరిశోధకులయొక్కయు బరిశీలనము, సత్యనిర్ణయము పరమలక్ష్యములుగా గొని యందుకు దోడ్పడుటకయి కావించినవేగాని కేవలము వృథాభిమానవాదాభినివేశములు కారణములుగా నొనర్చినవి కావని వేఱ విన్నవింపవలసిన యవసరము లేదు. ఇందువలన నా యీ మహనీయులయెడ నాకు బూజ్యభావము లేదని గాని, వారి గౌరవమును గొలదిపఱుచు నుద్దేశము నాకు గలదని గాని సహృదయు లెవరు తలంపజాల రనియే నా నమ్మకము. శ్రీ నాగేశ్వరరావుపంతులుగారు బసవపురాణమునకు దాము వ్రాసిన ప్రస్తావన చివర "కర్ణాటాంధ్రభాషలందు గల వీరశైవవాఙ్మయమును బండితులు పరిశోధించి వీరశైవతత్త్వము సువ్యక్త మొనర్తురుగాక!" యని కావించిన యాదేశముగూడ నేనొనర్చిన యీపనికి గొంతవఱకు గారణమని మనవి చేయుచున్నాను. పండితుడను గాకపోయినను బండితపరిశీలనమున కయి తోచిన విషయముల నివేదించుటలో దప్పు లేదుగదా! మఱియు నా వ్రాతలు వ్యాసములు నెవరిని నాక్షేపించుటకుగాని యధిక్షేపించుటకుగాని యుద్దేశింపబడునవి కావని, ఆయావిషయముల విమర్శించుటలో నా యాశయ మందువలన సత్యనిర్ణయమునకయి యత్న మొనర్చు వారికి గొంతతోడ్పడుటయు, నా సందియముల దొలంచుకొనుటయుమాత్రమే యని పలుమారులు లోకమునకు విన్నవించియే యుంటిని.

౧౯౪౪ సంవత్సరమున నా గ్రంథముద్రణ ముద్యమించిన కొలదికాలములో శ్రీ వీరభద్రశర్మగారు శ్రీ జగద్గురు కాశీవిశ్వారాధ్య జ్ఞానసింహాసనాధ్యక్ష పదవికి నియుక్తు లగుట యుదిరువాత ౨౫-౧-౪౫ తేదిని లింగైక్య మగుటయు ఘటిల్లుటచే మొన్న మొన్నటి వఱకు నా గ్రంథము వెలువడుట కవకాశము కలుగలేదు. అది యింతదనుక సరిగా లోకముయొక్క మొగమును గాంచలేదు. పలువురకు దాని పరిచయము గలుగలేదు. శ్రీ వీరభద్రశర్మగారి యుదారాశయములు, నా విధ్యుక్తధర్మము ననుసరించి గ్రంథము వెలువడిన యనంతరము దానిని మునుముందు ౧౨-౧౦-౪౫ తేదిని శ్రీ ప్రభాకరశాస్త్రిగారికిని, నారాయణరావుగారికిని బంపియుంటిని. అందినదే తడవుగ దయతో గ్రంథమును జిత్తగించి నారాయణరావుగారు ౨౩-౧౦-౪౫ తేదిని నాకు లేఖ వ్రాసి యందులో "సోమనాథుని నివాసస్థలము, కులగోత్రములు, కాలము ఈ మూడువిషయములుగురించిన్నీ మన కేకీభావము కుదురదు. నాకీ విషయములనుగూర్చి ఎట్టి అభిమానముగాని దురభిమానముగాని లేదని నమ్మ వేడుతున్నాను. మీ వ్రాతలగురించి చాలా యోచించినాను. నా అభిప్రాయములనుమార్చుకోజాలనందుకు చింతిస్తున్నాను. ఈ విషయమై భారతికి వ్రాసినాను. వారు ప్రకటిస్తా రనుకొంటాను" అని యుగ్గడించిరి. అందుపయి సవినయముగ సముచితముగ వారికి బ్రత్యుత్తరము వ్రాసితిని. భారతికి బంపిన వ్యాసమింత మహోగ్రముగ నాగ్రహావేశసంజనితములయిన ప్రసంగములతో, అప్రస్తుతప్రశంసాదికములతో నిండియుండునని వారి లేఖవలన నే నూహింపనైతిని. ఈ రూపముగనయిన లోకమునకు నాగ్రంథపరిచయము మునుముందు కలిగించినందుకు వారికి నా కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాను.

నా గ్రంథమున నారాయణరావుగారిని నేను దక్కువపఱచినదికాని, వారితో గయ్యమునకు గాలు ద్రవ్వినదిగాని యేమియు లేదు. వారి యోద్ధృత్వమునకు బాండిత్యమునకు నే నెల్లప్పుడు తల యొగ్గువాడనే. అకారణముగ వా రిట్టు లాగ్రహావిష్టులగుట నా దురదృష్టమే. నా గ్రంథమున నే ననవసరతీవ్రత నుపయోగించి, "శోచనీయము"అని పదేపదే వక్కాణించి, తమ్ము 'గ్రొత్త యొక వింత, ప్రాత యొక రోత'యను మాత్రమును భజించు తృతీయపంక్తియునిగా నిరూపించితినని చెప్పుచు నది కారణముగా శ్రీ నారాయణరావుగారు ప్రస్తుతవ్యాసరచనమున కుద్యమించిరను భావము వారి వ్రాతలవలన వ్యక్తమగుచున్నది. ఇంతదనుక నా గ్రంథమును జూడని పాఠకులకు నారాయణరావుగారి యారోపణావేశాటోపాదికము లెంతవఱకు నుచితములో యవసరములో బాగుగ నుత్తింప నవ

కాక ముందె నేరదుగాన, "చేసిన పాపము చెప్పిన తీఱును" అను పెద్దల నుడి ననుసరించి నేను నా గ్రంథమున నారాయణరావుగారియెడ నుపయోగించిన వాక్యములలో ముఖ్యములయినవానినయిన నిం దుదాహరింప దలంచితినిగాని పత్రికాధిపతులు నా ప్రత్యుత్తరవిషయమున స్థలసంకోచకారణమున గావించిన నిబంధనములచే వానిని పేర్కొనజాలనందుకు జింతించుచున్నాను. వలయువారు నా గ్రంథముయొక్క ౩, ౫, ౧౦ ప్రకరణములందు వానిని దిలకింపవేడెదను. అభిప్రాయభేదములు గల కేవలచారిత్రకవిషయముల గూర్చి విషయవిమర్శనములో నేను నా గ్రంథమున నేమి వ్రాసినను నారాయణరావుగారు తమ ప్రస్తుత వ్యాసములో నుదోద్ఘాతపూర్వకముగ నాయెడ గావించిన ప్రసంగాదికము లెంతవఱ కుచితములో సహృదయులు నిర్ణయింతురుగాక! నారాయణరావుగారు తమ వ్యాసములో కొన్ని ప్రశ్నములు నాపయి ప్రయోగించి వానికేగాక మఱికొన్నిరెండల వారి యితరవాక్యములకుగూడ బదులుపలుకు బాధ్యతను గలిగించుటచేతనే యీ ప్రత్యుత్తరము వ్రాయవలసివచ్చినదని మనవి చేయుచున్నాను. శోచనీయ మను పదమును నేను సముచితస్థలముల సముచితార్థమున గ్యాచిక్కముగనే యుపయోగించితినిగాని పదేపదే వాడలేదు. ఇంతకు నది యేమంత బోటుమాట? ఉదాహరించిన యావిషయము శోచనీయమైనది నాకును నావలెనే తలంచువారికి మాత్రమే యని యర్థమగును గాని నారాయణరావుగారి కని యర్థము కానేరదుగదా! అది వారి కాత్మశ్లాఘనీయమే కావచ్చును. పూర్వనిర్ణయముల గాదని క్రొంగొత్త వాదముల దెచ్చిపెట్టుట నారాయణరావుగారికి నేడు క్రొత్తకాదు. వీర పండితారాధ్యచరిత్రపీఠికపయి శ్రీ వీరభద్రశర్మగారు విభూతిపత్రిక (సం ౨ సం ౧) లో బ్రకటించిన ప్రథమవిమర్శవ్యాసములో జివరను "ఇటులే వీ రనేకవిషయములను గూర్చి క్రొత్తమాటలు చెప్పబోయి పొరపడినారు......తమ ఘనతకు దగినట్లు పీఠికను రచించుటలో సహకారులతో సంప్రదింపందున నిట్టి విపరీతముల కవకాశము కలిగినది." ఇత్యాదిగా వ్రాసియున్నారు. శ్రీశర్మగారికి నివేదనపూర్వకముగ భారతి (సం. ౨౦ సం. ౭) లో బ్రకటించిన లేఖలో దమ పాలకురికివాదమే కేవలము వినూత్నమనియు, పాలకురికి గ్రామనామవిచారమే క్రొత్తదనియు శ్రీరావుగారే ప్రగల్భముగ జెప్పికొనియున్నారు. తృతీయపంథయైనను సహృదయామోదమును భవ్యతాపాదకమగు నవ్యతనుగాని సత్యమును గాని ప్రతిపాదించుచో నది శ్లాఘనీయమే యగును. "మురారే స్తృతీయః పంథా" అను సూక్తి ప్రశంసాపరముగ వ్యవహృతమయినదే గదా! కావున బూర్వోదాహృతపదముల నాయాసందర్భముల నేను నా గ్రంథమం దుదాహరించుటలో నేను రావుగారిని దక్కువ పఱచినది లేదు. వారంతగా బట్టించుకొనుటకు, గోపాటోపముతో సంరంభించుటకు దగిన కారణము లేదు.

నారాయణరావుగారు సెలవిచ్చినట్లు నా కలము బలముగలది కాదు. అది కరము నీరస మయినది. వారు తమ లేఖినిని సుదర్శనచక్రముగనో, నందక ఖడ్గముగనో సంభావించుకొనుచున్నారేమోగాని నాకలము నా పాలిటి లింగపసాయితఖడ్గమని నేనుగాని, యితరులెవరుగాని భావింపలేదు. డబ్బెత్తు సత్తువగాని, చిన్నమెత్తు విద్యాసంపత్తిగాని లేని నాకే యేపాటి శౌర్యవీర్యములు లేనప్పుడవి నా కలమున కెట్లు గలుగనేర్చును? కరముతోగాని, కలముతోగాని నేలపయిగాని, నేల విడిచి గాలిలోగాని సాముచేయనేర్చి యొకరితోడను నెప్పుడు నెట్టి లడాయికి దిగినవాడను గాను. "వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే" అన్నారు పెద్దలు. రావుగారివంటి యసహాయశూరులతో, బట్టభద్రులతో నావంటి విద్యాబలహీనులు వారు చెప్పిన "వాగ్లడాయి"కి సిద్ధమగుచో నామరూపములతో నశింపక నిలువగల్గుదుమని కలలోనయిన దలంపనేర్తుమా? నా కలమున కిదో యొక యుపమాన మవసరమే యని పంతులుగారివలె మఱెవరయినగూడ దలంచుచో గాలిచే గ్రమ్మిన దుమ్మును మెల్లమెల్లగ దొలగింప నుద్యమించు శోధని కొంతవఱకు సరిపడు నేమో పాఠకు లాలోచింతురుగాక! రావుగా రారోపించిన యీ వీరత్వము సహజవీరశైవుండ నయిన నా

పుస్తకాలతో నలవడినదే గాని క్రొత్తది గాదని, భస్మము దాల్చు సామాన్యశైవులకే మరులెత్తుట సాజము కాగా భస్మరుద్రాక్షలింగములు మూడును ధరించు వీరశైవుల మతావేశవీరత్వముల మాట చెప్ప నలవియే గాదని వారు సెలవిచ్చిరి. వీరశైవమతవిషయకమయిన వీరత్వమును శివజీవైక్యజ్ఞానముగా శివాగమములు సిద్ధాంతశిఖామణి మున్నగు ప్రమాణగ్రంథములు నిర్వచించినవి. అందుచేతనే యట్టి జ్ఞానసిద్ధిని సాధింపగల్గు వారి నుద్దేశించియే "ఏకేన జన్మనా ముక్తిర్వీరాణాంతు మహేశ్వరి!" అని శివుడు పార్వతికి శివాగమములలో బోధించినట్లు చెప్పఁబడును. రావుగారు సెలవిచ్చిన వినూత్న విపరీతనిర్వచనమునకు ప్రమాణ మేమో తెలియరాదు. వారు శాసించిన వీరావేశరూపకవీరత్వము భస్మరుద్రాక్షలింగసన్నిహితశరీరుల కెల్ల విహితమే యయినచో వీరశైవులు, ఆరాధ్యబ్రాహ్మణులుగూడ నందుకు గుఱి కావలసినదే కదా! శివాగమప్రోక్తమయిన ముక్తి వీరశైవునకు కేవలజన్మమాత్రమున గాక నిజమతాచారధర్మముల బాగుగ దెలిసి నిర్వహించి శివజీవైక్యమును సాధింపజాలిననే కలుగఁజేయునని వేఱ చెప్పనక్కఱలేదు. నేను జన్మమాత్రమున వీరశైవుఁడ నయినను దన్మతధర్మకర్మాచరణమున వీరశైవుఁడనని చెప్పుకొనుటకు లవలేశమయిన నర్హత లేనివాఁడను. అందుకు వలయు భక్తిజ్ఞానవైరాగ్యములు పరమేశ్వరానుగ్రహము లేమిచే నాకు ప్రాప్తము కాలేదు. మాయమ్మ యుగ్గుబాలతో నాకు ధీరత్వమేమయిన బోసెనేమో గాని శివాజీతల్లివలె వీరత్వ మేమియు బోయలేదు. కావున నారాయణరావుగారి దృష్టిలో విహితమయిన వీరత్వమునకు శివాగమసమ్మతమయిన వీరత్వమునకు రెంటికి గూడ నేను విదూరుఁడనే. ఇట్లు "ఇతో భ్రష్టస్తతో భ్రష్టః" అన్న నుడికి దృష్టాంతమగు నాకు నారాయణరావుగారు మతాభినివిష్టత నారోపించుట న్యాయము కాదు. మతాభినివేశము గలవారికి బరమతసహిష్ణుత లేకపోవుట యటుండగా వారి మతముగూర్చి యనుకూలముగ గాని, ప్రతికూలముగ గాని యొక రేమి ప్రస్తావించినను విమర్శించినను అనుమానములే యని రావుగారు వ్రాసిచ్చిరి. ఇంతవఱకు సత్యమున్నదో నే దెలియనేరను గాని మతములు, తదాచారధర్మములు మంట గలియుచున్న యిక్కాలమున నేమతస్థులం దయినను నట్టి యావేశావిష్టులు గలరా యని నా యనుమానము. తక్కినవారి గొడవ నా కెందుకు? అవ్యాజాభిమానముతో, శరీరారోగ్యమునయిన బాటింపక యహోరాత్రములు చిరకాలమునుండి వీరశైవవాఙ్మయపరిశోధనము గావించుచుంటి మనియు, దన్నిరంతరపరిజ్ఞానసాహచర్యముల కలిమి భ్రమరకీటన్యాయమున దాముగూడ జంగములయి పోవలసివచ్చునేమో యని సోత్కంఠముగ జెప్పికొనెడి నారాయణరావుగారికి గల యామతాచారధర్మపరిజ్ఞానములో నా కొక్కింతయు లేదని నొక్కి వక్కాణించుచున్నాను. "అయ్యకు విద్యలేదు గర్వము లేదు" అన్నట్లు నాకా మతపరిజ్ఞానము లేదు, మతావేశము లేదు. జన్మవీరుఁడ నయిన నాకన్న గర్మవీరు లయిన శ్రీ రావుగారే యన్నివిధముల మిన్నలు. కావున గర్మవీరులగు వారికే వీరశైవులకు విహితములని వా రగ్గడించు వీరత్వావేశములు లెస్సగా వర్తించునని చెప్పనక్కఱలేదు. "ముందు పుట్టిన చెవులకన్న వెనుకబుట్టిన కొమ్ములే వాడి" యనిగదా పెద్దల వాడుక. ఇట్లు సంప్రాప్తములయిన వీరత్వావేశములు కొంతవఱకు వారి ప్రస్తుతవ్యాసమున దాండవించుట పాఠకులు గమనించియేయుందురు.

చారిత్రకవిషయములలో శ్రీ నారాయణరావుగారి యభిప్రాయములు కొన్నింటిగూర్చి నా గ్రంథమున జర్చించినంతమాత్రమున వారి వీరశైవవాఙ్మయసేవయెడ నేను కృతజ్ఞతాశూన్యుఁడ నని వారుగాని, లోకముగాని తలంచుట భావ్యము కాదు. నాపయి గదిరిన యాగ్రహావేశముకొలది రావుగారు తామొనర్చిన యీ సేవాదికములగూర్చి తమ్ము దామే నిందించికొనుచు నవి యెల్ల దప్పులు కావా? తప్పక తప్పులే యని విచారమును వెల్లడించుట శోచనీయము. పండితారాధ్యచరిత్రమువలెనే పిడుపర్తి సోమనాథుని ద్విపద ప్రభులింగలీల నుగూడ బరిశ్రమించి పరిష్కరించి ముద్రణమునకు సిద్ధమొనరించితి మనియు, నా గ్రంథమును జదివినతరువాత "వృథా! వృథా! ప్రకటింప

కూడదు"అని విసుగు, విరక్తి కలుగుచున్నదనియు కూడ రావుగారు వ్రాయుట నా కెంతయు సంతాపమును గూర్చుచున్నది. కట్టా! పాలకురికి సోమనాథుని గూర్చి ప్రత్యేకచరిత్రగ్రంథము వ్రాసి శ్రీనారాయణ రావుగారి కిట్టి వైమనస్యము, వీరశైవవాఙ్మయసేవ యెడ వైముఖ్యమును గలిగించిన నా యీ మహాపచారా పరాధనిష్కృతికయి కరుణాసముద్రుఁడగు పరమేశ్వరుని కరుణయే శరణ మగుగాక. పూర్వోక్తమైన ప్రభులింగలీల పరిశుద్ధముగ బరిష్కృతమయి ప్రకటిత మవుగావుతమని చిరకాలమునుండి యభిలషించువారిలో నే నొక్కఁడను. ఆ గ్రంథమునుగూడ సత్వరముగ బ్రకటించుపుణ్యము గట్టుకొన్నచో శ్రీ నారాయణరావు గారియెడ నందఱికన్న నేనే యెక్కుడుగ కృతజ్ఞతా బద్ధుఁడ నాగలనని మనవి చేయుచున్నాను. ఉత్తముల కోపములు క్షణికములుగదా! కావున "ఇంతమాత్రము ననే విరక్తి పుట్టగలవాఁడను కాను"అని వారే మరల సెలవిచ్చుటచే నేఁగూడ నిరాశ చెందక యీ గ్రంథ సత్వరప్రకాశమునకయి నిరీక్షింతును.

రావుగా రాత్మనిందాపరముగ దప్పులు తప్పులని తామే చెప్పికొన్న మూఁడు విషయములలో దేనిని గూర్చియు గించిత్తయిన దప్పని నే నెప్పుడు చెప్ప లేదే! అట్టియెడ వారి కింత చిరాకేల కలిగెనో తెలియ కున్నది. పండితారాధ్యచరిత్రమును వీరు తప్పులు లేకుండ సవరించి పరిష్కరించియున్నచో నది తప్పని యెవ్వరనగలరు? శ్రీ ప్రభాకరశాస్త్రిగారు *Venkateswara Oriental Research Institute Journal* లో వీరి పరిష్కరణ మెంత పరిశుద్ధముగ నున్నదో స్థాలీపులాకన్యాయమున వాదప్రకరణమునుండి కొన్ని దృష్టాంతములొసంగి నిరూపించియుండుట రావుగా రెఱింగియేయుందురు. ఇంతకు నిందుగూర్చి నేను మాత్ర మెప్పుడు తప్పులు పట్టలేదు. ఏ పాదమున కా పాదము విడివిడిగా జక్కని కాగితములపయి నంద ముగా ముద్రితమై గ్రంథము వెలువడుటయే మహా మేరువుగా సంతసించినవాఁడను నేను. వీరి పీఠికలో నా నిర్ణయములకు విలక్షణముగ వీ రభిప్రాయ ములు ప్రకటించినవి గూడ దప్పని నే నెన్నఁడు ననలేదు. ఇంతకు నా నిర్ణయములని వీరన్నవి నే క్రొత్తగ జేసినవి కానే కావు. "ఆప్తశ్చ యథార్థవాదీ భ్రమప్రమాదరహితశ్చ" అను సూక్తికి దావలమయిన యాప్తులు పెద్దలు నాకన్న ముందుగా వెలువరించిన యభిప్రాయములను, నిర్ణయములనే యనుసరించినవాఁడను గాని యందులో నా స్వయంకృతిత్వ మేదియు లేదు. ఇట్టియెడ రావుగారుగాని యితరులుగాని వానిని సప్రమాణముగ తప్పులని నిరూపించి క్రొత్తనిర్ణయములను జేసినచో వానినే యనుసరింతునుగాని పూర్వనిర్ణయములయెడ బట్టుదల పూని పెనగులాడవలసిన పని నాకు లేదు. రావుగారు పేర్కొన్న నిరాశారిమతము గూర్చిన యభియోగమునుగూడన, దానిలో వారు వీర శైవమతసనాతనత్వముగూర్చి లిఖితవాగ్రూపముగా సాక్ష్య మిచ్చినది నాకు దెలియునే తెలియదు. శ్రీ వీర భద్రశర్మగారి యకాలనిర్యాణమునకయి తమ సంతా పమును బ్రకటించుచు నారాయణరావుగారు మదన పల్లెనుండి ౧౫-౮-౪౮ తేదిని వెలువడిన "శ్రీ"యను మాసపత్రిక తొలిసంచికలో వ్రాసిన వ్యాసములో శర్మగారు తమకు సహాయకారులయిన చిరమిత్రు లనియు పండితారాధ్యచరిత్రపీఠికలోని తమ యభి ప్రాయములు కొన్నిటిగూర్చి విభూతిపత్రికలో విమ ర్శించినను దమపయి నెట్టి కోపమును బ్రకటింపరయి రనియు, అనంతపురముజిల్లాకోర్టులో ఉరవకొండలోని వీరశైవమఠమునుగూర్చిన యభియోగములో దాము విశేషముగ బరిశ్రమించి సాక్ష్య మిచ్చినందుకు మిక్కిలి సంతసించిరనియు, ౧౯౪౭ అక్టోబరు నెలలో గాశిలో జరిగిన యఖిలభారతరచయితలసభకు దాము వెళ్లినప్పుడు తమ రాక విని జబ్బులో నుండియు వారి జగద్గురుపీఠమునకు రప్పించి సత్కరించిరనియు, ఇత్యా దిగా కొన్ని సంగతులు వెల్లడించినారు. రావుగారి భారతివ్యాసములో నుదాహృతమయిన యభియోగము శైరిజెప్పిన యురవకొండమఠమునకు సంబంధించినదే కాబోలును. ఈ పురాణమునకు నాకు బూర్వోక్త వ్యాసములు రెంటిమూలమున నేడు నారాయణరావు గారే కథకులయినా రని మనవి సేయుచున్నాను. వీర భద్రశర్మగారివలనగాని, యితరులనుండిగాని యింతకు

ము చెందుగూర్చి నే నేమియు వినలేదు. ఈ యభియోగసందర్భమున దాము గావించితి మన్న యమూల్యసేవకు నేనుగూడ నిప్పుడు శ్రీ నారాయణరావుగారికి కోటానుకోట్లుగ నాయేటికోళ్లు సమర్పించుచున్నాను.

ఈ యారోపణముల మాట యట్లుండ రావుగారు నేరుగా వింత లనుపేరితో నా గ్రంథప్రకటన విషయమున గావించిన ముఖ్యములయిన దోషారోపణములు రెండు.

(౧) (పైన చెప్పిన యభియోగములో నే కాబోలు) తనకు వ్యతిరేకముగా వీరశైవమతము శ్రుతి స్మృతి పురాణేతిహాసవిరుద్ధమని, అవైదికమని, వీరశైవులయి యుండియు ప్రమాణము చేసి కోర్టులో అబద్ధపుసాక్ష్య మిచ్చిన శ్రీ T. H. M. సదాశివయ్య M. A., B. L (సబుజడ్జి) గారి చేతనే నేను నా గ్రంథమునకు Foreword (తొలిపలుకు) వ్రాయించుట.

(౨) వీరశైవమతోత్కృష్టప్రకటనమునకు గాని, ఆ వాఙ్మయప్రాశస్త్యప్రచారమునకు గాని తనవలె నెట్టి కృషిని జేసియుండని నేను తాము, శ్రీ ప్రభాకరశాస్త్రిగారు, శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు, శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు గావించిన వీరశైవవాఙ్మయ సేవను గూర్చి యొక్క మంచిమాటయైనను ౩౩౨ పుటలుగల నా గ్రంథములో చెప్పుటను వ్రాయకుండుట. మఱియు తక్కిన ముగ్గురు భవులని మానినను భవి కాని నాగేశ్వరరావుపంతులుగారినైనను ప్రశంసింపకుండుట.

నా గ్రంథముద్రణము ౧౯౪౬ లోనే ముగిసినను గ్రంథప్రకాశకులగు శ్రీ జగద్గురువీరభద్ర మహాస్వాములవారి యవతారికకొఱకై దాని ప్రకటన మీ రెండేండ్లనుండి నిలిచిపోయినది. దైవదుర్విపాకమున వారు తా మభిలషించిన యవతారికాదులు లిఖింపకయే ౨౬-౧-౪౯ తేదిని శివైక్యమగుట ఘటిల్లినది. లేకున్నచో గ్రంథము వారి తొలిపలుకుతోనే వెలువడియుండెడిది. ఈ సంగతులు నా గ్రంథపీఠికలో నుదాహరించియే యున్నాను. శ్రీ స్వాములవారి నిర్యాణమునకయి తమ సానుభూతిని ప్రకటించుటకు అమలాపుర వీరశైవులు అచ్చటికప్పుడు సబుజడ్జిగా వచ్చిన శ్రీ సదాశివయ్యగారి యధ్యక్షతను ౧౯౪౮ ఫిబ్రవరిలో స్మారకసభ నేర్పఱచి యందు పాల్గొనుటకు నన్నుగూడ నాహ్వానించియుండిరి. ఆగంతుకముగ నీ సభ కేగినప్పుడు నేను శ్రీ సదాశివయ్యగారికి శ్రీ వీరభద్రస్వాములవారు నిర్యాణసమయమున నాకు వ్రాసినచరమ సందేశలేఖను జూపి నా గ్రంథమునకు వారి యవతారిక దొరకని దుర్గతికి దురపిల్లి, శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారిని గ్రంథావతారికా రచనమునకయి ప్రార్థింప నెంచితి ననియు, బహుకార్యధురంధరులయిన వారి కంతకవకాశ ముండదేమో యనియు మనవి చేసి, తాముగూడ గ్రంథమును జదివి తమ యభిప్రాయమునుగాని తొలిపలుకుగాని వ్రాసిపంపుడని శ్రీ సదాశివయ్యగారిని గోరియుంటిని. రావుగారు చెప్పుచున్న యభియోగ విషయము వారివలన నే నప్పుడయిన వినియుండలేదు. రెడ్డిగారిచేతనే యవతారిక వ్రాయించుట మంచిదని హెచ్చరించి శ్రీ సదాశివయ్యగారు తమకుగూడ కార్యభారముచే నవకాశ ముండదనియు, నయినను గ్రంథమును జదివి తొలిపలుకుగాని, యభిప్రాయముగాని వ్రాసి సాధ్యమయినంత త్వరలో బంపుటకు ప్రయత్నింతు మనియు సెల విచ్చిరి. అటుతరువాత శ్రీ రెడ్డిగారు, సదాశివయ్యగారు వ్రాసి పంపిన యభిప్రాయములు ఫలితార్థమున నించుమించుగ భావైక్యమును గలిగియున్నను సదాశివయ్యగారు పంపినది కొంచెము విస్తరముగను, రెడ్డిగారు పంపినది సంగ్రహముగను నుండుటచే మొదటిది తొలిపలుకుగాను, రెండవది పండితాభిప్రాయములందును గ్రంథమున ముద్రితము లగుట జరిగినది. శ్రీ సదాశివయ్యగారు మదరాసులో విద్యార్థిగా నున్నప్పుడే చాలవత్సరముల క్రిందట ఆంగ్లభాషలో వీరశైవముగూర్చి యొక వ్యాసము ప్రకటించి యది వేదవేదాంత సమ్మతమయిన సనాతనమత మనియే నిరూపించియుండిరి. కర్ణాటదేశమున గొన్ని సంవత్సరములనుండి వీరశైవులలో పంచాచార్యపార్టీ, బసవేశ్వరపార్టీ యని రెండు కక్షలేర్పడి యా దేశమునందు దత్పరిసరములందలి యాంధ్రదేశమునను గొంత విషమవాతావరణము గలిగించుచుండినట్లు

వి

యున్నాను. అట్టివానిని బురస్కరించుకొని శ్రీనారాయణరావుగారుదాహరించిన గ్రంథ మేదయిన జరిగినదేమో నాకు దెలియదు. శ్రీసదాశివయ్యగారు బసవేశ్వరపార్టీకి జెందినవారు. శ్రీవీరభద్రశర్మగారు పంచాచార్యపార్టీకి జెంది తుదకు బంచాచార్యసింహాసనములలో గాశీసింహాసనమును జగద్గురువుగా నధిష్ఠించినవారు. సోమనాథునకు బసవేశ్వరునందు గల భక్తి సర్వవిశ్రుతము. అతడు బసవేశ్వరు డుద్ధరించిన వీరశైవము శ్రుతిస్మృతిపురాణసమ్మతమనియు వేదాంతార్థవిహితమనియు దన గ్రంథములందు రాద్ధాంత మొనర్చినాడు. అట్టి బసవభక్తుని చరిత్రగ్రంథమును నాచే వ్రాయించి శ్రీవీరభద్రశివాచార్యస్వాములువారు తమ గ్రంథమాలికలో వెలువరించినప్పుడు దానికి సదాశివయ్యగారు తొలిపలుకు వ్రాయుట నారాయణరావుగారి దృష్టిలో వింతయే యైనను, అది వీరశైవలోకమున గలిగిన యంతఃకల్లోలముల గొంతయైన జల్లార్చి శాంతి సామరస్యములు గూర్చిన విచిత్రసంఘటనగా రావుగారు సంతసింపగూడదా ! వీరశైవము నిగమాగమోపనిషత్ప్రతిపాదిత మను సోమనాథుని సిద్ధాంతమును గాని, దాని ననుసరించు నా వ్రాతలనుగాని సదాశివయ్యగారు తమ తొలిపలుకులో నేమియు నిరాకరింపలేదుగదా ! ఇంతకు యుగయుగములనుండి నిర్ధారితమయిన వీరశైవమతసనాతనత్వము నేను నారాయణరావుగా రవునన్నంతనే నిలిచి సదాశివయ్యగారు కాదన్నంతమాత్రమున దొలంగునది కాదుగదా !

నారాయణరావుగారు వ్రాసిచ్చినట్లు తమవలె వీరశైవమతౌత్కృష్ట్యప్రకటనమునకు, తద్వాఙ్మయప్రాశస్త్యప్రచారమునకు నే నేమియు గావింపని మాట ముమ్మాటికి సత్యమే. నా వ్యర్థతను విద్యావిహీనతను మొదటనే విన్నవించికొంటినిగదా! కాని రావుగారు తమ వ్యాసముయొక్క యెత్తుగడలో నిందుకు కేవలము వ్యతిరేకముగా నన్నుగూర్చి కొంత యనవసరప్రశంస గావించినారు. అది భ్రమప్రమాదసంజనితమయిన యసత్యముగనో, ముందువెనుక లారయని వీరి ధోరణికి స్వాభావికములగు స్వవచనవ్యాఘాతముల మచ్చుతునుకగనో లోకము గణింపవచ్చును. కాని దానితో పాటు శ్రీనాగేశ్వరరాయప్రభృతులయెడ నే నొక్క మంచిమాటయైన వచింపలే దని రావుగారు నాపయి నారోపించిన దోషముగూడ నసత్యమే యని మనవి చేయుచున్నాను. వీరశైవవాఙ్మయసేవ గావింపని నా యశక్తికి దోడు దానిని గావించిన మహనీయుల బ్రశంసింపని దుర్జనునిగాగూడ రావుగారు నన్ను నిరూపించుట సమంజసము కాదని విన్నవించుచున్నాను. అట్టి ప్రశంస సోమనాథుని చరిత్రరచనమునకే వినియుక్తమయిన కేవలమూలగ్రంథము ౩౩౫ పేజీలలో నెట్లుండ నేర్చును ? దేని కయినను స్థలౌచిత్య మవసరము లేదా ! ఆంధ్రపత్రిక దుందుభిసంవత్సరాది సంచికలో సోమనాథుని కృతులను బరిశుద్ధముగ బరిష్కరించి ముద్రించి ప్రచారము గావించు నావశ్యకతను హెచ్చరించుచు నేను వ్రాసిన వ్యాసము౧ యుద్బోధమును బాటించి యందుమీదటనే శ్రీ దేశోద్ధారకులగు నాగేశ్వరరావుపంతులుగారు రీమహోద్యమమున నుపక్రమించిన విషయము నారాయణరావుగారు, లోకముగూడ నెఱుంగనిది కాదు. పుణ్యశ్లోకులగు శ్రీ నాగేశ్వరరావుపంతులుగారి స్మరణసంకీర్తనములతోనే నా గ్రంథపీఠిక ప్రారంభమయినది. అందలి యీ క్రింది వాక్యమును పాఠకులు చిత్తగింతురుగాక! "........ అయినను దానిని జదివినమీదట గీర్తిశేషులు, చిరస్మరణీయులు, శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు నే నొనర్చిన యుద్బోధమును బాటించి సోమనాథుని బసవపురాణపండితారాధ్యచరిత్రములను కృపాధిపతికేమును దమ యాంధ్రగ్రంథమాలికలో బండితపరిష్కరణములతో విపులములగు పీఠికలతో బ్రకటింపజేసి యాంధ్రలోకమునకు మహోపకార మొనరించిరి..." నారాయణరావుగారు నా గ్రంథము యొక్క మూలము ౩౩౫ పేజీలు, సదాశివయ్యగారి తొలిపలుకుమాత్రమే గాని యందలి నా పీఠిక (౧౬ పుటలు) చిత్తగింపలేదా ! చిత్తగించియు యథార్థవిషయముల జాటుపఱిచి నన్ను గట్టుసేయుటయే పరమార్థముగ గయికొనిరా ! నాగేశ్వరరావుపంతులుగారి యెడ నేనొనర్చిన యీ ప్రశంస "కర్తా కారయితా చైవ ప్రేరక శ్చానుమోదకః, సుకృతం దుష్కృతంచైవ

చత్వార స్సముభాగినః" అను వార్త్యుక్తి ననుసరించి బసవపురాణపండితారాధ్యచరిత్రములను విశేషపరిశ్రమముతో బరిష్కరించి వారి కొసంగి సహాయులయిన శ్రీప్రభాకరశాస్త్రిగారికి, శ్రీనారాయణరావుగారికి గూడ వర్తించునేగదా! ఆర్థికభారమును శ్రీపంతులుగారు వహింప దక్కిన కార్యభారము వహించిన మహనీయులు వీరేగదా! బసవపురాణ పీఠికలోని కొన్ని విషయములగూర్చి విమర్శించి నంతమాత్రమున నాకు ప్రభాకరశాస్త్రిగారి యెడ బూజ్యభావము లేకపోలేదు. బసవపురాణము వెలువడిన కొలదికాలమునకే వారి యమూల్యపరిశ్రమాదికముల బ్రశంసించుచు నా కృతజ్ఞతను వారికి లేఖమూలమున నివేదించియుంటిని. ప్రస్తుతగ్రంథమున సందర్భము పొసంగక శ్రీ లక్ష్మణరావుగారి ప్రశంస చేయలేదుగాని స్థలాంతరములందు దానిని గావించియే యుంటిని. అట్టి లోకోత్తరపరిశోధక మహాశయుని బ్రశంసింపనివారెవరు? ఇంతకు నన్నింతగా దెప్పి నారాయణరావుగారు తా మీ మహనీయులనూవుర యెడ బ్రకటించిన కృతజ్ఞత యేమి? "పరోపదేశే పాండిత్య" మన నిట్టిదే కాబోలు. పండితారాధ్యచరిత్రమునకు దాము పదునేను శీర్షికలతో వ్రాసిన ౩౯౭ పుటల యుపోద్ఘాతములో నెచ్చటనయిన వారిని బ్రశంసించిరా? నాగేశ్వరరావుపంతులుగారిని గూర్చి యైనను కేవలము వారి నామమును స్మరించుట తప్ప దను గ్రంథపీఠిక ౪ పేజీలలో నే జేసినంతటి ప్రశంసయైనను గావించియున్నారా? ప్రభాకరశాస్త్రిగారి యెడ వీరు చూపిన కృతజ్ఞత యెట్టిదో వీరి పీఠికపయి శాస్త్రిగారు *Sri Venkateswara Oriental Research Institute Journal* లో వ్రాసిన వ్యాసముల జూచిన దెలియగలదు. ఇక శివతత్త్వసారపీఠికాకర్తలయిన లక్ష్మణరావుగారియెడ బ్రకటించిన భక్తినిగూడ బరీక్షింపుడు. శివతత్త్వసారమును రచించినది మల్లికార్జునపండితారాధ్యుడని లోకమందఱు నంగీకరించినదే. దానిని మొదట విపులపీఠికతో బ్రకటించిన శ్రీ లక్ష్మణరావుగారుకూడ నట్లే నిర్ణయించిరి. కాని మన నారాయణరావుగారు పండితారాధ్యచరిత్రోపోద్ఘాతము ౭౮వ పేజీలో నప్పటిమట్టుకు శివతత్త్వసారము మల్లికార్జునపండితారాధ్యకృత మని తాముగూడ నంగీకరించునట్లు ధ్వనింపజేసి యటుతర్వాత గొలదికాలములో ప్రబుద్ధకర్ణాటకపత్రికలో "వీరశైవ వాఙ్మయావతారము" అనువ్యాసమును బ్రకటించుచు దానిలో లక్ష్మణరావుగారి నిర్ణయములకు వ్యతిరేకముగా విచిత్రయుక్తులతో సోమనాథుడే వాస్తవముగ శివతత్త్వసారమును రచించి మల్లికార్జునపండితునకు గర్తృత్వ మారోపించియుండు నని నిర్ణయించిరి. దీనిపయి శ్రీ వీరభద్రశర్మగారు ౨౨-౪-౪౦ తేది "విభూతి" (సం ౨ సం ౨)లో శివతత్త్వసారకర్త పండితుడు కాడట. డా॥ చిలుకూరినారాయణరావుగారి విచిత్రయుక్తి" అను ఖండనవ్యాసమును బ్రకటించినారు. సోమనాథుడు వెలనాటిచోడునిసభలో మల్లికార్జునపండితుడొనర్చిన మతవివాదముల వివరించు వాదప్రకరణమును రచించుటలో నౌచితిని బాటించి యాతని శివతత్త్వసారపద్యములలోని పంక్తులను భావములను దన ద్విపదలలో జొనిపియున్నాడు. ఇందలి యౌచిత్యమును లక్ష్మణరావుగారు ప్రశంసించియున్నారు. కాని యితరులకు నౌచిత్యముగా గోచరించినది నారాయణరావుగారి దృష్టిలో చౌర్యముగా బరిణమించినది. శివతత్త్వసారము పండితారాధ్యకృతి యన్నచో సోమనాథునకు గ్రంథచౌర్యదోష మనివార్య మగునని వారి శంక కాబోలు. సహృదయు లెవరయిన నీనిర్ణయమును సమ్మతింతురా? ఇదియేనా లక్ష్మణరాయప్రభృతులయెడ నాకు కృతఘ్నత నాపాదించెడి వీరు తాము ప్రకటించెడు కృతజ్ఞత! ఇక నన్ను మఱియు దెలిసికొనుటకు వీ రెత్తికొన్న భవిప్రశంసకూడ నెంతకొఱమాలిన గొడవయో చిత్తగింపుడు. ఇష్టలింగధారులు కానివారిని భవులని వ్యవహరించుట నేడు కొందఱిలో గానవచ్చినను పాలకురికి సోమనాథు డాశబ్దమును శివభక్తిరహితుడు అను నర్థమునందే గ్రహించియుండు నని నేను నా గ్రంథముయొక్క నవప్రకరణములో సకారణముగ నిరూపించియుంటిని. శైవపరిభాషలో జీవులెల్ల బశువులు. వారి నావరించిన భవమే పాశము. ఈశ్వరుడే పశుపతి.

కావున నందఱును పసువులమే. భవులమే. ఇట్టి భావముతోడనే మల్హణుడు తన శివస్తుతిలో "శంభో భవంత మభవం భవినో నమంతి" ఇత్యాది స్థలములలో భవిశబ్ద ముపయోగించినాడు. నాదృష్టిలో నాకన్న భవి (భవము కలది) యనదగిన జీవి సృష్టిలో లేదు. అట్టియెడ బసవపురాణ పండితారాధ్యచరిత్ర పరిష్కరణప్రకటనములకయి పరిశ్రమించి శివభక్తలోకమునకు మహోపకార మొనరించిన ప్రభాకర శాస్త్రిగారిని, నారాయణరావుగారిని భవులుగా నేను గలనయిన భావింపగలనా? లక్ష్మణరావుగారుకూడ నాగేశ్వరరావు పంతులుగారివలె నారాధ్యబ్రాహ్మణ కుటుంబమునకే చెందినవారనట నారాయణరావుగా రెఱుంగరేమో?"

ఇక నాగ్రంథములో సగము సుమారు విమర్శతో నిండియున్నదని "విమర్శకాగ్రేసర" బిరుదాంచితుడనగు నే రచించిన గ్రంథములో ఆపాటి విమర్శనమే లేకున్నచో అది గ్రంథమే కానేరదని రావుగారు మఱియొక విసరు విసరి, పయిగా నావిమర్శ కీసారి వేటూరివారు చాలవఱకు సుతితప్పిరనియు దాము మాత్రము సుతిరైతి మనియు వ్రాసినారు. నేను వేటూరి వారిపయి వ్రేటులు విసరినది లేదు. చిలుకూరివారిపయి జెలరేగినదియు లేదు. "విమర్శకాగ్రేసర" బిరుదము నెప్పుడెవ్వరు నాకతికించినారో నాకు సరిగా దెలియదు. ఈ గ్రంథమును బ్రకటించినది శ్రీ వీరభద్రశర్మగారు. నా పేరికి ముందు "విమర్శకాగ్రేసర" విశేషణమును జేర్చినదియు వారే. ఈనాడు బిరుదము లొసంగు మహనీయులకు సంస్థలకు మనదేశమున గఱవు లేదు. నేటి బిరుదములు చాలవఱకు నేతిబీరలే యని విజ్ఞులు పలువు రెఱుంగనిది కాదు. తక్కినవారి మాట యెట్లున్నను నాయీబిరుదము నేతిబీఱ, నీటిమూటల వంటిదే. ఎవరు దానిని నా కనుగ్రహించియున్నను నా యనర్హతను గమనించి నేను దానిని బరిహరించితినే గాని పరిగ్రహింపలేదు. నేను స్వతంత్రముగ బ్రకటించిన గ్రంథములలోగాని పత్రికలకు బంపిన వ్యాసములలోగాని దాని నెన్నడు చేర్చికొనలేదు. కావున నిందుగూర్చి రావుగారు పరిహసింప నవసరము లేదు.

నేను లడాయికోరు, జగడాలమారిని గానట్లే యిచ్చకాలమారినిగూడ గాను. అది నాయందలి దోషమే యగుగాక! "నెమ్మిచేసైన గృతిని గుణమ్ము లెల్ల నగపడుం బగచేసైన నన్ని దోషము లటుగావున నారెంటిమెనయక యాత్మ గృతివిమర్శకు లగువారు హితులు గవికి" అని శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు బిల్వేశ్వరీయపద్యమున జెప్పినవిమర్శనమే నా యాదర్శము. రావుగా రారోపించిన విసరులు, చెలరేగుటలు, దుముకుటలు, బుస్సుమని లేచుటలు, నాగ్రంథమును జదివి సహృదయు లవి యందేయున్నవో, లేక నారాయణరావుగారి ప్రస్తుత వ్యాసముననే యున్నవో నిర్ణయింతురుగాక! సోమనాథుని నివాసస్థలము, కులము, కాలముగూర్చి నారాయణరావుగారి యభిప్రాయములపయి నేను గావించిన చర్చలను దమపయి నేను మోపిన నేరములుగా రావుగారు పేర్కొనుట శోచనీయము. అట్టి దారుణ శబ్దము నే నెచ్చట నుపయోగించియుండలేదు. బరాబరాయని తాళము వేసి తమ నిర్ణయముల నామోదింపక వానిని గూర్చి చర్చించుటయే నేరమని నిరూపించు తలంపుతోడనే రావుగారిట్లు తాఱుమారు చేసి వ్రాసియుందురేమో! అట్లేరైనచో సహృదయులు నా గ్రంథమును సాంతముగ జదివి నా నేరముల నారసి యుచితదండన మొనరింతురుగాక! నా గ్రంథములో "సోమనాథుని వంశము; కులగోత్రములు" అను ౫వ ప్రకరణము చివర ౬౯, ౭౦ పుటలలో నున్న వాక్యముల నుద్దేశించి రావుగారు తమ హృదయమున అభిమాన దురభిమాన మాత్సర్యము లావరింపలేదని, యవి నా కుండవచ్చునేమోగాని తమకు లేవని యేమేమో వ్రాసినారు. అందలి యొండు రెండువాక్యముల నుదాహరించెద చిత్తగింపుడు.

"మహాకవు లేకులజు లయినను వారి కవితాగౌరవము కతన నెల్లరకు బరమపూజ్యులు. 'చరిత్ర చరిత్రకొరకే' యను సూత్రము ననుసరించి చరిత్రకారులు దురభిమానముల దూరముగ ద్రోలి యెట్టి కష్టనిష్ఠురముల కోర్చియైనను సత్యనిర్ణయమున కయి శక్తివంచన లేక ప్రయత్నింపవలెను. లేనిచో వారు లిఖించిన చరిత్రము

నకు సహృదయుల దృష్టిలో విలువ గలుగ జాలదు. మలినజలమున బింబము ప్రతిఫలింపనట్లు లభిమాన మాత్సర్యము లావరించినచో హృదయమునకు సుస్పష్ట విషయములందుగూడ సత్యము స్ఫురింపనేరదు...... ....సోమనాథుని సహజవీరశైవత్వ మాతని గ్రంథముల వలన నడుగడుగునకు బ్రవ్యక్త మగుచున్నను, నందుకు సంబంధించిన యాతని సహజకులగోత్రములను వీరశైవ సంప్రదాయానుగుణముగ నాతడు స్వయముగ జెప్పికొన్నను, వాని నాతని శిష్యప్రశిష్యులు కూడ మరల చేర్కొన్నను వాని నెల్ల త్రోసిరాజని దురభిమానమునే ప్రధానముచేసికొని కొందఱు సత్యమార్గములకు నభిప్రాయము లిప్పటికిని వెలువరించుటచే నన్నివార్యమయి యీ ప్రకరణము నిట్లు ప్రపంచింపవలసి వచ్చినందుకు విచారించుచున్నాము. సత్యప్రియులు సత్యమునే గుర్తించి చరితార్థు లయ్యెదరుగాక!" సామాన్యధర్మసూచకముగ సాముదాయికముగ నేను వ్రాసిన యీ వాక్యములను రావుగారు తమపయి నేల యారోపించుకొనవలెనో తెలియకున్నది. సోమనాథుని స్థలము, కులము, కాలము నారాయణరావుగారివంటి విమర్శకులకువలెనే నాకును ముఖ్యములు గావు. అవి యేవైనను నా కొఱఁగునదిగాని, యితరులకు దొలఁగునదిగాని యేమియు లేదు. కవితామృత పిపాసువులకు ధన్యాత్ముల కిట్టివానితో నిమిత్తము లేదనియు బయిగా వారి కవి కంటగింపుగా నుండు ననియు "చరిత్ర చరిత్రకొఱకే" యనియు మొదటినుండియు నేను పాడుచున్నదియే. సోమనాథుడు, శ్రీనాథుడు, వేమన మున్నగు నేకవివిషయమున నైనను నేనేమి వ్రాసినను, ఆ చర్చలలో కొందఱ యాగ్రహమునకు గురియై కొన్ని కష్టనష్టములకు లోనగుచున్నను, ఆ కవివరుల కవిత, భాషయందలి గౌరవముచేతనేగాని వారి కులము, మతమును బురస్కరించుకొని కాదని ముక్తకంఠముతో మనవిచేయుచున్నాడ. భాషాసేవకు లందఱువలెనే యవ్విషయమున నాకును ప్రేరకమయినది సహజమయిన భాషాభిమానమేగాని నారాయణరావుగా రారోపించునట్లు మఱేదేని దురభిమానమాత్సర్యములు గావని సహృదయులకు విశదీకరింప నవసరము లేదు.

ఇక రావుగారు తమ వ్యాసమున "పాలకురికి" "సహజవీరశైవత్వము" "సోమనాథుని కాలము" అను శీర్షికల క్రింద వ్రాసిన ప్రతివిమర్శనాంశముల యౌచిత్యమును పాఠకులు నా గ్రంథమందలి ౩, ౪, ౫, ౧౦, ౨౧ ప్రకరణములు చదివినచో దామే తెల్లగా నిర్ణయింపగల్గుదురు. పత్రికాధిపతు లాదేశించిన స్థలపరిమితిలో నేను వానికిగూడ నిందు సమాధానము లొసంగ నవకాశము కలుగలేదు. కావున నా గ్రంథమును సాకల్యముగ జదివి పాఠకులే రావుగారి వ్రాతలందలి సామంజస్యము నుచితరీతిని సంభావింప బ్రార్థింతును.

"మీసరగండ ! కఠారిసాళువాంక" అనియు సంబోధన లుండుటచేత, నీశాసనమున ప్రస్తుతుడైన కంపరాజు సకే హయలక్షణవిలాసము కృతి యీయబడెనని స్పష్ట మగుచున్నది. మఱియు నీ ఔబళార్యుని కంపరాజు శాసనము క్రీ. శ. ౧౪౫౯ నాటిది తిరుపతి దేవస్థానమున గలదు. (చూడుడు తిరుపతి దేవస్థానశాసనసంపుటము-౨. పుట ౧౨. సాళువ నరసింహరాయని శాసనములు నెం ౫౦ రు) ఇందు ఔబళకంపరాజు ప్రతిదినము నిత్యమాడలు దేవునికి సమర్పించుటకు వేయిపణముల నొసగెనని చెప్పబడినది. ఇది తమిళశాసనము.

ఈ శాసనకాలము శా. శ. ౧౩౮౦ బహుధాన్య మార్గశీర్ష శుద్ధ ౧౦ ఆదివారము. ఇది క్రీ. శ. ౧౧-౨-౧౪౫౯ తో సరియగును. పై రెండు శాసనములవలన మనమంచి భట్టుకాలము క్రీ. శ. ౧౪౪౨-౧౪౫౯ ప్రాంతమని నిశ్చితమగుచున్నది.

## ౨

## శ్రీనాథుడు - గౌరన - ముక్తికాంతభిక్షావృత్తి

### (క్రీ. శ. ౧౪౪౯)

శ్రీనాథమహాకవి శివరాత్రిమాహాత్మ్యమును, గౌరన నవనాథచరిత్రమును, శ్రీశైలభిక్షావృత్తిమహాధ్యక్షుడగు ముక్తికాంతరాయనికి కృతి నిచ్చియున్నారు. ఈ ముక్తికాంతభిక్షావృత్తిశాసనము శ్రీశైలమున తూర్పుగోపురముపైపున గల శాసనములలో గలదు. ఇది పెద్దశాసనము. క్రీ. శ. ౧౪౪౯ (శా. శ. ౧౩౭౧) లో ముక్తికాంతయ్య భిక్షావృత్తిమహాధ్యక్షుడై, శ్రీశైలమునకు శివరాత్రినాడు తీసికొనివచ్చెడు సామగ్రిపై పన్ను వసూలుచేయుటకు చాలుమూలవారి కిచ్చిన ఆజ్ఞాపత్రము. ఇది వీరబలిజశాఖీయులకు సంబంధించినది. ఇందులో నామతాధ్యక్షుల బిరుదములు, పన్నుల వివరమును గలవు. శ్రీశైలశాసనములలో ముక్తికాంత భిక్షావృత్తి, శాంతలింగభూపతిశాసనములు గలవు. వీనిలో కొన్నింట పద్యములు గలవు. ఈ శాంతభిక్షావృత్తిశాసనమువలన శ్రీనాథుడు, గౌరన ఇరువురు క్రీ. శ. ౧౪౪౯ లో నున్నారని రూఢియగుచున్నది. ఈ శాసనములో కొంత భాగ మిందు ప్రకటితము.

"స్వస్తిశ్రీవిజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౩౭౧ అగు నేటి విభవసంవత్సర ఆషాఢ శు ౧౫ సో. స్వస్తిశ్రీ శ్రీ పర్వత శ్రీస్వయంభు శ్రీలింగ చక్రవర్తి శ్రీమల్లికార్జునమహాలింగదేవరకున్ను శ్రీత్రిపురాంతకదేవరకున్ను. స్వస్తి సమస్తభువనజనవినుత విపుల విఖ్యాతలోకాలోకపర్యంతర పంచాశత్కోటి విస్తీర్ణ భూమండలమాదిగాంగల వీరశాసనంబ్రానేకైక భూరిగుణగణాలంకృతసత్యశౌచసమాచారచరిత్రవినయవిపులవిజ్ఞానకీర్తివీరావతార వీరజలంజసమయ ధర్మప్రతిపాలకుల రత్నవిశుద్ధగరుడస్వజనమోహనతులున్ను కనకకంచుళియ కామదేవరలున్ను బాలదేవతాసుధేను కుంజరిపు బలభద్రపుత్తుంగభద్రనంది కీర్తివిదారకాంతిర్ద్ధులున్ను కృతయుగత్రేతాయుగ ద్వాపర కలియుగ ప్రవర్తకులున్ను పరమమాహేశ్వరులున్ను భక్తజనచింతామణులున్ను పరనారీసహోదరులున్ను రుంనల ధర్మబద్ధసుధర్మచారిత్రులున్ను యెకశంఖకాహళభేరి మృదంగగంభీరులున్ను త్యాగవిరించులున్ను భోగదేవేంద్రులున్ను సత్యహరిశ్చంద్రులున్ను సభాగాంగేయులున్ను మందరాచలధీరులున్ను తేజసూర్యులున్ను స్వకీర్తిచంద్రులున్ను విఘ్నేశ్వరబల. పుత్రులున్ను వితరణకర్ణులున్ను దుట్టరధూమకేతులున్ను యేకైకవీరులున్ను లోకైకమాన్యులున్ను గజితబలాడరాయశిరశ్శకండుక క్రీడావినోదపరాయణులున్ను బాదరాయని స్థారపలున్ను, దేశిస్థాపనాచార్యులున్ను అష్టదిక్కురాయమనోభయంకరులున్ను మొగలు వెలంగోడిమ...లున్ను దధిచసమయచారిత్రులున్ను మందారిపట్టగలున్ను పృథ్వీటీకకము ఆకాశమె మెలు.. యవంటిరి దిక్కులు మకుటతోరణవయభావాలంకృతులైన స్వస్తి సమస్తనిజనామాంక్కితులున్ను, స్వస్తిసమస్తప్రశస్తసహితులైన శ్రీమహేశ్వరవీరేశ్వరదేవదివ్యపాదపద్మారాధకులైన అభినవ జంబూద్వీపానకు దీపశిఖామణిగైన పృథివి మూలస్థానం శ్రీమల్లికార్జునదేవుని శివరాత్రిమహోత్సవానక్కు శ్రీశైలానక్కువచ్చి దేవరకొండ సమయకార్యనిమిత్యమై శ్రీమల్లికార్జునదేవుని ముఖమంటపమందు వజ్రసింహాసనారూఢులై కూర్చుండి సమయాచారం నిర్వహించి కంచికట కల్యాణశాసలనీవాలకు మొదల్ను పృథివి

యేంశ్రైయ్యోరుదేశాల ఆయ్యావళి చాలుక్యూలముఖ్య మైన సమస్త (నా)యకంద్రులున్ను, ముక్తికాంత విష్ణువృత్తిలయ్యంగారు శ్రీశైలసమయసింహాసన మందు తపోరాజ్యం సేయుచుండగాను దేవకొండవారు పసినప్రావాహానపు తెకంత్రఘంటవెత్తిను దెరతాను దేశ మున్నతా పేం ఆ ఇ సమయాచారము నిర్వహించి చాలుక్యాల సమస్తశక్తక్రీడాను సద్ధరించిరిగాన మేము మాఘ క్తిపూర్వతానను శ్రీమల్లికార్జునదేవరకున్ను శ్రీ త్రిపురాంతకదేవరకున్ను ముక్తివిష్ణుకృతులయ్యం గారి స...మునను దంసంశెట్టి అమృతపళ్ల కిచ్చిన మూల విశాలసర్వశాసనం....."(*Mackenzie Collection* 279 (15-3-6) 84-86 *Pages*.)

## 3. కానుకొలను అన్నమరాజు
### (క్రీ. శ. ౧౪౯౪)

ఆంధ్రవాఙ్మయమున మనకు లభించిన యమరు కాంధ్రీకరణములలో కానుకొలను అన్నమరాజుదే మొదటి కృతి యని చెప్పవొప్పును. ఇది పూర్తిగ లభింపలేదు. కాని యిందుండి ప్రబంధరత్నావళిలో నీ క్రింది పద్య ముదాహృతమై అంధ్రీకరణ మున్నదని తెలుపుట కాధార మైనది.

"చులుకన జాపముం దిగుచు
  చో గటకాముఖపాళిమీద నె
ల్లొలయు నఖాంశులం గదిసి
  రొమ్మెపుడు కెంజిగురాకుగత్తిచే
నలవడి కర్ణపూరమున
  నంటిన తుమ్మెదవోని పార్వతీ
లలనకటాక్షదృష్టి మన
  లం జరితార్థుల జేయుగావుతన్."

ఈయన్నమరాజు క్రీ. శ. ౧౪౯౪ లో నున్న ట్లీ క్రిందిశాసనమువలన దెలియుచున్నది.

"శ్రీగణాధిపతయే నమః శ్రీజయాభ్యుదయశాలి వాహనశకవర్షంబులు ౧౪౧౬ అగు నేంటి ఆనందసంవ త్సరశ్రావణ బ ౧౦ ఆ రోహిణీనక్షత్ర శు(లాల)గ్న మందు, యజనయాజనాధ్యయన అధ్యాపకదాన ప్రతిగ్రహషట్కర్మ నిరతులైన యజుశ్శాఖ అంగిరస, బార్హస్పత్యభారద్వాజ గోత్రులైన కాముంగొలని సూరపరాజు అన్నయ్యకొడుకు అన్నయ్య(ను) శ్రీ తుంగభద్రాతీరం భాస్కరక్షేత్రమందుల శ్రీ పంపా విరూపాక్షదేవండు ఆయురారోగ్య అయిశ్వర్యాభి వృద్ధి అగునట్లుగాను ఆచంద్రార్క పర్యంతం రక్షిం (చు)ను. మంగళమహాశ్రీ శ్రీం జేయుక్." (దక్షిణ హిందూదేశశాసనసంపుటములు ౪ సంపుటము. నెం ౨౮౧ రు, ౬౦ పుట హంపీక్షేత్రశాసనములు) ఇందు పేర్కొన్న భాస్కరక్షేత్రము సత్రిప్రదేశము.

ఈ శాసనమున పేర్కొనబడిన అన్నయ్యయే అన్నమరాజు. ఈతని తాత సూరపరాజునామ మీవిష యమును స్పష్టముచేయుచున్నది. మఱియు నీత డాప స్తంబసూత్రు డనియు, భారద్వాజగోత్రు డనియు, భాస్కరక్షేత్రవాసి యనియు దెలియుచున్నది. కాముం గొలనే 'కానుకొలను' అయినది. ఈ అన్నమరాజు పద్యము త్రిపురాంతకదేవుని గూర్చినది ప్రబంధరత్నా వళిలో శతకకవులచరిత్రలో (పుట ౪౪౬) 'కాను కొలను నాయనప్ప' అని కలదు. అతనిగూర్చి ప్రకటితము లైన వివరములు తెలియవు.

## ౪. హరిభట్టు - కృష్ణదేవరాయలు
### (క్రీ. శ. ౧౫౧౩)

హరిభట్టు బహుగ్రంథ రచయిత. తెనుగున (౧) వరాహపురాణము (అముద్రితము) (౨) మత్స్య పురాణము (౩) ఉత్తరనారసింహపురాణము (ఇవి ముద్రితములు) (౪) భాగవతము, షష్ఠస్కంధము, ఏకాదశ ద్వాదశస్కంధములు (అముద్రితము) (౫) సం స్కృతమున రతి రహస్యము (ఇది గద్వాలసోమ భూపాలుని తెనుగు పద్యముల యనువాదముతో ముద్రిత మగుచున్నది) అనునవి లభ్య మగుచున్నవి. హరిభట్టు శ్రీకృష్ణదేవరాయని కాలమువా డని క్రీ. శ. ౧౫౧౩లో నున్నా డని యీక్రిందిశాసనమువలన తెలియనగును.

"శుభమస్తు స్వస్తిశ్రీవిజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౩౫ అగు నేటి శ్రీముఖసంవత్సరం ఆశ్వీజ శు ౧౨ పుణ్యకాలమందు శ్రీమన్మహారాజాధి రాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీకృష్ణరాయ మహా

రాయలుంగారు సుఖానురాగం శ్రీరాజ్యం చేయుచుండు గాను శ్రీమద్రఘుపతినాయకాచార్యులైన శ్రీవీరరామ నాయకులవారు శ్రీభారద్వాజగోత్ర ఆపస్తంభ సూత్రం యజుశ్శాఖాధ్యాయులైన శ్రీరామచంద్ర భట్టోపాధ్యాయులు పుత్రులైన హరిభట్టోపాధ్యాయు లకు ఇచ్చిన తామ్రశాసన మెట్లండునను మా అధికారానికి చేరిన చిన్నపల్లే అను గ్రామమునకు శ్రీరామసముద్రం అని ప్రతినామం చేసి మా మాతాపితృవులకు పుణ్య లోకప్రాప్తికై శ్రీరామసన్నిధిలో సహిరణ్యోదక దాన ధారాపూర్వకంగాను సమర్పించిరి. ఈ గ్రామానికి జల్లే విధ్యాదిసమస్తతేజస్స్వామ్యములున్న మీరు పుత్ర పౌత్రాదులుగా అనుభవించుకొని మా వంశస్థులకు శ్రేయఃప్రార్థన చేసుకొని సుఖంగా వుండేది అని వ్రాయించియిచ్చిన తామ్రశాసనము స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం; పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్. దానపాలనయో ర్మధ్యే దానాత్ శ్రేయోనుపాలనం దానాత్ స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం శ్రీరామ."

*(A. R. of Mysore Archeological Report* 1927 *Kolar Inscriptions No.* 69. *Page* 77. *A copy of Ramasamudra grant of King Krishnaraya of Vizianagram dated saka* 1435 *in the possession of Saule Seshachar in Kolar Town.)*

పై శాసనములోని విషయములను సమన్వయించుటకు హరిభట్టు గ్రంథములనుండి యాతని వంశవృత్తాంతము తెల్పు పద్యముల నుదాహరించుచున్నాడను.

"భారద్వాజసగోత్రసంభవుడ, నా
పస్తంబుడన్ దిమ్మనాం
బారాజద్వరగర్భసంభవుడ రా
మస్వామిసురానేక జ
న్మారూఢాధికపుణ్యలబ్ధహరి నా
మాంకా త్తసత్పుత్రుడన్ .
శ్రీరామావరపాదపద్మయుగళీ
చింతాసమాయుక్తుడన్."(మత్స్య. ౧-౫)

వరాహపురాణావతారికలో—

"అమృతప్రాయవిశేషకావ్యరచనా
హంభావపుంభావనా
గ్రమణీమూర్తివి వేదశాస్త్రవివిధ
గ్రంథార్థనిర్ణీతి, వే
క్రముఖబ్రహ్మవు యాజుషప్రకటశా
ఖాధర్మధుర్యుండవ
ర్యమతేజుండవు రాఘవార్య హరిభ
ట్టా సత్కవిగ్రామణీ!"

హరిభట్టుకాలము నీవఱకే శ్రీ డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు చక్కగ నిర్ణయించినారు. (భారతి. విక్రమ పుష్య. ౧౬-౨౮ పుటలు.) ఈతడు సరిగా కృష్ణదేవరాయల కాలమువాడని యీ శాసనము స్థిరపఱచుచున్నది.

## ౫. భద్రకవి - లింగకవి

(క్రీ. శ. ౧౫౩౦-౪౦)

శ్రీకృష్ణదేవరాయలయుగమున, అనగా క్రీ. శ. ౧౫౦౦-౧౬౦౦ వఱకు గల కాలమున వెలసిన ద్విపద కవులలో నొకడగు నీలింగకవిచరిత్ర మింతవఱకు కవిచరిత్రల కెక్కలేదు. మఱియు నీతడు వీరశైవు డగుటచే, కేవలవైష్ణవయుగ మనదగిన రాయలయుగములో ప్రసిద్ధుడైన యీకవి కాల మెఱుంగుట యావశ్యకమే యగును.

వంశవృత్తాంతము:— ఈతడు రచించినవి రెండు ద్విపదకావ్యములు: ౧. దేవాంగపురాణము, ౨. సానంద చరిత్ర. వీనివలన నీతని వంశవృత్తాంతము, కాలము తెలియబడుచున్నవి. ఈతడు కూడలిసంగమక్షేత్ర నివాసి. ప్రసిద్ధశైవభక్తుడగు దేవరదాసమయ్యవంశీయుడు. రామయప్రభునికి నమలాంబకును పుత్రుడు. ఈతని వంశవర్ణనముబట్టి చూడ నీతడు రాజ్యాధికారి యని తోచుచున్నది.

"ధరణిపై దేవర దాసయ్య వంశ
వరనిధి సంపూర్ణవార్ధిచంద్రుండు
దురితదూరుడు శివద్రోహర గండ
బిరుదప్రతాపగంభీరవర్తనుడు
చరితార్థచరితుండు సత్యసంధుండు
సరసుండు శివధర్మశాస్త్రకోవిదుడు

పరమశివజ్ఞానభరితాత్ముఁ డనఁగ
బరగిన రామయప్రభు కీర్తిసుతుఁడు"
(దేవాంగపురాణావతారిక)

"జంగమకులవార్ధిచంద్రోదయుండు
లింగైకనిష్ఠావిలీనమానసుఁడు
... ... ... ...
భాసిల్లు రామయప్రభువరేణ్యుండు
తనదు పాతివ్రత్యధర్మమార్గమున
యనవరాయ కెనయైన యమలాంబవలన
గనిన పుత్రుఁడు భద్రకవి లింగవిభుఁడు."
(సానందచరిత్ర యవతారిక)

ఈతని గురువు శ్రీ కాళహస్తి సంగమేశ్వరు డైనట్లు—

"చిరభవాంబుజహస్తి శ్రీకాళహస్తి
గురుసంగమేశ్వరుఁ గొనియాడి పాడి"

అని తన గ్రంథములో చెప్పియున్నాఁడు.

కాలము:—లింగకవి తన దేవాంగపురాణమును రచియించు నాఁడు పడవీడున కధిపతియగు శ్రీ కాళహస్తీశుఁడను మహాపురుషు డధీశ్వరుఁడుగా నున్నట్లుగా నిట్లు చెప్పినాఁడు:

"భూనారికిని శిరోభూషణంబైన
మానితద్రావిడమధ్యదేశమున
వడరు మర్త్యస్వర్గమగు మధురరస
పడవీడు సకలసంపదలకు వీడు
... ... ... ..
ఇరవొప్పు కాళహస్తీశ్వరు డనెడి
పురుషాగ్రగణ్యుఁ డప్పురి కధీశ్వరుఁడు
పట్టణంబుల కెల్ల బరగిన తల్లి
పట్టణంబయినట్టి పడవీటియందు."
... ... ... ...

పైని పేర్కొనబడిన కాళహస్తీశ్వరుఁడు కృష్ణదేవరాయని వెనుక విజయనగరసామ్రాజ్యమును పరిపాలించిన యచ్యుతదేవరాయలకాలమువాఁడు (క్రీ. శ. ౧౫౩౦-౧౫౪౨). ఈత డా కాలమున పడవీడును పాలించుచున్న ట్లీ క్రిందిశాసనములు కన్పట్టుచున్నవి.

ఉత్తరార్కాడుజిల్లా, దేవకీపురమున బృహదంబాదేవియాలయమున శాసనములు.

శా. శ. ౧౪౫౨ క్రీ. శ. ౧౫౩౦. పడవీడు తిరుమలేశ్వరుని వసంతమండపనిమిత్తము భూదానము.

౧౪౫౨—౧౫౩౦. దేవకీపురము దేవాలయము ధర్మకర్తృత్వము (శ్రీ కాళహస్తి నాయకుఁడు).

౧౪౫౪—౧౫౩౨. ఇందులో స్పష్టముగా: కొండమనాయకు డనువా డా కాలమున గొల్లలను దేవాలయమునకు సేవకై వినియోగించుటకు పడవీడును పాలించుచున్న కాళహస్తీశ్వరనాయకుని యనుమతిని బొందె నని కలదు.

౧౪౫౪౧౫—౩౨ దేవాలయమునకు ప్రతిమగ్గము పైని ౧౨ పణములు పన్ను కట్టుటకు శాసనము. ఇందు కాళహస్తీశ్వరుఁడు పేర్కొనబడినాఁడు.

(*Ep. Reports*. 1918. *page* 44,45
*Nos* 864,874, 878,877,)

పై శాసనముల ననుసరించి లింగకవి యచ్యుతదేవరాయలకాలమువా డనుట నిశ్చితము.

కవిత్వము, కావ్యములు:—ఈతఁడు శివకవి గావున, కృత్యాదిని పండితత్రయమును, పాల్కురికి సోమనాథుని, పిడుపర్తి బసవేశ్వరుని, శివయోగీంద్రుని (నాగులూటి శివనారాధ్యుఁడు - పర్వతపురాణకర్త), రంగనాథుని స్తుతించియున్నాఁడు. ఈతని కాలము క్రీ. శ. ౧౫౩౦ ప్రాంత మగుటవలన పిడుపర్తి బసవన, శివయోగీంద్రుఁడు ననువారి కాలములుగూడ స్పష్టముగా దెలిసికొనుటకు వీలు కలుగుచున్నది. ఈతఁడు తన కవిత్వమునుగూర్చి—

"తెనుఁగున నెఱవాది ద్విపదకు రాజు."

"వినుతశబ్దబ్రహ్మవిద్యానిరూఢి
ఘనతవహించిన భద్రకవిలింగవిభుఁడ
రమణీయశివకవిరాజన్యహృదయ
కమలమిత్రుఁడు భద్రకవిలింగవిభుఁడు
నెఱయ నాతనికంటె నేర్పరి గలఁడె."

అని తెలుపుకొనినవాఁడు.

దేవాంగ పురాణము:—ఇది యేడాశ్వాసముల ద్విపదకావ్యము. దీనికి మూలము బ్రహ్మాండపురాణము. ప్రథమాశ్వాసమున దేవాంగఋషిజననము, దేవశాస్త్ర నిర్మాణము వర్ణితములైనవి. ద్వితీయాశ్వాసమునుండి ఆఱవయాశ్వాసమువఱకు నాతఁడు విద్యాధర, పుష్పదంత, వేతాళ, వరరుచి, దివసాళి, దేవరదాసి యవతారముల కథ వర్ణితము. సప్తమాశ్వాసమున దేవాంగకులమున జన్మము, కులప్రశస్తి చెప్పబడినది. దేవరదాసి జైనులను ఖండించి శైవమును పెంపొందించెను. ఈగ్రంథము

చివర సోమకేంద్రు డను నొక దేవాంగుని వంశక్రమము వర్ణితమైనది.

ఈకృతిలో నింద్రజాల, రస, వైద్యాదివిషయములు పెక్కులు వివరింపబడినవి. ఈ గ్రంథము ముదునూరి రామేశ్వరస్వామి కంకితము.

సానందచరిత్ర:—ఇది సానందు డను శివభక్తుని చరిత్రమును దెలుపును. మూడాశ్వాసముల కృతి. అరుణాచలమున కుత్తరమునసున్న అరుణాద్రిమంగళ మను గ్రామమున నున్న వీరభద్రయ్య యను జంగమదేవర కంకితము. ఈతడు సంగయదేవరకొమారుడు. ఈ ద్విపద రచనమునకు, కోట శివరామకవిపద్యసానందోపాఖ్యానమునకు చాలచోట్ల పదసాదృశ్యము గలదు. లింగకవి శివరామకవికంటె ముందువాడు గాన, ద్విపదగ్రంథమే పద్యమునకు మూలమని చెప్పనొప్పును.

ఈతని గద్యలు—(౧) దేవాంగపురాణము :

ఇది వీరభద్రమహిమ ప్రసాద
విదితసత్కావ్యప్రవీణధురీణ
సంగమేశ్వరగురుచరణారవింద
సంగతగంధపుష్పంధయమాన
ఘనయశోనిధిభద్రకవిలింగధీర
వినుతమాధుర్యవాగ్విరచితంబైన
ప్రకటదేవాంగపురాణంబునందు
నకలంకముగ......ఆశ్వాస మయ్యె.

(౨) సానందచరిత్ర :

ఇది వీరభద్రశ్రీమహాప్రసాద
సదమలసత్కావ్యసందర్భకుశల
చిరపుణ్యశోభితశ్రీకాళహస్తి
గురుసంగమేశ్వరకోమలచరణ
జలజాతగంధపుష్పంధయమాన
కలితమానసభద్రకవిలింగధీర
విరచితసానందవిమలచారిత్ర
అరుదైన భవలతాయతలవిత్రంబు
సకలపవిత్ర మీ సత్కథయందు
అకలంకగతి ద్వితీయాశ్వాస మయ్యె.

పల్నాటివీరచరిత్రమున కొల్ల పోట్లాట రచించిన మల్లన తల్లిదండ్రులు అమలాంబ, రామనమంత్రి కాండిన్యగోత్రులగుటచే లింగకవి తలిదండ్రులు గా రని యొఱుంగునది. (ప్రా. సంఖ్య ౧౧౧౨)

## ౬. పచ్చకప్పురపు తిరువేంగళకవి

(క్రీ. శ. ౧౫౩౮-౪౦)

అచ్యుతదేవరాయల కాలమున ప్రసిద్ధుడైన మఱియొక ద్విపదకావ్యకవి తిరువేంగళకవి. ఈతడు భట్టుకులజుడు. మనకు తెలిసినంతవఱకు భట్రాజులలో నితడు మొదటికవి యని చెప్పవచ్చును. ఈతడు రచించిన చొక్కనాథచరిత్ర అను గ్రంథమునుండి యాతని వంశవృత్తాంత మిది:

కృతిపతి యాతనిగూర్చి ప్రస్తావించుచు—

"అనఘుండు మాతాత యగు తిమ్మరాజు
తన తమ్ము డయ్యలు దాను నిమ్మహిని
ప్రౌఢుడై చదువుల బరగ మెప్పించె
ప్రౌఢరాయలచేత పచ్చకప్పురము
రాజనగా తిమ్మరాజుకు దిప్ప
రా జుదయించె విరాజితమ్ముగను
రాజుల మెప్పించె రసికు డాతని త
నూజు డవార్యసన్నుతకవీంద్రుడవ్వ."

అని చెప్పినాడు. తిరువేంగళుని తండ్రి తిప్పరాజు. అతని తండ్రియగు తిమ్మరాజును, పినతండ్రియగు నయ్యలరాజును తమ విద్యావిశేషముచే ప్రౌఢదేవరాయలను మెప్పించి, పచ్చకప్పురము బహుమతిగా బడసి, అనాటినుండి పచ్చకప్పురమువారైరి. ఈ ప్రౌఢదేవరాయలు క్రీ. శ. ౧౪౨౨ నుండి ౧౪౪౬ వఱకు విజయనగరసామ్రాజ్యమును పాలించిన యిమ్మడిదేవరాయలు కాదగును. మనుమడు క్రీ. శ. ౧౫౩౮ ప్రాంతమునవుండుటచే, తాత క్రీ. శ. ౧౪౫౦, ౬౦ ప్రాంతమున నుండుట విరుద్ధము కాదు.

కాలము :—తిరువేంగళకవి చొక్కనాథచరిత్రను నన్నెవందలిపురాధ్యక్షుడగు గోళ్ల పెద్దరామనాయకునికి కృతిగా రచించెను. ఈతడు గోళ్లచిన్నరామనాయకుని యన్న. అన్నదమ్ములిరువురును అచ్యుతదేవరాయ ప్రతాపకార్యధురంధరులై దక్షిణదేశమున, రామ్నాడు జిల్లాయందలి తిరుపత్తూరిసీమను పరిపాలించుచుండెడివారు. వీరు కమ్మకులజులు. బసవనాయకునికి దిప్పమ్మవలన జన్మించినవారు. పిప్పాలగోత్రులు. సుప్రసిద్ధమధ్వమతాచార్యుడగు వ్యాసతీర్థుని శిష్యులు. వీరికి ఉపనారిసింహము లను బిరుదు గలదు. వీరిలో గోళ్ల పెద్ద రామనృపాలుడు అచ్యుతదేవరాయల పుణ్యమునకై శా. శ. ౧౪౬౦ క్రీ. శ. ౧౫౩౮ లో, విలంబి సంవత్సర దక్షిణాయన పుణ్యకాలమున తిరుపత్తూరునందలి తిరుత్తళినాయకారు దేవాలయ

మునకు శాంతమంగళ మను గ్రామమును దాన మొనర్చి శాసనము వేయించినాడు (*EP. No.* 179 *of* 85-86). దీనినిబట్టి తిరువేంగళకవి క్రీ. శ. ౧౫౩౦ ప్రాంతమున నున్నట్లు స్పష్టము.

చొక్కనాథచరిత్రమున నీక్రింది పంక్తులు పైవాని కాధారములు :

"చెలగుచు నుపనూరి సింహంబు పేర
పురుషోత్తమధ్యానపూర్ణాత్ము పేర
దళగోళ్ల బసవేంద్రు తనయుని పేర
సుగుణాఢ్యపరపతిసోదరు పేర
ఘనత స్వామిద్రోహగండని పేర
చినరామవిభునికి జ్యేష్ఠుని పేర
దీపించు నచ్యుతదేవరాయప్ర
తాపదక్షిణబాహునం డాంకు పేర
జగురత నీ కావ్యసారంబు నకును
బతియైన పెదరామపార్థివు పేర"
"అరుణాచలేంద్రపూజామోదవిభవ
ధరమించు నన్నసందలి పురాన్వయక్ష
ప్రియబంధునవమైత్రపిప్పలగోత్ర
దయసత్యదాక్షిణ్యధర్మస్వరూప
తగ మించు వ్యాసతీర్థప్రియశిష్య
సుగుణాఢ్యపరపతిసోదరచరిత
ఆయతోన్నతబాహు డచ్యుత సేవ
రాయప్రతాపకార్యధురంధరుండ
అంచితకొనమనా యంకరగండ
మించి వర్తించు స్వామిద్రోహగండ
చేకొన్న నుపనూరి సింహాఖ్యాంక
వాకిటి చిన్నభూవరసహితుండ
బసవభూవరతపఃఫలసత్కుమార
వసుధ గల్గిన కమ్మవంశవర్ధనుడ
భాసొప్ప తిప్పనాంబాజఠిగర్భ
సాగరసంభవసంపూర్ణచంద్ర
చిరకీర్తియుతుడైన చిన్నరామప్ప
పురుషరత్నంబన బొగడంగ మించి
విలసిల్లు పెదరామ విభవసుత్రామ."

చొక్కనాథచరిత్ర తొమ్మిదియాశ్వాసముల ద్విపదకావ్యము. ఇది స్కాందమున, మధురాఖండమున, హాలాస్యక్షేత్రమున వెలసిన సుందరేశ్వరుని (చొక్కనాథుని) లీలలు ౬౪ ను తెలుపు హాలాస్యక్షేత్రమాహాత్మ్యమునకు తెలుగుకృతి. దీనికి చౌషష్టి లీలావిలాస మను పేరుకూడ కలదు. తిరువేంగళకవి చెయ్యేటిదరిని (బాహుదానదీతీరమున) వెలసిన ఓరుగంటమ్మను, ఏకవీరాదేవిని స్తుతించినాడు. కవిస్తుతిలో-

"ఎరుదు వేములవాడ భీము నన్నయను
అరసు దిక్కన సెట్టినార్య శ్రీనాథు
నిలగల్గు కవులను నెల్ల సద్భక్తి".

వినుతించినాడు. ఈతడు అల్లసాని పెద్దనకు సమకాలీను డగుటచే నాతని నుతింపలేదు. ఈతరువాతి కవులు పెద్దనను పెద్దగా స్తుతించిరి కాని, కృష్ణరాయయుగమున నంతగా స్తుతింపలేదు. తిరువేంగళకవి గద్యలో చెప్పినట్లుగా—

"ఇది సర్వఘనసత్కవీంద్రపాదాబ్జ
విదితపూజామోదవిమలుండు, పచ్చ
కప్పురసౌరభ్యకలితనామాంక
తిప్పరాజసుపుత్ర తిరువేంగళేంద్ర
విరచితంబుగ లోకవిఖ్యాతమైన
సరసలక్షణకావ్యసత్కవీంద్రాభి
వందిత శ్రీచొక్కనాథచరిత్ర
మందు నిది నవమాశ్వాస మయ్యె"

ఈతని కవితయు పచ్చకప్పురసౌరభ్యము గుబాళించుచున్నది.

హాలాస్యమాహాత్మ్యమును తెనుగులో చెప్పుటకు తిరువేంగళకవి తొలివాడు. ఈ ద్విపదకృతి వెలసిన తరువాత, ౧౭, ౧౯, ౨౦ శతాబ్దములలో, దీనికి పద్యగద్యకృతులు వెలసినవి. మైసూరు దొడ్డరాజు దళవాయియగు కళువెనంజరాజు దీనిని వచనకావ్యముగా రచియించియున్నాడు. మల్లంపల్లి బుచ్చికవీంద్రుడును, వెంకటగిరిసంస్థానమున తిరుమలసెట్టి జగన్నాథకవియు, శ్రీకళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మయు పద్యకావ్యములు రచించిరి. పైవానిలో ద్విపద, వచన కృతులు ముద్రితములు కాలేదు.

గోళ్ల చిన్నరామప్పయు, నాతని యన్న పెదతిమ్మప్పయు తిరుపతి వేంకటేశ్వరునికి తిరుప్పావడయుత్సవములనిమిత్తము ౧౫,౦౦౦ పణములు శ్రీభాండారమున కర్పించినట్లు తిరుపతిలో శాసనము గలదు. ఈ శాసనకాలము శక. ౧౪౬౨ శార్వరి (౩౧-౧౨-౧౫౪౦). ఈ శాసనకాలమున చినరామప్ప రామనాడు జిల్లా నుండి చంద్రగిరిరాజ్యమునకు నాయకుడుగ మార్చబడె నని నివేదికయందు సూచింపబడినది (*Epigraphical Report of T. T. Devasthanams, Pages* ౨౪౪-౨౪౫)

—నా 'ద్విపదవాఙ్మయచరిత్ర' నుండి.

# వడగళ్లు

[చిన్నకథ]

•

శ్రీ అడివి బాపిరాజు

వడగళ్లవాన కురిసి పంటంతా పాడైంది. అంతటితో పతంజలి కుంగిపోయాడు. ముసలితల్లి, పెళ్లి ఈడు వచ్చిన చెల్లెలు, చదువుకుంటూన్న తమ్ముడు. అయిదెకరాలమీదా సొంతవ్యవసాయం చేసుకుని కుటుంబాన్ని పోషించా లనుకున్నాడు ఈవీడు. నూతి క్రింద వక ఎకరం వరి వూడ్చినాడు. తక్కిన నాలు గెకరాలూ జొన్న వేసినాడు. ఏం తవుతుందీ? ఏ మవుతుందీ? ఆ నూతిదగ్గరే వక చిన్న పంపులో పాదులుచేసి, తోటకూరా, పాలకూరా మొదలైన ఆకుకూరలూ ఓ సన్నజాజిపందిరా పెంచుతున్నాడు. ఏడాది జెయిలుకు వెళ్లివచ్చినాడు. జెయిలులో వున్నప్పుడే గ్రామస్థులు కొందరు సహాయంచేసి వ్యవసాయం సాగించారు. అతను పంద్రొమ్మిదివందలనలుబది ఎనిమిదవ సంవత్సరం సెప్టెంబరులో విడుద లైనదగ్గరనుంచీ గ్రామస్థుల సహాయానికి కృతజ్ఞత చూపిస్తూ వారిని రక్షించమని భగవంతుణ్ణి ప్రార్థించుకొన్నాడు. పంట కోసే బంగారంవంటి పంటకాలం ముందర మిత్తిగా ఈ వడగళ్లవాన చక్కా వచ్చింది. పతంజలిశాస్త్రి జీవితం మూలమంతా కదలిపోయింది. జీవితంలో ఏలాంటి కష్టాలనైనా చిరునవ్వుతో ఎదుర్కొనే స్వభావం గల శాస్త్రికి ప్రపంచంలో విరోధు లనేవాళ్లు ఎవరూ లేరు. అతన్ని హింసించిన రజాకార్ల కే అతనియందు కోపం లేకపోయింది. వరంగల్లు కాలేజీలో చదువుకున్నాడు. ఇంతలో తండ్రి పోవడంవల్ల జన్మభూమి అయిన జనగామ వచ్చి చేరుకున్నాడు. పతంజలిశాస్త్రికి ఆంధ్రభూమిఅన్నా ఆంధ్రత్వమన్నా ఆకాశమంటే అభిమానం. చదువుకున్నన్నాళ్లూ ఆంధ్రదేశంమీద పాటలు రాస్తూ తెలంగాణా రాయలసీమా కోస్తాజిల్లాలూ సిరివంచా చాందా బస్తరు అన్నీ కలసి అఖండాంధ్రమహారాష్ట్రము స్థాపితమై ఆ రాష్ట్రానికి ముఖ్యపట్టణము హైదరాబాదు కావా లని అతని కోరిక.

పతంజలిశాస్త్రి అఖండాంధ్రస్వప్నము అతడు చదువుమాననగానే ఒక మహోకెరటము చిన్ని నావను తీసుకువెళ్లినట్లు అతన్ని తీసుకువెళ్లి ఆంధ్రమహాసభలో సభ్యుణ్ణి చేసింది. ఇంతట్లో ఆంధ్రమహాసభలో నే చీలికలు వచ్చాయి. అసలాంధ్రమహాసభ కమ్యూనిస్టులపాలైంది.

ప్రతాపరెడ్డి, బూర్గుల రామకృష్ణారావు, మందుముల నరసింగరావు, జమలాపురం కేశవరావు, మాడపాటి హనుమంతరావు, మందుముల రామచంద్రరావు మొదలైన నాయకులు కోటిఆంధ్రమహాసభ పెట్టి విజయవంతంగా కొనసాగిస్తున్నారు. పతంజలి గాంధీపూజానిరతుడుకాబట్టి కోటిఆంధ్రమహాసభలో చేరినాడు.

సకలభారతావనికీ పంధొమ్మిదివందల నలభైఏడు ఆగస్టు శుభముహూర్తమునందు పవిత్రస్వాతంత్ర్యం ఉదయించింది. కాని హైదరాబాదుకు మాత్రం నిజమైన స్వాతంత్ర్యం లేకపోయింది. పతంజలిహృదయం తల్లడిల్లిపోయింది. భారతమాతగర్భంలో హైదరాబాదుస్వాతంత్ర్యం ఒక వ్రణం అనుకున్నాడు ఆ యువకుడు. తన బాగు తనకు తెలి

యమ నైజాం ప్రభువుకి. ప్రపంచంలో ప్రభువులు దూదిపింజలై ప్రజాభ్యుదయప్రభంజనంలో దిశాంతాలకు కొట్టుకొనిపోతూంటే ఇత్తేహాద్ ముసల్మీన్‌కి ఇంత మూర్ఖత ఏమిటి అనుకున్నాడు పతంజలి.

రాష్ట్రకాంగ్రెసు సత్యాగ్రహం ప్రారంభమైంది. తన కుటుంబపు దైన్యస్థితి, తన నిస్సహాయతా ఆలోచించకుండా ఆ కాంతిరణంలోనికి వీరుడై ముందుకు వురికాడు. మరుసటి క్షణంలో పోలీసుల లాఠీప్రయోగానికి గురియై గుల్బర్గా జైలులో ప్రవాసి అయిపోయినాడు.

౨

వడగళ్లవాన పెనుభూతంలా వచ్చిపడింది. వడగళ్లకు దయాంతఃకరణలు లేవు. దేశంలో ఆహార పదార్థాలు తక్కువగా వున్నాయని ఆ వడగళ్లవాన ఆలోచించదు. అసలే హిమగర్భమూర్తి వడగళ్లవాన; కర్కశరూపి. అశనిపాతం ఒక చిన్న ప్రదేశంమాత్రమే నాశనంచేస్తుంది. వడగళ్ల పాతం పంటలకు కోటి అశని పాతాలు! పతంజలి ఏడుపు రంగరించిన నవ్వు నవ్వుకున్నాడు.

దేశానికి భారతీయసైన్యదళాలు విముక్తి సముపార్జించి స్వేచ్ఛను నెలకొల్పినా, రజాకారుల దురంతాలు అణగిపోయినా, కాంగ్రెసులోనే వడగళ్లవాన కురిసింది. రెండు కాంగ్రెసుపక్షాలయ్యాయి. ఒకదానికి రామానందతీర్థ అధ్యక్షుడు. రెండవదానికి దేశాయిగా రధ్యక్షుడు. దేశాయిగారివెనకాల పెట్టనికోటలా రామకృష్ణారావుగారు. నెహ్రూగారు వచ్చివెళ్లినా రెండు పార్టీలలో రాజీ కుదరలేదు. పతంజలి రామకృష్ణారావుగారిని కాకతీయకటకసన్నాహో, తెలంగాణాదక్షిణభుజదండా అని పొగడుకొన్నాడు. అతడు రామకృష్ణారావుగారి పక్షంతరఫున వేలకు వేలు కాంగ్రెసుసభ్యులను చేర్పించాడు. ఇంతట్లో పటేలుగారి రాక మంత్రప్రయోగమై, రెండు పార్టీలూ కలుసుకున్నారు. అప్పటికే వడగళ్లవాన కురవటమూ, పంటలు పాడవడమూ అయిపోయింది. తన ఇంట్లో జొన్నకూడే! తెలంగాణా తెల్లజొన్నలు పిండివిసురుకొని రొట్టె కాల్చుకుని తింటారు.

వడగళ్లు రాళ్ళగా మిగిలిన కొద్దిపంటా ఈనాటికి అయిపోయింది. ఏలాగో హైదరాబాదు స్కూల్ ఫైనల్ పరీక్ష రెండవతరగతిలో కృతార్థుడయ్యాడు. వరంగలులో ఇంటరు చదువుతూండగా తండ్రి పోవడం, స్వగ్రామమైన జనగామ చేరుకోవటం తటస్థించింది.

తన చెల్లీ, తల్లీ, తమ్ముళ్ల దుఃఖాలను ఉపశమింపజేస్తూ తాను తన విషాదాన్ని శివునిలా దాచుకొంటూ గరళకంఠుడయ్యాడు.

“తమ్ముడూ, నువ్వు చదువు మానకు! ఇరవైమూడేళ్లు దాటిన నాబోటి అన్న ఉండి నీకు చదువు మాన్పించటమా?” అన్నాడు.

తల్లి—నాయనా, ఈసంసారం ఎల్లా ఈదను? ఈదినంతో ఇంట్లో జొన్నలూ, జొన్నపిండీకూడా అయిపోయాయి.

చెల్లి మాలక్ష్మి—అన్నయ్యా! నేనూ చదువు మానేస్తాను. నన్ను బట్టికూడా ఇంకా మనకు కొంత ఖర్చు. మనం భరించగలమా?

తమ్ముడు లక్ష్మీనరసింహశాస్త్రి—అన్నా, నేనూ చదువు మానేస్తాను. డాక్టరుగారిదగ్గర కాంపౌండరుగా వుంటే పదిరూపాయలు ఇస్తామంటున్నారు.

పతంజలి—తమ్ముడూ, చెల్లీ! మీఇద్దరూ చదువు మానకండి. నారుపోసిన భగవంతుడు నీరు పోయక మానడు. మన వూళ్లో పెద్దరెడ్డి ఓ ఎకరం మెరక పొలం పుచ్చుకుంటా నన్నాడు. అది నూతిక్రింద పల్లపుపొలానికి దగ్గరగా వుండడంచేత మన పొలం కూడా పల్లం చేసుకుని అదికూడా నూతి క్రింద వ్యవసాయానికి తీసుకువస్తాడుట. తక్కిన నాలుగెకరాలూ అతనికే కవులుకు ఇస్తున్నాను. పొలంఖరీదు ఇచ్చే మూడువందలూ, కవులుకోసం ముందరే ఇచ్చే వంద రూపాయలూ పట్టుకుని అందరం హైదరాబాదు పోదాం. సుల్తాన్‌బజారులో ఓ కాంగ్రెసువాడి తన కొట్టులో ఒక చిన్నభాగం పీఠిఅరుగుమీద ఆరునెల్లపాటు అద్దె లేకుండా ఇస్తానన్నాడు. తమలపాకుల బీడాలూ, సిగరెట్లూ, బీడీలూ—అలాంటి వస్తువు లేవో

పట్టి వర్తకం సాగిస్తాను. మన భుక్తి, చదువులు అవిచ్ఛిన్నంగా సాగిపోతాయనే ఆశిస్తున్నాను.

3

సుల్తాన్‌బజారులో పతంజలిశాస్త్రి పాన్‌బీడా షాపు పెట్టినాడు. కాంగ్రెసువాడవడనూ, ఉత్తముడూ, చాలా కష్టపడినవాడూ అని పేరుఉండడనూ వల్ల అనేకమంది అతని దుకాణంలోనే తమలపాకు బీడాలు, సిగరెట్లు, బీడీలు, చుట్టలు మొదలైనవి కొన సాగించారు. తమ్మునికీ, చెల్లెలుకూ పాఠశాలలలో ప్రవేశం దొరికింది. తమ్ముణ్ణి ఆంధ్ర స్కూలులోనూ, చెల్లెలిని ఆంధ్రబాలికా పాఠశాలలోనూ చేర్పుకొన్నారు.

ప్రతివాని జీవితంలోనూ ఎన్ని వడగళ్ళ వానలు వస్తాయో అని పతంజలి నిట్టూర్పు విడిచినాడు. ఇతి కర్తవ్యతామూఢత్వం లేకుండా, ఏతక్కువ కార్యమైతే నేమి, గౌరవప్రదంగా జీవించడం ముఖ్యంకదా! శక్తి లేనివానికి ఉదరపోషణనిమిత్తం ఉద్యోగాపేక్ష! రాష్ట్రపరిపాలన కాంగ్రెసువారిచేతికి వస్తే తానేమన్నా మంత్రిత్వం చేస్తాడా? దేశపాలన ఎవరు ధర్మంగా నడిపిస్తారో వారు రాజకీయనావకు చుక్కాని పట్ట అర్హులు అవుతారు. కాని, కాంగ్రెసువారికి వారిలో వారికి పోటీలు పడి అనేకముఠాలు సిద్ధమై కాంగ్రెసుఆశయాలు మూలపడి, కాంగ్రెసుసంస్థబలం నానాటికీ విచ్ఛిన్నం అయిపోతున్నది. మదరాసు మొదలయిన అన్ని రాష్ట్రాలలోనూ ఈలా కాంగ్రెసు బలం అడుగంటిపోతున్నది.

ఎన్ని చీలికలు, ఎన్ని కక్షలు!

దేశం అంతా గాంధీజీబోధ మరచిపోయినదా?

పూర్ణపురుషుడు, అవతారమూర్తి, అనాసక్తి యోగరూపుడు మహాత్ముడు ప్రజల హృదయాలలో నుండి మాయమయ్యాడా?

"ఏమహాకాంతి నీవుగా మూర్తించినదో?
ఏదివ్యశక్తి నీవుగా రూపం తాల్చినదో?
ఏపవిత్రత కూడుకొని నీ వవతరించావో?
ఓ సత్యపురుషా! అవ్యయరూపాత్మా!

సర్వవేదమంత్రాలు నీస్వరములో నినదించినవి.

ఉపనిషత్ స్వరాలే నీబోధనలలో ప్రకాశించినవి!

పార్థసారథిగీతాదివ్యోపదేశామృతం ఝరులుగా నీవాక్యాల ప్రవహించినవి!

మహాత్మా! ఏకైకావతారా! మాతంత్రీ!

జాతిపితా!

మా జీవితం అంతా నీవు ప్రసరించిఉండలేదా?

ప్రళయాగ్నిమధ్య నీవు హిమాచలశిఖర శీతలత్వానివి!

భయంకర ఝంఝామారుతం మధ్య నీవు సునిశ్చలశాంతివి; నాశనంమధ్య సృష్టివి.

అసత్యమధ్య సత్యానివి.

ఘోరతమస్సులు మాయంచేసే పరమపవిత్ర కాంతివి!

మహాత్మా! మా బాపూ! జాతిపితా! లోకగురూ!"

ఈలా అతని ఆలోచనలు సుళ్ళుచుట్టుకుపోతున్నవి. హైదరాబాదుపై రాజకీయపు వడగళ్ళవాన కురవనిపూర్వమే పంజాబులో, సింధులో నాశనదేవత బీభత్సతాండవం సలిపినది. నేను హైదరాబాదుకు శాంతి రాగానే, పంజాబునుంచి, సింధునుంచి కాందిశీకులై వచ్చినవారు కొంతమంది హైదరాబాదులో నివసించడానికై భారతీయప్రభుత్వం ఏర్పాటు చేసింది.

సింధునించి వచ్చినవారు కోటీశ్వరులవడంచేత వారు పెద్దపెద్ద మేడలు కొనుక్కొని పెద్దపెద్ద వర్తకాలు ప్రారంభించినారు. కాని పంజాబునుంచి వచ్చిన కాందిశీకులు పతంజలిశాస్త్రి స్థితిలోనే ఉన్నారు.

౪

పతంజలిశాస్త్రి ఆడిగమెట్టుకు దిగువ బొగ్గుల గుంటలో చిన్న పటకుటీరం నిర్మించుకొని కాపురం సాగించినాడు. బొగ్గులకుంటకు ప్రక్కనే మిలిట

ప్రభుత్వం ఒక చిన్న శిబిరం ఏర్పాటుచేసి పంజాబు కాందిశీకులు నివసించడానికి ఏర్పాటుచేసినది. వారందరికీ భారతప్రభుత్వమే అనేకవిధాల సహాయం చేస్తున్నది. అలా వచ్చిన పంజాబీకుటుంబాలలో ఒక బ్రాహ్మణకుటుంబం ఉన్నది. పండిట్ కృష్ణకుమార గాయత్రీ అసలు అయోధ్యబ్రాహ్మణవంశంవాడు. అతని పూర్వు లెప్పుడో అయోధ్యరాజవంశాలవారు పంజాబు వీరోద్యోగాలకు పోయినప్పుడు, వారు తమకు పురోహితులుగా గాయత్రీవంశంవారిని తీసుకొనిపోయినారు. ఆ వంశంవారు రానురాను అనేక కుటుంబాలుగా వృద్ధిపొందినారు. ఆచుట్టుప్రక్కల హిందూరాజకుటుంబాలకూ, హిందూవర్తకకుటుంబాలకూ వీరు పురోహితులయ్యారు.

భారతదేశానికి ౧౯౪౭ ఆగస్టులో సంపూర్ణ స్వరాజ్యం రాగానే జరిగిన పంజాబుహత్యలలో పండిట్ కృష్ణకుమారగాయత్రీ తన ఆస్తిపాస్తులన్నీ నాశనం అయిపోయినప్పుడు, తనవారిలో చాలామంది హతమైనప్పుడు, ఏలా పారిపోయి వచ్చాడో వచ్చాడు కూతురుతోనూ, చిన్నకుఱ్ఱవాడితోనూ. భార్య దుర్మరణంపా లయింది. ఆ ఒద్దరే తనకు ఏడుగడ, తన సర్వస్వమూ అనుకుని గాయత్రీపండితుడు ప్రవాహంగా వరదలు కట్టే కంటినీరు ఆపుకుని ప్రభుత్వంవారికి ఇద్దరు బిడ్డలతోనూ అప్పగించుకొన్నాడు. చాలాకాలం ఆ ఇద్దరితో ప్రభుత్వంవారు ఏర్పరచిన కాందిశీకశిబిరాలలో ఉన్నాడు. ఆ మహాప్రళయంవెనుక గాయత్రీపండితుని పౌరోహిత్యం ఎవరికి కావాలి? ఒకభయంకరబృంద దుఃఖం కాందిశీకశిబిరాలన్నీ నిండి మహాసముద్రమై ఉన్నది. ఆ ప్రదేశాలు చూడలేక తోటివారి దుఃఖం భరించలేక గాయత్రిశాస్త్రి దక్షిణంలో ఏడుగడ ఏదైనా దొరకదా అని హైదరాబాదు వచ్చాడు.

హైదరాబాదులోనూ ఎక్కడ చూచినా కాందిశీకులే! ఒకప్రక్క భారతప్రభుత్వంవారు తెచ్చి ఉంచిన పంజాబు కాందిశీకులు. వేరొక ప్రక్క హైదరాబాదులాయకాలీ ప్రభుత్వం తెచ్చి పెట్టిన ముస్లింకాందిశీకులు. ఆ సమయంలోనే గాయత్రిశాస్త్రికి ౧౯౪౮ నవంబరు నెలలో పతంజలిశాస్త్రిస్నేహం లభ్యమైంది. ఆ శిబిరంకడ చక్కని పటకుటీరం నిర్మించుకొని బొగ్గులకుంటలో కాపురం చేస్తున్నాడు. సైకిలుమీద బజారుకు పోయి తన తాములపాకుబీడా - సిగరెట్టు - బీడీ దుకాణానికి వెడుతూఉంటాడు. తమ్ముణ్ణెక్కించుకుని వచ్చి ఆంధ్రపాఠశాలలో వదులుతాడు. చెల్లెలు బొగ్గులకుంటనుంచి అన్నగారితో రోడ్డువరకూ నడిచి వచ్చి అక్కడే కాపురంచేస్తున్న బోయివాగన్న రిక్షా సిద్ధంగా ఉంటే అది ఎక్కి నారాయణగుడాలో ఆంధ్రబాలికాపాఠశాలకు పోతుంది.

పతంజలిశాస్త్రికి ధర్మశాస్త్రాలుకాని, చివరకు విఘ్నేశ్వరపూజైనా చేయించడముగాని ఏమీ రాదు. వచ్చిన దేదో ఆకాస్త ఉరుదూభూయిష్ఠమైన చదువు. ఉర్దూలో మాత్రం ఆరితేరిన పండితుడు. తెలుగు అంతంతమాత్రం. హైదరాబాదు వచ్చినదగ్గరనుండీ పట్టుదలతో తెలుగు నేర్చుకుంటున్నాడు. అందుకు అతనికి దోహదమూ, ఉత్సాహమూ ఇచ్చినది ప్రక్కనే ఇల్లు కట్టుకుని కాపురం చేస్తున్న వెంకటాచారి.

వెంకటాచారి రసజ్ఞుడు; ప్రభుత్వఉద్యోగంలో ఉన్నాడు. భారతీయసంస్కృతీ, ముఖ్యంగా ఆంధ్రసంస్కృతీ అంటే ప్రాణం అర్పిస్తాడు. కళలంటే ఆత్మ అర్పిస్తాడు. ఒక్కొక్క శిల్పమూ, చిత్రలేఖనమూ చూచి, ఆనందంతో మైమరచిపోతూ ఉంటాడు. అతనికి ప్రాచీన నాణేలు సముపార్జనం, వానినిగూర్చి పూర్తిగా పరిశోధించి తెలుసుకొనడం జీవితానందకర్మ! పాతబజార్లు, జామాదాత్ బజారు వ్రతంలా అంటుకొని ఉంటాడు. ఒక్కొక్క ప్రాచీన నాణెం దొరికిందంటే ఇక ఆరోజునుండీ నెలల తరబడి అతనికి పండగే! ఆనాణెం స్నేహితులకు చూపిస్తూ ఇత్తిఆనందంలో మునిగిపోతూఉంటాడు.

ఆ వెంకటాచార్యులతో పరిచయం ప్రథమంలోనే సంభవించింది పతంజలిశాస్త్రికి. అసలు అతని బొగ్గులకుంటకాపురానికి కారకుడు వెంకటాచార్యులు. హైదరాబాదు కాపురానికి రావడానికి ముందు పతంజలిశాస్త్రి మంచీ చెడ్డా చూచుకోడానికి ఆ నగరం

వచ్చినప్పుడు అనుకోకుండా ఒక కాఫీహోటలులో పతంజలిశాస్త్రి, వెంకటాచారి కలుసుకున్నారు. ఎందుకు వారిద్దరకూ మాటలు కలిసినవో మరి, పదినిముషాలలో స్నేహితులయ్యారు. అరగంటలో ప్రాణమిత్రులయ్యారు. బొగ్గులకుంటలో గజం మూడురూపాయల చొప్పున స్థలాలు ఉన్నాయనీ, రెండువందల గజాలు పుచ్చుకొని, వెంటనే ఒకపాక నిర్మించుకొని అందులో ప్రవేశించమనీ వెంకటాచార్యులు సలహా ఇచ్చాడు.

వెంకటాచార్యులు తన దొడ్లో రకరకాల మొక్కలు వేసుకుంటాడు. వేసవిశీతాకాలాలలో తానే నీళ్లు తోడుకొని, మొక్కలకు పోసుకుంటాడు. భూమిబలము మంచి దవడంవల్ల మొక్కలు ఏపుగా వచ్చి అన్నికూరలూ పుష్కలంగా కాస్తవి. ఆత డీ కూరలవ్యవసాయం ప్రారంభించినకడనుండీ బజారునుండి ఒక్క కూరగాని, పచ్చిమిరపకాయగాని కొనలేదు.

పతంజలిశాస్త్రి యీ నూత్నమిత్రుని సూచన వెంటనే అమలులో పెట్టినాడు. రెండువందల గజాలు స్థలం కొని పాక నిర్మించుకొన్నాడు. ఆప్రక్క ఒక దొడ్డి కాలంకు పుచ్చుకొని కూరలు వేయడం సాగించాడు. ఆతని దుకాణమూ వృద్ధిఅవుతున్నది; కూరల పంటా వృద్ధిఅయినది. కాలీ, కాబేజీపువ్వులు, వంకాయలు, బీర, పొట్లకాయలు, టొమాటోలు—పాలకూర మొదలయిన కూరలు, పచ్చిమిర్చి, అన్నీ తన కొట్లో ఓప్రక్కగా పెట్టి వాని అమ్మకమూ సాగించాడు.

౩

౧౯౪౭ నవంబరు నెలలో గాయత్రీపండితుడు బజారుకు వచ్చి పతంజలిశాస్త్రికొట్లో ఒక బీడీలకట్ట కొనుక్కుంటూ "మీరు మా శిబిరంపక్కనే కాపురం చేస్తున్నారు కాదా?"అని ప్రశ్నించాడు.

"అవును. మిమ్మల్ని చూస్తున్నాను. మీరు ఏదైనా పని చూసుకున్నారా?"

పతంజలి ఉర్దూలో పండితుడు. ఆతని భాష వింటూ గాయత్రీపండితు డాశ్చర్యం పొంది— "మీరు ఉత్తరాదివారా?"అని ప్రశ్నించాడు.

"కాదండి. మేము అచ్చమైన ఆంధ్రులం. అయినా ఈ సంస్థానం తురకసంస్థానం అవడంవల్ల రాజభాష ఉర్దూ అయింది మీకు ఇంగ్లీషువలె! కాబట్టి అన్నిభాషలూ మేము నేర్చుకోవాలె. ఆంధ్ర భాషమాత్రం మాకు దూరం! మేము ఉర్దూపత్రికలే చదువుతాము. నలుగురు కలుసుకుంటే తెలుగులో మాట్లాడుకోము. ఉర్దూ మాకు ఉగ్గుపాలలా వస్తుంది. మాట్లాడే తెలుగులోనూ ముప్పాతికమాటలు ఉరుదూ మాటలే!"

"చాలా చిత్రమే! నా కేమీ పని దొరకలేదు బాబూజీ! ఎంతకాలమని ఈలా ప్రభుత్వసహాయం పొందుతూ ఉండను? పంజాబులో రాజ్యం ఏలినాను. ఈరోజు ఇక్కడ శానిసబ్రతుకుకన్న అధ్వాన్నంగా ఉంది."

పతంజలిశాస్త్రి పండిజ్జీవిషాదముఖం చూచినాడు. ఆతని హృదయం ద్రవించిపోయింది. కొంచెం గొంతుకు సవరించుకొని, ఆతడు గాయత్రీపండితుని చూచి—

"పండిజ్జీ! మీరు నాకో భాగస్వాములు కండి. ఈ కొట్టు నేను ఒక్కణ్ణీ మానుకో లేకుండా ఉన్నాను!" అని గాఢకంఠంతో ప్రార్థనగా అడిగినాడు.

"మీతమ్ముడికు ఒక అబ్బాయి ఉన్నట్టున్నాడు!"

"ఉన్నాడు. వాడికి చదువు బాగా వస్తోంది. వాడికి ఎంత చదువైనా చెప్పించదలచుకొన్నాను."

"మాఅమ్మాయి లాహోరులో బాలికాపాఠశాలలో అయిదవ ఫారం చదువుకూఉండేది."

"మీకు సంతానం ఎందరు?"

గాయత్రీపండిజ్జీకి కంట నీరు తిరిగింది. తల వంచుకొన్నాడు.

"మా అమ్మాయి, అయిదేండ్ల చిన్నకుఱ్ఱవాడూ నండి. మాపెద్దబ్బాయిని మీ యాదవాణ్ణి మాకళ్ల ఎదుటే హాడిచేశారు. వాడు బ్రతికే ఉన్నాడో

ప్రాణమే వదిలాడో! మేము ప్రాణాలకు వాణ్ణి అలా వదిలి పారిపోయాము. ఆదృశ్యం చూసి, గుండె ఆగి నా భార్య గతించినది. నాతమ్ముడికుటుంబం సగం నాశనమైంది. తక్కినవాళ్లందరూ 'ఢిల్లీ' ప్రక్క శిబిరాలలో ఉంటున్నారు."

"పండిట్జీ, మీరు వెంటనే శిబిరం వదలి నేను కౌలు పుచ్చుకున్న దొడ్డిలో కాపురం పెట్టండి. నాలుగు వందల గజాల స్థలం. ఆ స్థలం మీ పేర కొందాం. నేను ఎక్కడో అప్పు పట్టుకువస్తాను. మీరు నెమ్మదిగా ఆ అప్పు తీర్చుకోవచ్చును."

"నాయనా! మీకు నేను మెడను కట్టిన రాయిలా తయారౌతాను."

"అలా మీ రేమీ అనుకోకండి! నేను ఏవో సబ్బులూ, తలనూనెలూ, ఇంకా ఇతరసాపుసామానులూ అమ్మడం ప్రారంభించాను. అవీ బాగా అమ్ముతున్నాయి. అదీకాక ఈమధ్య ఆంధ్రపత్రిక, భారతి, బ్లిట్జిపత్రికల అమ్మకం సాగించాను. ఇవన్నీ ఒక్కణ్ణే చూసుకో లేకుండా ఉన్నాను పండిట్జీ!"

"ఇంత చిన్నకొట్టువ్యాపారానికి మనం ఇద్దరం ఏలా ఇముడుతాము శాస్త్రీజీ?"

"ఈప్రక్క ఓ పెద్దకొట్టు అద్దెకు వచ్చింది. దానికి బజానా ఇచ్చాను. అక్కడ సాగిద్దాము. ఈ కొట్టు ఇచ్చిన స్నేహితునకు ఇబ్బంది అవుతున్నది. అందుకనే ఆపని చేశాను."

"సరే, కానివ్వండి. తక్కిన మాటలు ఇంటి దగ్గిర మాట్లాడుకుందాము."

ఒకనెలలో గాయత్రీశాస్త్రీకోసం పటకుటీరం తయారైనది. ప్రభుత్వసహాయంతోనూ, పతంజలి తెచ్చిన అప్పుతోనూ ఆ నాలుగువందలగజాల భూమి కృష్ణకుమారగాయత్రీపండితుడు కొనుక్కున్నాడు. పతంజలి, గాయత్రీపండితు లిద్దరూ కలిసి వ్యవసాయమూ, కొట్టూ రెండూ చూసుకొనడం సాగించారు.

గాయత్రీపండితుని కొమరిత జయనందిని అందాలపుంజము. కోల మోము, తీర్చిదిద్దిన కనులు, ముక్కు, నోరు తీరు. పసిమిబంగారులో పాటలవర్ణము సమ్మిశ్రితమైనఛాయ. పదునేడేండ్ల మిసిమిమీరారిపుత్తడి బొమ్మ. తేనెలు జీరలుకట్టి జిడ్డుఆవుపాలమీగడ తెరగలు కట్టినట్టి చిక్కని మధురకంఠధ్వనితో ఉర్దూపంజాబీలు మాట్లాడుకుంటూఉంటే పతంజలిహృదయం ఝల్లుమనేది. ఈ మధురపుష్పంకోసం పంజాబీకాందిశీకులలో యువకులు ప్రథమంలో అస్తమానమూ వస్తూ ఉండేవారే గాని గాయత్రీపండిట్జీకి ఆ వేమీ గిట్టక వచ్చినవారిని తన తోటయింటిబయట రోడ్డుమీదనే నిలబెట్టి మాట్లాడేవాడు. తాను లేనప్పుడు కొమరిత పతంజలిఇంట్లో ఉండేటట్లు కట్టుదిట్టం చేసినాడు. ఆ కారణాలవల్ల పంజాబీయువకులు నిట్టూర్పులు విడిచి లాభం లేదనే నిస్పృహవల్ల గాయత్రీపండితుని ఇంటికి రావడం నెమ్మది నెమ్మదిగా మానివేసినారు.

జయనందినికీ, పతంజలిచెల్లెలు మాలక్ష్మికీ నానాటికీ స్నేహం గాఢం అయిపోయింది. మాలక్ష్మి జయనందినికి తెలుగు నేర్ప సాగించింది. జయనందిని లాగు, చొక్కా, వల్లె మాని, మాలక్ష్మిపరిష్కర్తృత్వంలో తెలుగుబాలికల రీతిని చీరా జంపరూ ధరించడం నేర్చుకున్నది. గాయత్రీపండితుని కొడుకు రాధాకుమార్ అయిదేండ్లబాలుడు తెలుగుదేశం బాలకుడే అయినట్లు మాలక్ష్మిదగ్గిర తెలుగు మాట్లాడడం నేర్చుకున్నాడు. ఒక్కనిమిషంకూడా మాలక్ష్మినీ, పతంజలితల్లి సుందరమ్మగారినీ వదిలేవాడు కాడు. సుందరమ్మగారికి రాధాకుమారుని పెంపకము పరమ సంతోషం కలుగజేసే వ్రతం అయినది. ఆ బాలుడు ఈమే తనతల్లిగా "అత్తా"అంటూ ఆవిడపక్కలోనే పండుకొనడం సాగించాడు.

జయనందిని ఆలోచనాపరురాలు. భయంకరమైన హృదయవిదారణదృశ్యా లెన్నో పంజాబులో చూచింది. ఆమె పులుల గుంపులను చూచిన కురంగిలా వణికిపోయింది. ఎన్నిదినాలో ఆమెకు పీడకలలు వస్తూ ఉండేవి. పంజాబువిశ్వవిద్యాలయప్రవేశికపరీక్షకు చదువుకూఉండగా ఆ దేశం ముక్కలయింది.

ఈనాడు ఈ పతంజలిశాస్త్రి ఆ బాలికకు నెహ్రూ అవతారంలా కనుపించినాడు. ఆ బాలికకు

పతంజలిని చూచినప్పుడల్లా ఏదో శాంతి, ఏదో ధైర్యము, ఏదో వర్ణింపలేని ఆశా కలుగుతూ ఉండేవి.

పంజాబూ, హైదరాబాదురాష్ట్రం ఏదో కొద్ది తేడాలుగా ఉంది. కాని పంజాబులో తాను కోరిన ఏదో విచిత్రసౌందర్యం తెలుగువారిలో దృశ్యమైనది. తల్లి చీరె కట్టుకొనేది. కాని ఆ విధానం అయోగ్య విధానం. తెలుగువారి కట్టూ, బొట్టూ ఏదో శాంతి పూరితంగా ఉన్నవి. వీరి ఔచిత్యము లోతులనుంచీ ప్రవహించి జీవితం అంతా ప్రసరిస్తుంది. తెలుగు వారిలో హుందాతనం భారతజాతికి వన్నెగా కనబడింది. జీవితం సౌందర్యవంతం చేసుకోవడం తెలుగు వారికే తెలుసును. ఆలా సౌందర్యమయపురుషజీవి దానికి చిహ్నితంగా పతంజలిశాస్త్రి కనబడినాడు.

౬

పతంజలిశాస్త్రి రాత్రిళ్లు చెల్లెలికీ, జయనందినికీ పాఠాలు చెప్పేవాడు. అతడు పాఠాలు చెప్పుతూ ఉంటే శాస్త్రిమోము పూర్ణిమాజ్యోత్స్నలా వెలిగిపోయేది. అతనిమాటలలో ఉత్కంఠతా, అతడు చెప్పే ఉత్సాహమూ జయనందిని ముంచేవి. జీలంనదీ తీరంనుంచి వచ్చిన ఆ ఔత్తరాహయవ్వనహృదయానికి ఈ ముచికుందనదీతీరవాసుడైన పతంజలి బాలికలను కష్టాలనుండి రక్షించే వీరుడై కన్పడినాడు. నరకాసురుని సంహరించి పదునారువేల రాజకుమారికలను రక్షించిన శ్రీకృష్ణు డీలాంటివాడేనా యని జయనందిని అనుకున్నది. జయనందిని గోధుమతో వండే పిండివంటలు మాలక్ష్మి నేర్చుకొనేది. తమదేశపు పిండివంటలు జయనందినికి నేర్పేది. వీరిరువురకూ చదువులు నేర్పే పతంజలిశాస్త్రి వీరిద్దరి ప్రాణస్నేహమూ చూచి పులకరించిపోయేవాడు.

గాయత్రీపండితుడు నెమ్మదిగా తన కష్టాలు మరచిపోయినాడు. తన ఏభైరెండుసంవత్సరాల జీవితమూ దక్షిణాన కృష్ణాగోదావరీమధ్య దేశంలోనే గడచినట్లయినది. వర్తకమునందూ, ఇంటిదొడ్డి కాయకూరల పెంపకమునందూ అతనికి విచిత్రమైన అనురాగం కలిగినది. అరటికాయకూర, దోసకాయపచ్చడి, ఆనపకాయ, గోగుకూరపులుసు మొదలైన తెనుగువంటకాలు అతని జిహ్వకు నూత్నరుచులు కొనితెచ్చి, అతని కలలలో కనుపించే పంజాబుహాస్యదృశ్యాల్ని మాయం చేసినవి.

పతంజలీ, గాయత్రీపండితుడూ కలిసి కాంగ్రెసూ, బాపూజీబోధనలూ, ముందు దేశంలో జరుగబోయే మార్పులూ చర్చించుకొనేవారు. వేదాంతవిషయాలు మాట్లాడుకొనేవారు. వీరితో వెంకటాచార్యులు చేరుతూ ఉండేవాడు. వీరిముగ్గురి సంభాషణా జయనందినీ, మాలక్ష్మీ చెవులార వింటూ ఆనందం పొందేవారు.

వెంకటాచారి—పండిట్జీ, ఏదోరూపంగా మనుష్యుని మనస్సు ఆనందం కోరుతూఉంటుంది. రాజకీయాలో, ఇతరులకు ఉపకారాలు చేయడమో, ధనం సేకరించడమో, అధికారంలో ఇతరులను పాలించడమో ఈలా మానవుని మనస్సునకు సంతతవ్యాపారమత్తత ఉంటూనే ఉండాలి!

పండిట్జీ—అయితే, మనుష్యుని ఆత్మకు ఆనందం కలిగే విషయాలను మనుష్యుడు వాంఛించడా?

పతంజలి—ఆత్మ వ్యక్తం కాని వస్తువు. మనస్సు వ్యక్తం అయిన మానవజీవితంలోని ముఖ్యవస్తువు.

పండిట్జీ—మనస్సు అతి సున్నితమై పోనుపోను మనస్సు తత్వాన్ని మించిపొందే వ్యవస్థే ఆత్మవ్యవస్థ. ఆ వ్యవస్థకూ మించిన వ్యవస్థ సర్వాంతర్యామిస్థిత అయిన ఒక మహోత్కృష్టమైన అనిర్వచనీయావస్థ పరమాత్మావస్థ. భౌతిక విషయజ్ఞానమైన స్థితిలో ప్రాథమికమైన మనస్సు స్థితి.

వెంకటాచారి—కాబట్టే మహాత్ముడు ఈ మనస్సు ధర్మపరమైన కార్యాలలో నిమగ్నం చేయమన్నాడు. లోకోపకారమూ, స్వకీయానందమూ రెండూ మిశ్రమై మనుష్యుని జీవితం ఒక ఉత్తమనదీ ప్రవాహంలా ప్రవహించిపోతుంది.

ఈ సంభాషణలు జయనందినికి అర్థమైనట్లుండీ అర్థం కానట్లయ్యేవి. పతంజలిమాట, పతంజలికంఠము,

పతంజలి మోమును త్రిప్పటము, అతడు కూర్చొనే విధానము, చేతులు త్రిప్పేరీతులూ హృదయానికి ఏదో తెలియగారాని ఉప్పొంగు నిచ్చేవి.

ఆ బాలికలో కలిగే పరివర్తనం, ఆ వాతావరణం పరిమళంలా కమ్ముకుని పతంజలిజీవితాన్ని స్పర్శించేది. ఆ బాలిక తన్ను చూడడం లేదను కొన్నప్పుడల్లా పతంజలి ఆమెను తనివితీర గమనించేవాడు. ఆమె పంజాబీపాటలు, ఆమె ఆటలు, ఆమె తోటపని చేసే అందమైన తీరులూ చిత్రాలై అతని హృదయఫలకంపైన నవనవలాడేవి. కాని అతని హృదయంలో ఆ బాలికపైన స్త్రీవాంఛ అతనికి దర్శనము కాలేదు. ఆమె ఏదో అజంతాచిత్రలేఖనము; పాలంపేటలో సౌందర్యవిన్యాసవంతమైన శిల్పము.

8

[illegible] మేనెల వచ్చింది. ఎండలు తీక్ష్ణంగా కాస్తున్నాయి. ఉన్నట్టుండి ఒక ఆదివారంనాడు పతంజలి భోజనానికి ఇంటికి వచ్చిన సమయంలో పదునొకండుగంటలకు ఆకాశం చటుక్కున మేఘాలతో నిండి ప్రపంచం అంతా ఒక్కసారి చల్లబడి వడగళ్ల వాన కురిసింది. పతంజలి స్నానానికని దొడ్డిలోనికి పోతూ బీరచిక్కుడుపాదులు చూస్తున్నాడు. ఆఎండలో మేలిముసుగు వేసుకుని, ఏదో కూనిరాగం తీస్తూ, పందిరిఛాయల నిలుచుండి బీన్సుకాయలు కోస్తున్నది జయనందిని—వడగళ్ల వాన కురవబోయే ముందు ఆ చల్లదనానికి కంఠం ఎత్తి.

"మై గిరిధర ఘర్ కే జాఊఁ" అని పాడుకుంటున్న జయనందిని పతంజలిని గమనించలేదు. పతంజలి ఆమెను చూస్తూ ఆనందంతో అలా నిలుచుండిపోయినాడు.

జల్లుమని వడగళ్లు కురియడం ప్రారంభించాయి. జాజిపువ్వులులా, పారిజాతం పువ్వులులా, ఆణిముత్యాలులా చిన్నవై ఆ వడగళ్లు కురిసినవి. అవి దేవతలు కురిపించే పూలవర్షంలా ఉన్నవి.

కాని పతంజలికి వెనుక తాను పాలంలో ఉన్నప్పుడు ఉసిరికాయలంత వడగళ్లు మహావేగంగా అతని కోటిపాతంలా పడిన రోజు మనస్సులో మెరుపు మెరిసింది. అతనికి ఈ తోటలూ, ఈ ఇళ్లూ, ఈ ప్రియబంధువులూ నాశనం అయిపోతున్నట్లు దిగ్భ్రమయుక్తమైన విపరీతభయం ఆవహించింది. పిడుగు తగిలినవానిలా తూలి "అమ్మయ్యో!" అంటూ కూలిపోయినాడు.

అతడు పడిన చప్పుడు విని చటుక్కున తిరిగి చూచి జయనందిని "ఏమి టది మామా!" అని అతని కడకు పరుగిడివచ్చింది. అతని ప్రక్కనే చటుక్కున చదికిలబడి "ఏమిటి! దెబ్బ తగిలిందా? మాట్లాడు మామా!" అని గజగజ వణుకుతూ పతంజలిని తన ఒళ్లోకి తీసుకుని అతని తల తన హృదయానకు అదుముకున్నది.

అతడూ నిమేషంలో తెప్పిరిలి, ఆమెస్పర్శ సుఖం అనుభవిస్తూ మరిరెండునిమేషాలు అలాగే ఉండినాడు. ఇద్దరి హృదయాలలో తెరలు వీగిపోయినాయి. అతని జీవితానికి ఆమె అగట్టు పడిపోనవలేదీ అయినది, అత డా బాలికజీవితానికి రాబోవు పవిత్రాశయమూర్తియై గోచరించినాడు. తనకు తెలియకుండా పతంజలిబాహువు లామెను గాఢంగా చుట్టివేసినవి.

చుట్టూ, వారిపైనా వడగళ్లు మల్లిమొగ్గలై జలజలా రాలుతున్నవి.

రాధాకుమారుడూ, లక్ష్మీనృసింహశాస్త్రి, మాలక్ష్మి వడగళ్లు ఏరుకొనడానికి దొడ్లోకి వచ్చినారు. "ఏమిటి అక్కా!" అనీ, "ఏమిటి బహిన్" అని రాధాకుమారుడూ, "ఏం జరిగిన దన్నయ్యా! పడ్డావా? ఏమిటి జయా బహిన్" అని శాస్త్రీ వీ రిరువురిదగ్గరకు పరుగిడి వచ్చారు. మాలక్ష్మి "అమ్మో! ఏమి జరిగిన దేమిటి?" అని ఒక్క గంతులో వీరిని సమీపించింది. ఇదంతా మూడునిమేషాల కాలంమాత్రం!

వడగళ్లు అక్షతలులా, తలంబ్రాలులా ఇంకను చిన్నవై కురుస్తున్నవి.

చటుక్కున పతంజలి లేచి "తల తిరిగింది, తూలి పోయినాను చెల్లీ! జయ నన్ను పట్టుకోకపోతే, చాలా దెబ్బ తగిలిఉండును!" అంటూ నిలుచుండినాడు.

జయానందిని మోము పలాశపుష్పవర్ణకాంతితో వెలిగినది. సిగ్గుతో ఆమె మోము అర్ద్రిత వాల్చినది.

జయనందిని లేస్తూ "మామకు కాలు జారింది కాబోలు!" అని నిలుచుండినది.

వడగళ్లవాన వెలిసింది.

* * *

ఆరాత్రి వెంకటాచార్యులు గాయత్రీపండితుని కడకు వివాహ భేరానికి వచ్చినాడు. పండిజీ హృదయానందానికి కడపలు లేకపోయినది.

"ఆచార్యభాయ్! నా హృదయంలో ఈ కోర్కె మొదటినుండీ ఉంది. నాయనా! ఇంతకన్న నా జన్మకు సంతోషం ఏముంది!" అనినాడు.

పతంజల్లితల్లి సుందరమ్మగారు తన జన్మకు ఇంతకన్న మోక్షానందం ఏ మున్నది అనుకున్నది. వారిద్దరికీ ఆరాత్రి ఆమె కన్నులనుండి ఆనందబిందువులు రాలుతూవుండగా ఒకచోట కూర్చొపెట్టి దృష్టి తీసింది.

వడగళ్లు, తుఫానులు, దావానలాలు, ప్రళయాలూ మానవజీవితానికి ఏలాంటి మార్పులు తీసుకొని వస్తాయి! హిమాలయతనయఅంశలో ఉద్భవించిన ఈ జయ తన జీవితం వెతుక్కుంటూ ఈలా దక్షిణానికి వచ్చింది. ఆ మనోహరమూర్తికి కర్కశుడైన తాను తగిఉండడు. అయినా తెనుగునాట క్రొత్తరాహశక్తి ప్రసరించే దివ్యముహూర్తం ఆసన్నమైనది కాబోలు ననుకొన్నాడు. జయకు తానే దైవమట, తానే చక్రవర్తి అట, తానే నాయకుడట! అని మాలక్ష్మి ఆనందంతో పొంగిపోతూ అన్న చెవిలో గుసగుసలు పలికినది.

జయ తేరి చూడజాలని సౌందర్యంతో నందనవన పారిభద్రపుష్పంలా వికసించిపోయినది.

అవతారమూర్తి తన గురువు! ఆతని మోము తన హృదయంలో దాచుకొని అదుముకొన్నప్పుడు వర్ణింపలేని అంత ఆనందం తన్ను ముంచి వేసిన దేమి!

ఆమెను మాలక్ష్మి "మా అన్నను వివాహమాడ గలవా వదినా?" అని అడిగినప్పుడు కలిగిన పులకరింపులతో మాలక్ష్మినే గట్టిగా కౌగలించుకొని, ఆమె చెంపలు గాఢంగా చుంబించింది. ఆమె కన్నులలో మధురప్రహ్లాదోత్కర్షలు అలుముకు పోయినవి. "భాభీ! నాకేం తెలుసును? నీకే తెలుసును" అన్నది.

వడగళ్లు అమృతబిందువులై కురిసి వెలిసినవి కదా!



# భారతీయశిల్పము - దాని పుట్టుపూర్వోత్తరాలు

## ౧. మౌర్య శిల్పము

'కృష్ణశ్రీ'

మౌర్య రాజులకు పూర్వము భారతీయ శిల్పం ఏరీతిగా వుండేదో తెలుసుకోడానికి ఆధారాలు బహు కొద్దిగా వున్నాయి. ఎన్నడో క్రీ. పూ. రెండు మూడు వేల సంవత్సరాలకు పూర్వము సింధునదీ ప్రాంతంలో ఉండిన నాగరికత నాటివి ఎన్నో ముద్రికలు దొరికాయి హరప్పా, మొహెంజోదారోలలో. ఈ ముద్రికలమీద వృషభమూ, ఏనుగూ, ఖడ్గమృగమూ, చెట్టూ పామూ కలిసిన త్రిశూలంవంటి చిహ్నమూ, వంకరకొమ్ము లున్న శిరస్త్రాణము ధరించిన దేవుని (?) తలా, నాగులూ కనబడుతున్నారు.[1] వీటిలోని వృషభం చాలా గంభీరంగా వుంది. కాళ్లు మాత్రం గీతలలాగే కనపడుతాయి అన్ని మృగాలవీని. ఈ బొమ్మలన్నిటిలోనూ, ఆ మృగాల అసలురూపం సరిగ్గా చూపిద్దామనే ప్రయత్నం కనపడదు. ఈ మృగాల బృహద్రూపమూ, వాటి బలమూ సూచించి ఆశ్చర్యచకితుల్ని చేయాలనేదే మొహెంజోదారో శిల్పుల ముఖ్యోద్దేశం అయియుంటుందేమో? ఇవన్నీ అర్ధచిత్రాలు (*Relief Sculptures*), పూర్ణశిల్పాలు (*Sculpture in the round*) కావు. అర్ధశిల్పం పూర్తిగా భారతీయమే అనుకోడానికి ఈ చిత్రాలు అడ్డు. ఇలాంటివే ఈజిప్టు, సుమేరు దేశాలలో కూడా విరివిగా దొరికేయి: కాబట్టి ఆనంద కుమారస్వామి అన్నట్టు[2] పురాతన కాలంలో మధ్యధరా తీరము నుంచి గంగా మైదానపు తూర్పు అంచువరకూ ఒకే నాగరికత విస్తరించి ఉండేదని అనుకోడము అవసరం. దానికి ఈజిప్టు కేంద్రమై యుంటుంది.











మొహెంజోదారోలో దొరికిన కొన్ని ముద్రికలు

ఆర్యులు క్రీ. పూ. 1500కు పూర్వం భారతదేశం ప్రవేశించినట్లు పరిశోధకుల అభిప్రాయము. వీరి హోమాల్లోనూ, మంత్రాల్లోనూ విగ్రహాల ప్రశంస లేదు. వీరు దేవతల పాదాల్నీ, చేతుల్నీ, కూర్చున్న తీరునీ వర్ణించడము ఊహవల్ల మాత్రమే నేమో. ఆర్యులు ఈ

---

1. ఇవి మద్రాసుమ్యూజియములో ఉన్నాయి.

2. *History of Indian & Indonesian Art. Page 3.*

దేశానికి వచ్చేముందు దేశమంతా ఆక్రమించుకుని ఉండిన ద్రావిడులలో, పైనచెప్పిన మధ్యధరా తీరపు నాగరికతే కొద్ది స్థానిక భేదాలతో నిలిచి వుండింది. వృక్ష. పూజా, నాగపూజా వ్యాప్తిలో ఉండేవి. స్థల భేదా



సున్నపురాతితో నిర్మితమైన మానవాకారము (మొహెంజోదారో)

ల్ని బట్టి లింగపూజా, భూదేవిపూజా కూడా, అమలులో ఉండేవి. ఆర్యద్రావిడ సంఘట్టనంలో ద్రావిడులు (వీరే కాబోలు దస్యులు) ఓడినప్పటికీ, ఆర్యుల సంప్రదాయాలు చాలా మట్టుకు ద్రావిడ సంపర్కము వల్ల మారిపోయాయి. వారు వేదాల్లో చెప్పిన దేవతలకి తోడు ద్రావిడుల దేవతలు కలిశారు. వారి హోమాలు పూజలై పోయాయి. విగ్రహాలు తయారైనాయి క్రమంగా. ఈ కాలానిదే కాబోలు తారీయనంద నగరులోని భూదేవిబొమ్మ. ఆ బొమ్మలో విశేషమేమీ లేదు. సరిగ్గా ముక్కునుంచి నాభిమీదుగా గీత గీస్తే ఈ గీతకి ఇటూ అటూ సామరస్యం కనపడుతోంది బొమ్మలో. స్తనమండలముకంటె జఘనము ఘనము. పాదాలు ముందువైపుకి కాకుండా పక్కలకి తిరిగి వున్నాయి. చేతులు రెండూ ఇటూ అటూ కిందికి చాచి, మోకాలికి పైన అరచేతుల్ని మనవైపు తిప్పుతుంది బొమ్మ. చేతులకి చాలా వున్నాయి గాజులు. చెవులకి బరువైన భూషణాలూ, మెడకి బిళ్లల వడ్డాణమూను. మొహెంజోదారో నుంచి శైశునాగ, నంద రాజుల కాలం వరకూ ఉండిన శిల్పాలు ఇంకా దొరకవలసి వుంది. అవి విరివిగా దొరికితేగాని పూర్వశిల్పం యొక్క చరిత్ర పూర్తిగా విడదు.

శైశునాగులూ, నందులూ పాలిస్తూండినప్పుడు భారతదేశం లోని శిల్పాలు ఘనమైన రూపాల్ని కల్పించినట్లు కనబడుతుంది. కర్రమీదే గాని, రాతిమీద చెక్కే అలవాటు గ్రీకులు మన దేశానికి వచ్చేవరకూ మనవారికి పూర్తిగా అలవడలే దని చాలామంది అభిప్రాయ పడుతున్నారు. ఆ దారు శిల్పాలు కాలక్రమాన్న నశించి పోయాయి. ఇప్పటికీ నిలిచివున్న రాతిశిల్పాల్ని బట్టిమాస్తే శైశునాగులూ, నందులూ ఏలుతూండినప్పుడు పెద్దపెద్ద పూర్ణశిల్పాలే తయారౌతూండేవి అనిపిస్తుంది. దారువు పూర్ణశిల్పానికి అంత అనుకూలం కాదన్న విషయాన్ని బట్టి ఆలోచిస్తే ఈ ఘనశిల్పము (*Heavy sculpture*) దారుశిల్పాన్నుంచి



పార్ఖంలోని యక్షునిబొమ్మ

కాకుండా అంతకు ముందుండిన శిలాశిల్పంనించో, లేదా మృణ్మయ శిల్పం నుంచో ఉద్భవించి వుంటుందని ఊహపుడుతోంది. మొహెంజోదారో నాటికే సున్నపురాయితో మానవాకారాలు నిర్మించడము ఉన్నట్లు అక్కడ దొరికినవిగ్రహాలు సాక్ష్యమిస్తాయి. మృణ్మయ



పవాయాలో దొరికిన మాణిభద్ర యక్షుడు

శిల్పం కూడా ఆ కాలంలో వ్యాప్తిలో ఉండేదని వేరే చెప్ప నక్కరలేదు. కాబట్టి గ్రీకుల కాలానికి (క్రీ. పూ. 250) పూర్వము మనదేశంలో ఉండిన రాతి విగ్రహాలు దేశీయశిల్పాన్నే సూచిస్తా యనుకోవాలి.

ఈ శిల్పాలు బహుకొద్ది. పార్ఖంలో ఒక యక్షుని[3] బొమ్మ—సుమారు ఏడడుగులు ఎత్తున్నది దొరికింది. జయస్వాలుగారు ఇది శైశునాగ వంశీయుడైన కునిక అజాతశత్రువని దంటారు. కాని ఆనంద కుమారస్వామి చెప్పినట్లు ఇది యక్షుడి బొమ్మే నేమో అనిపిస్తోంది. కారణాలు రెండు మూడున్నాయి. ఆ రోజుల్లో రాజులబొమ్మలు ప్రత్యేకంగా చెక్కినట్లు సాక్ష్యము లేదు. యక్షులూ, యక్షిణీలూ, కల్పవృక్షాలూ చెక్కరుగాని సమకాలిక మానవుల బొమ్మల్ని శిల్పాలు చెక్కినట్లు లేదు. ఈ పార్ఖం విగ్రహానికీ, పవాయాలో (గ్వాలియరు రాష్ట్రము) దొరికిన మాణిభద్రయక్షునికి[4] పోలిక బాగా ఉంది. సాంచీ స్తూపము ఉత్తర ద్వారమ్మీద ఉన్న యక్షుడు[5] కూడా ఈ బొమ్మలాగే ఉన్నాడు. కాబట్టి ఇది యక్షుని విగ్రహమే నేమో. అమరావతిలోని కుంభాండయక్షులికి ఉదరబంధ ముంది. ఈయక్షునికీ ఉదరబంధ ముంది. ఈ సాక్ష్యము చాలేమో ఇది యక్షవిగ్రహమే అనడానికి. బెస్నగరులో లభించిన స్త్రీ విగ్రహం ప్రస్తుతం కలకత్తా మ్యూజియంలో ఉన్నది, తొలిరోజులనాటి రెండో బొమ్మ. ఈ విగ్రహము కూడా ఏడడుగు లుంది. ఈ సంప్రదాయానికి మొద్దు బరువు ఒక లక్షణము. మనవేపే తిరిగి వుండడము రెండో లక్షణం. ఈ బొమ్మలలోని అస్థిపంజరము కూడా రాయి గట్టినట్టే వుంటుంది. ఏ కోణాన్నా వంగడము లేదు, వీటికి. ఇది మూడో గుణం. అలంకార బాహుళ్యమూ, వస్త్రాలగీతలమునేతలూ అల్పలక్షణాలు. కలకత్తామ్యూజియంలోని కల్పవృక్షంకూడా ఈ జాతిదే.



బెస్నగరులోని యక్షి

3. పూర్వోక్త ప్రమాణము. 9 వ బొమ్మ.
4. అదే. 68 వ బొమ్మ.
5. *Marshall 'The Monuments of Sanchi'.*

ఇటు తర్వాతివన్నీ మౌర్యుల కాలంలోనివి. మౌర్యుల శిల్పాన్ని సభాశిల్పమనీ, ప్రజాశిల్పమనీ రెండు భాగాలుగా విడదీయవచ్చును. అశోకమహా



సాంచీస్తూపము-ఉత్తరద్వారము

రాజప్రోత్సాహంవల్ల తయారైనదల్లా సభాశిల్పము. అశోక స్తంభాలూ, బుద్ధగయావృక్షానికి చుట్టూ అశోకుడు కట్టించిన రాతికంచె ఈ సభాశిల్పానికి ఉదాహరణాలు. అశోక స్తంభాలన్నీ చాలా ఎత్తైనవి. క్రిందినైపు లావుగానూ, పోనుపోను సన్నంగానూ వుంటాయి ఈ స్తంభాలు. స్తంభానికి చివర గంటవంటి శిఖరమూ, దానిమీద స్తూపమూ, దానిమీద ఏనుగో, గుర్రమో, వృషభమో, సింహమో ఉంటాయి. ఈ మృగాలు క్రమంగా తూర్పూ, దక్షిణమూ, పశ్చిమమూ, ఉత్తరమూ అనే నాలుగు దిక్కుల్నీ సూచిస్తాయి అని విన్సెంటుస్మిత్తు అభిప్రాయం. ఒక్కొక్క స్తంభం మీద నాలుగేసి మృగాలుకూడా ఉండడము కద్దు. సారనాథములోని అశోక స్తంభపు శిఖరమ్మీద నాలుగు సింహాలున్నాయి. భార్హూత్ శిల్పాలలో అశోక స్తంభాల చిత్రాలు కొన్ని ఉన్నాయి. వాటిని బట్టి, ఈ మృగాలమీద ధర్మచక్రముకూడా వుండేది అని తెలుస్తుంది. సాంచీఉత్తరద్వారమ్మీది ఏనుగులమీద ధర్మచక్రపు ఉనికి ఇప్పటికీ నిలిచివుంది. ధర్మచక్రము బౌద్ధధర్మానికి చిహ్నము. ఈ స్తంభాలన్నీ బౌద్ధధర్మప్రచారముకోసమే అశోకుడు నిర్మింపించాడు.

ఈ స్తంభాలమీది గంటవంటి శిఖరము పర్షియా దేశమునుంచి మనవారు నేర్చారని మార్షల్ అభిప్రాయము. దళాలు క్రిందికి వంచిన తామరపూవు సరిగ్గా ఈ ఆకారంగానే వుంటుంది. భార్హూత్ శిల్పాలలో ఎన్నోచోట్ల ఇలాంటి పద్మముయొక్క చిత్రము ఉంది. పర్షియాలోనూ ఉండవచ్చును. కాని ఇంతమాత్రపు శిల్పానికి పైదేశంనించి తెచ్చుకోవలసిన అవసరము లేదేమో. సారనాథపు స్తంభశిఖరంమీది సింహాలు చక్కగా ఉన్నాయి. ముఖమూ, నోరూ, జూలూ, కాళ్లూ, గోళ్లూ వాస్తవికంగా ఉన్నాయి. అశోక స్తంభాల శిఖరాల మీది జంతువు లన్నిటిలోనూ ఇవి బాగున్నాయి. స్తంభానికున్న నునుపుకూడా నేటికీ ప్రశంసార్హమే. మరి ఏ శిల్పాలకీ ఇంత నునుపు లేదనే సంగతిని పురస్కరించుకొని ఈ నునుపుకూడా విదేశీయ శిల్పులు తెచ్చినదే అని మార్షల్ వాదిస్తున్నాడు. ఇది నిజమే కావచ్చును. కాదనడానికి సాక్ష్యము బహుకొద్ది. సాంచీస్తూపందగ్గిర అశోక స్తంభపు సింహాలు మల్లీ పీటంత బాగుండక పోయినా, వీటికి ఉద్దీలు. దీదరుగంజిలో దొరికిన చామరధారిణిలో (ఓ. సి. గంగూలీగారు ఈమె 'అతిలోకసౌందర్యా' న్ని త్రివేణిలో తెగ పొగిడారు.) మళ్ళీసారనాథ స్తంభపు నునుపు కనబడుతోంది. ఆ శిల్పముమీద విదేశీశిల్పుల చేయి ఏమాత్రము పడినా సంప్రదాయం మారిపోయి వుండును. దీనిని చెయ్యగలిగినశిల్పులు సింహాలెన్నా చెయ్యలేరు? కాబట్టి సత్యం ఏదైనా, గంటశిఖరమూ, ఇసుకరాతికి చక్కని నునుపు లేవడమూ అశోకునిశిల్పులు ప్రత్యేకంగా నేర్చుకున్నారన్నమాట నిజము. సారనాథమూ, సాంచీ వదిలేస్తే మరి యే స్తంభమ్మీది మృగాలూ ఇంత అందంగా లేవు.

సారనాథ స్తంభమ్మీది గంటశిఖరమ్మీది స్తూపము

చుట్టూ ఉన్న ఏనుగూ, వృషభమూ, గుర్రమూ, సింహమూ అతిచక్కగా ఉన్నాయి. వృషభమూ, ఏనుగూ భారతదేశానివి. వీటిని అంత వాస్తవంగా విదేశీయశిల్పులు చిత్రించగలరా అని విన్సెంటుస్మిత్తు అడుగుతున్నాడు. కాని అశోకుని కాలపు శిల్పములోని ఏనుగులకు ఈ సారనాథ శిఖరమ్మీది ఏనుగుల కున్నంత చైతన్యం లేదు. సాంచీ తోరణాలమీదగాని మనవారి ఏనుగులు మూర్తి వంతాలు కాలేదు. మళ్లీ వృషభమ్మాత్రం రామపుర్వ లోది 'సారనాథవృషభము కాదా ఇది' అనిపిస్తోంది. ఇది భారతీయులు చెక్కినదే. ఏతావతా చెప్పే దిది. ఒక్క సారనాథ స్తంభశిఖరం అశోకుడు రప్పించిన విదేశీయశిల్పులు చెక్కినారన్నా భారతీయశిల్పానికి పెద్ద లోటు రాదు.

అశోకచక్రవర్తిప్రోత్సాహంవల్ల సభాశిల్పం ఈ దారిలో వెళ్లినా, ప్రజాశిల్పమ్మాత్రం తన దారిని మార్చుకోలేదు. పరిస్థితుల బలంవల్ల అశోకుని కాలపు ప్రజాశిల్పంలో అదివర కున్న గురుశిల్పానికి మరొక క్రొత్తశాఖ కలిసింది. బెస్నగరు యక్షిణీ, పార్ఖము యక్షుడూ, అశోక స్తంభాల శిఖరాలమీది మృగాలూ మాత్రమేకాక ఆకాలపు పూర్ణశిల్పానికి ఉదాహరణాలు ఇంకా కనబడుతున్నాయి. పాట్నా మ్యూజియంలోని చామరధారిణీ, ధౌలీలోని ఏనుగూ ఈ జాతివే. బెస్నగరుయక్షిణికన్న ఈ చామరధారిణి సుందరి. అంగాంగసౌందర్యము ఈమెకి బాగా కుదిరింది. ఆభరణాలు సున్నితా లయినాయి ఈమెకాలా



అశోక స్తంభశిఖరంమీది సింహాలు



బుద్ధుడు ప్రబుద్ధుడైన బోధివృక్షము

నికి. తలకట్టుకూడా వాజూకుగా ఉంది. ఈమె చామరం విసరడముకోసము, రాజసీనికి అనుగుణముగా లేచి నిటారుగా నిలిచిందిగాని కర్ర గట్టలేదు. ఈమె ఘనజఘన, సుందరవస్త్రాంచల, రత్నమేఖల, సువర్ణ హస్తకంకణాలంకృత. మౌర్యశిల్పానికి అటు సారనాథ స్తంభశిఖరమూ, ఇటు ఈ చామరధారిణీ అలంకారాలు. ధౌలీలోని ఏనుగుకి మొద్దుబరువు వుంది; ముఖాముఖి దర్శనమూ ఇస్తోంది. అంతకు మించి చెప్పడాని కేమీ లేదు అందులో.

ఈ రూపగౌరవ సంప్రదాయానికి తోడు ఇంకొక సంప్రదాయము నదిలాగ మౌర్యుల కాలంలో ఉద్భవించింది. బుద్ధుడు జీవించియున్న కాలములో బౌద్ధమతం అంతగా వ్యాపించలేదు. అతని తరవాతే అతని శిష్యుల ప్రచారమువల్ల నలుముఖాలా వ్యాపించింది. "బుద్ధుడే తన బొమ్మ చేయవద్దని నిషేధించాడు.

కాబట్టి అతని నిర్వాణానంతరం అతని జీవితంతో సంబంధించిన నాలుగు క్షేత్రాలకీ వెళ్ళి దర్శించడమే బౌద్ధులకు యాత్ర అయింది. మొదటిది బుద్ధుడు జన్మించిన లుంబినీవనం. రెండోది బుద్ధుడు ప్రబుద్ధుడైన బోధివృక్షము (గయలోనిది); మూడోది బుద్ధుడు మొదటిసారి ధర్మోపదేశము చేసిన మృగదావము (సారనాథము). నాలుగోది అతను నిర్వాణము పొందిన కుశీనగరం. నేటికాలంలో కాశీ వెళ్లినవారు కాశీతాడూ పటాలూ, రామేశ్వరం వెళ్ళినవారు గవ్వలూ పటాలూ తెచ్చుకున్నట్లు, ఆ రోజులలో కూడా ఈ నాల్గు క్షేత్రాలనీ సూచించే చిహ్నపు బిళ్లలు ఉండేవి. అక్కడికి యాత్రలకి వెళ్లేవారు ఈ చిహ్నాలు తెచ్చుకోడమూ, వీటిని చూచి శిల్పులు ఇతర చిహ్నాల్ని తయారుచెయ్యడమూ జరుగుతూండేది." అని ఫౌచరు వాదిస్తారు 6. ఈ వాదము బౌద్ధశిల్ప విర్భావవర్ణనానికి చక్కగా అమరుతుంది. కాని ఈ చిహ్నపు బిళ్లలు ఫౌచరువాదములోనే గాని వాస్తవంగా ఒకటీ దొరకలేదు. నిజంగా ఇవి ఉండియుంటే, వేలకొద్దీ దొరకవలిసింది. ఫౌచరు చెప్పేది నిజమయినా కాకున్నా, పై నాలుగు ఘటనలకీ నాలుగు చిహ్నాలూ ఏర్పడిపోడముమాత్రము నిజం. బుద్ధుడి పుట్టుకకి, మాయాదేవి విరిసిన పద్మమ్మీద కూర్చుంటే, ఇటొక ఏనుగూ అటొక ఏనుగూ పూర్ణకుంభాలతో ఆమెకి నీళ్లు పోసే చిత్రము చిహ్నమైంది. ఇదే తరువాత హిందువుల గజలక్ష్మి అయింది. ఇంతకుముందు వైదిక సంప్రదాయంలో గజలక్ష్మి లేదు. బుద్ధుడి ప్రబోధానికి బోధివృక్షమూ, దానిముందొక ఖాళీసింహాసనమూ చిహ్నము. బుద్ధుడే నిషేధించిన కారణంచేత బౌద్ధులు అతని రూపం చిత్రించలేదు చాలాకాలం వరకూ. కనకనే ఖాళీసింహాసనం. మొదటి ధర్మోపదేశం 'మృగదావం'—అంటే లేళ్లవనం—లో జరిగింది. కనక సింహాసనమూ, దానికింద రెండు ముఖాముఖి లేళ్లూ, వాటికి నడుమ బౌద్ధధర్మవ్యాపనాన్ని సూచించే 'ధర్మచక్రమూ' మొదటి ఉపదేశానికి చిహ్నాలు అయాయి. చైత్యము—అంటే సమాధి, ఒక స్తూపకమ్మీద అర్ధగోళం బోర్లించినట్లు ఉంటుంది—బుద్ధ నిర్యాణానికి చిహ్నమైంది. బౌద్ధమతానికి బలము హెచ్చినకొద్దీ ఈ చిత్రాలకి ప్రచారము హెచ్చింది. అశోకుడు బుద్ధగయలోని బోధివృక్షముచుట్టూ కట్టించిన రాతికంచెయొక్క అడ్డకంబాలమీద ఈచిహ్నాలు కనబడతాయి 7. ఇంతేకాదు. అంతవరకూ కథలలోనే నిలిచిపోయిన రెక్కలమృగాలూ, కిన్నరీలూ, నాగకన్యలూ, యక్షులూ, రాశిచక్రాలూ శిల్పంలోకి దిగిపోయాయి. ఇంతవరకూ కేవలం రూపగౌరవాన్ని మాత్రమే సూచించిన శిల్పం బుద్ధగయలో హిందూబౌద్ధసంప్రదాయవస్తుప్రదర్శనానికి పనికి వచ్చింది. అక్కడ పైన చెప్పిన హైందవచిత్రాలే కాక, కేవలమూ బౌద్ధసంప్రదాయానికి మాత్రమే చెందిన బోధివృక్షాలూ, ధర్మచక్రాలూ, త్రిరత్నాలూ (బుద్ధ, ధర్మ, సంఘా లనే బౌద్ధత్రిరత్నాల్ని సూచించే త్రిశూలము) కూడా వున్నాయి. ఈ రీతిగా బోధివృక్షమూ, పుణ్యక్షేత్రాలూ చూడవచ్చిన యాత్రికులకు వినోదకాలక్షేపం కల్పించడంలో బుద్ధగయశిల్పులు మొట్టమొదటిసారి శిల్పాన్ని వాస్తుశిల్పానికి సైరంధ్రినిగా చేసేశారు. ఈ సంప్రదాయం ఇలాగే సాగిపోయింది. శిల్పం వాస్తుశిల్పానికి చేటికగా పనిచేస్తూ పద్దెనిమిదో శతాబ్దప్రాంతానికి గోపురాలెక్కిపోయి అంతరించిపోయింది.

బుద్ధగయలో మౌర్యులకాలపు శిల్పము ఉంది. కాని పెద్దపెద్ద శిలలతో బ్రహ్మాండంగా బొమ్మలూ, స్తంభాలూ తయారుచేసే శిల్పులకీ కుంచితస్థలాంతర అర్ధశిల్పంలో చెయ్యి తిరగలేదు. అందువల్లనే బుద్ధగయలోని శిల్పాలు సౌందర్యవంతంగా రాలేదు. కాని మౌర్యశిల్పంయొక్క విలువ సౌందర్యంలోకంటె సంప్రదాయసౌష్ఠవంలోనే ఎక్కువ వుంది. భారతీయ శిల్పసరస్సు మౌర్యుల కాలంలో సరస్వతి అయింది. నేడు మనం భార్హుత్ లో, సాంచిలో, అమరావతిలో, గుప్తరాజ్యములో, మహాబలిపురంలో, కంచిలో, చాళుక్యచోళరాజ్యాలలో, హళేబీడులో, జావాలో, దక్షిణదేశపు దేవాలయాలలో చూచే వాస్తుశిల్పస్థశిల్ప వస్తువునకు బీజం మౌర్యుల కాలంలో పడింది. అదే మౌర్యశిల్పపు ప్రత్యేకత.

6. '*Beginnings of Buddhist Art*' లో.

7. వేణీమాధవబారువా "*Gaya & Bodh gaya.*"

[ఇందలి బొమ్మలు '*History of Indian and Indonesian Art*' అను పుస్తకమునుండి, తత్ప్రకాశకులకు కృతజ్ఞతతో, గ్రహింపబడినవి.]

# వినోదవిమర్శము

## కుమారసంభవముద్రణము



●

శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

కావ్యప్రశస్తికి సాధారణముగా త్రివిధములగు యోగ్యతలు కారణములు. ఉత్తమకవిరచితమయిన కావ్యము, ఉదాత్తకథావస్తువు గల కావ్యము, ఉత్తమకృతిభర్తృకమయిన కావ్యము సాధారణముగా ప్రస్తుతిపాత్రము లగుచుండును. కవి యుత్తముడయినను, లబ్ధప్రతిష్ఠుడయినను వస్తుగౌరవము చాలని కావ్యము—ఉదాత్తవస్తుప్రతిపాదకమయినను అపసిద్ధుడగు కవి రచించిన కావ్యము—సాధారణముగా గౌరవార్హతను గోలుపోవును. ఉదాత్తకథావస్తువుతో నుత్తమకవీశ్వరుడు రచించిన కావ్యమునకు లోకోత్తరుడు కృతిపతి యగుట బంగారమునకు దావి యబ్బుట. ఈ త్రివిధములయిన యోగ్యతలును దన కావ్యమునకు గల వని నన్నిచోడమహాకవి యెలుగెత్తి చాటుచున్నాడు, చూడుడు :

"రవికులశేఖరుండు, కవి
రాజశిఖామణి, కావ్యకర్త, స
త్కవి భువి నన్నిచోడ డట
కావ్యము దివ్యకథం గుమారసం
భవ మట తత్కథాధిపుడు
భవ్యుడు, జంగమమల్లికార్జునుం
డవిచలితార్థయోగధరు
డట్టి విశం గొనియాడ జాలదే?"

(కుమా. అవతారిక, ౫౭ ప.)

కావ్యకర్త తాను—రవికులశేఖరుడు, కవిరాజశిఖామణి, సత్కవి,కులముచేతను, యోగ్యతచేతనుగూడ నుత్తముడు; కావ్యవస్తువు కుమారసంభవము—దివ్యకథ(దేవసంబంధి కథ,మనోహరమయిన కథ)—సాధారణముగా నితరకవీశ్వరరచితములగు కావ్యములకువలె భూపాలకకథాప్రతిపాదకము కా దనుట. ఇక కృతిపతియో ? జంగమమల్లికార్జునుడు—అతడు భవ్యుడు, అవిచలితార్థయోగధరుడు. ఈ విశేషణములు కృతిపతియోగ్యతను పెంపొందించునవి. ఇట్లు త్రివిధములగు యోగ్యతను సంపాదించుకొనిన కుమారసంభవము వినజాలినదిమాత్రమే కాదు, కొనియాడను జాలినది—అనుచున్నాడు.

ఇట్టి ప్రశస్తమహాకావ్యము ముద్రితమే యయినను నిన్నమొన్నటిదాక ప్రతులు లభింపమి నాంధ్రవిద్వజ్జనసామాన్యమున కిది యందుబాటులో లేకుండినది. అట్టి కొఱతను దీర్చి, కుమారసంభవమును ద్వితీయవారము ఇటీవలనే ముద్రించి శ్రీ వావిళ్లవారు ఆంధ్రమహాజనులకు మహోపకారు లయిరి. ఈ పునర్ముద్రణమును బురస్కరించుకొని భాషాసేవాదృష్టితో నీ విమర్శనము వ్రాయుచున్నాడను.

ఈ ముద్రణమున ప్రకాశకులు వ్రాసిన విజ్ఞాపనములోని కొన్ని వాక్యములు గమనింపదగియున్నవి. చూడుడు:

'ఆమీద కొంతకాలమునకు 'మాప్రతి'ని తంజాపూరుప్రతితో సంప్రతించితిమి. మాకు పరిచితులు వావిళ్లనిఘంటుసంపాదకులు శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారి కిచ్చి ఈ గ్రంథమును ముద్రణార్హ మయినట్లుగా బరిష్కరింపు డని కోరితిమి.'

* * *

'వారు పిఠాపురమునుండి యిక్కడకు వచ్చినతోడనే యీ గ్రంథమును 'నావద్దనున్న ప్రాచీనవ్రాతప్రతితో' సంప్రతించి నా కిచ్చిరి కాని మదరాసు విశ్వవిద్యాలయము ఈ గ్రంథమును బ్రకటింప నెంచి రని చెప్పుటచే దీని పూర్తిగ పరిష్కరణముచేసి మా కిచ్చినను మేము ప్రకటింపజాల మైతిమి.'

ఈ విజ్ఞాపనమును జదివినవారికి ప్రకాశకులకడ కుమారసంభవముప్రాచీన వ్రాతప్రతి యొకటి (అది తాళపత్రమో, కాగితపుబతియో తెలుగరాదు.) యున్నటులును, నది తంజాపూరుప్రతికంటెను భిన్నమనియును గోచరము కాగలదు. తొల్లి ముద్రితమైన

కుమారసంభవద్వితీయభాగముపీఠికలో తద్గ్రంథప్రకాశకులు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు తమకు నైజాము రాజ్యమున ప్రాచీనశాసనశోధనార్థము పోవుచుండగా కర్ణాటదేశమున నొకటియు, కుద్రద్రవిడదేశమున దక్కిన రెండును లభించిన వని వ్రాసినను వారికి లభించినది తంజావూరు వ్రాతప్రతి యొకటియే యనియు, నా వ్రాతప్రతి ననుసరించియే కుమారసంభవమును వారు ముద్రించి రనియు సోపపత్తికముగా నిర్ధారిత మయినది. కాగా నేడు శ్రీ వావిళ్లవారు తమకడ నొక ప్రాచీనవ్రాతప్రతి యున్నటులు తెలుపుచున్నారు. దీని యాథార్థ్యమును మనము పరిశీలింపవలసియున్నది.

శ్రీ రామకృష్ణకవిగారు ప్రకటించిన కుమారసంభవములో నవమాశ్వాసములోని ౨౮౩ వ పద్యము ఇట్లున్నది:

"స్తనములు సకుంతలాస్యము
వనములపై దోప వికచవనజంబులు...
... ... ... ...చే
కొనుక్రియ పల్లిత యీడ గోమలి కొలనన్".

వావిళ్లవారి ముద్రణములోను నీ పద్యములోని గ్రంథపాత మిట్లే యున్నది. రెండు వ్రాతప్రతులలోను నొక్క చోటనే గ్రంథపాత ముండుట యాశ్చర్యము! ఇది దైవిక మనుకొనినను మఱొకచోటి ఈ పద్యము చూడుడు:

"తా నేల వచ్చు భూపతి
మానవపతిచరిత నీతిమార్గం బైనన్
... ... ... ...
... ... ... ..."

(రామకృష్ణకవిగారిప్రతి.)

ఈ పద్యములోని యుత్తరార్థము గ్రంథపాతము. వావిళ్లవారి ముద్రణమునను నీ పద్య మిట్లే యున్నది. తక్కిన రెండుపాదములు కానరావు. మఱొక పద్య మిది చూడుడు.

"తనకని చాప కర్తికి సు
ధామయపక్వఫలంబు లిచ్చు నో
లిన కొను గాలి వహ్నికి జ
లింపక మార్కొని నిల్చి కాలు నీ
మనుజాలు కొంద ఔయడవి
ప్రాకులకంటెను గట్ట మర్థి నెం
... ... ... ..."

(రామకృష్ణకవిగారి ప్రతి. ౫౧౬ ప.)

వావిళ్లవారి ముద్రణమునను నీ పద్య మిట్లే యున్నది. చతుర్థపాదము లేదు. అర్థానుకూలముగా నిట—

'(అర్థి చే) డివ దగ నీయజాల రరి డీకొని తాకిన నిల్వజాలరున్' అని యుండదగును.

తరువాతిపద్య మిది చూడుడు :

"...............చు జాగియు
నే వనియు తలంచు లోభి యొప్పుడు ననికిన్
జానని యె తలచు వీరుడు
జానవియు తలంచు బంద సరి నెట్లనునో"

(రామకృష్ణకవిగారి ప్రతి. ౬౧౪ ప.)

ఈపద్యమునమాత్రము వావిళ్లవారి ముద్రణములో నొకింత మార్పు గోచరించుచున్నది. ఆ మార్పు కూడ వ్రాతప్రతిప్రమాణముతో గాక యూహతో చేయబడినది. అదియు నవిచారమూలకము. చూడుడు.

"చాననియె తలచు జాగియు
నీవనియు తలంచు లోభి యొప్పుడు ననికిన్
జానని యు తలచు వీరుడు
జాననియ తలంచు బంధ సరి నెట్లనునో"

ఇందు ' తొలిపాదములోని గ్రంథపాతము పూర్తిచేయబడినది. కాని యచట "ఈ ననియ" యని యుండవలయును. త్యాగి (చాగి) తనకున్న ధనమంతయు ఈన్ + అనియ—ఇతరులకు ఇచ్చుటకే యని తలచును. లోభి తన ధనమును ఈన్ + అనియ = ఇతరుల కీయజాలను అని తలచును. ఇట్లే తక్కిన రెండుపాదములకును నర్థము చెప్పుకొనవలయును. వీరుడు చాన్ + అనియ = యుద్ధములో జచ్చుటకే కోరును. పంద చాన్ + అనియ = నేను చావజాల నని పాఱిపోవును. త్యాగిలోభిప్రార్థనములు పద సారూప్యము పడసియున్నను నర్థ వైవిధ్యము కలిగి యున్నవి. కనుక త్యాగి లోభి-వీరుడు పంద-సరి కాజాలరు.

ఇట్లు అర్థానుకూలముగా మూడు నాలుగు పాదముల రెంటను 'చాననియ' యని యుండుటచే తొలి రెండుపాదములలోగూడ నట్లే యుండబోలు నని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఆ పాదము నట్లు పూరించిరి. ఇపు డున్నట్లు 'చాననియ' యని తొలిపాదము పూరింపబడిన పద్యార్థము చెడును. ఇంతకు చెప్ప వచ్చిన దేమనగా నీ ప్రథమపాదపూరణముగూడ వ్రాతప్రతియాధారముతో చేయబడినది కాదని, యూహతో నవిచారమూలకముగా చేయబడిన దనియే.

—

మఱియొకచోట నీ పద్యములు చూడుడు:

"వడి నరకు తేయు నమ్ములు
నడుమనె తెగ నేసి మార్గణము లొండ్లొగి నిం
డ్రొడకుండ ముందఱ గ్రక్కుంతు నంచు...
... ... ... ..."

"...................
.......... నచ్యుతు నంచుఁ
బృందారకతతి బెదర ము
కుందుని దలపడిరొ నొదరిగొని సురు డలుకఁ".

(రామకృష్ణకవిగారిప్రతి ౧౬౨, ౧౬౩ ప.)

వావిళ్లవారి ప్రతిలోఁగూడ నీ రెండుపద్యముల లోని గ్రంథపాత మిట్లే యున్నది. కాని ఛందోను కూలముగా దొలి పద్యము మూడవపాదములోని 'గ్రక్కుంతు నంచు' నాలుగవపాదమునకు గొనితేబడి నది. ఈ మార్పు తప్ప రెండు ముద్రణములలోను నెట్టి భేదమును లేదు. తంజావూరు వ్రాతప్రతియందును, వావిళ్లవారికడ నున్నదనుచున్న వ్రాతప్రతిలోను నొక చోట గాదు—తొలిదాన గ్రంథపాతము లున్నచోట్ల నెల్ల గ్రంథపాతములు కలుగుట యాశ్చర్యము కలిగిం పకమానదు. ఒకప్రతిలో నొకచోట గ్రంథపాతమున్నను మఱొక ప్రతియే యుండినయెడల నందును నచటనే గ్రంథపాత ముండు నని విజ్ఞు లంగీకరింపజాలరు. ఒక చోట దైవిక మనుకొన్నను నన్నిచోటులను దైవికమే యనుకొనుట భావ్యము కాదుగదా!

గ్రంథపాతముల విషయ మటుంచి ముద్రణ స్ఖాలిత్యముల దృష్టితో దీని యాథార్థ్యము బరిశీలింతము.

దశమాశ్వాసమున 'శరణు మహేశ' యన్న పద్యమునకు దరువాత 'నాగమురజబంధములు' అని కలదు. దానికి దిగువ 'స్థిరమతిసుభసితమూర్తి' యను పద్యము కలదు. వాస్తవముగా 'శరణు మహేశ' యన్న పద్యము నాగబంధపద్యము. 'స్థిరమతిశుభసితమూర్తి' యన్న పద్యము మురజబంధపద్యము. కావున 'నాగ మురజబంధములు' అను శీర్షిక 'శరణు మహేశ' యను పద్యమునకు బూర్వ ముండవలయును. శ్రీ రామకృష్ణ కవిగారి ప్రతిలో బ్రమాదమున నది రెండు పద్యములకు నడుమ ముద్రింపబడినది. ఆ ప్రమాదమే తిరుగ వావిళ్ల వారి ముద్రణమునను నావర్తింపబడినది. వావిళ్లవారి వ్రాతప్రతియందును పై రెండుపద్యములకు నడుమనే యా శీర్షిక యున్న దనరాదుకదా!

ఏకాదశాశ్వాసములో కుమారదేవవాహినీవర్ణన పద్య మిది చూడుడు:

"గంధసింధురములు గంధంబులుగ మహా
వ్యాళసమూహముల్ మూలములుగ
నస్త్రశస్త్రానీక మంకురోద్గమముగా
వరకేతుతతి పల్లవములు గాగ
జడలంది గ్రాలెడు చామరచ్ఛత్రదం
డమ్ములు శాఖాచయమ్ము గాగ
మణిభూషణమితి కుట్మలగుచ్ఛములు గాగ
వివిధాతపత్రముల్ విరులు గాగ
మానితాప్సరోవిమానమాలిక లోలి
బొలియు భ్రమర బంధుగోలలు గాగ
బలసి త్రిభువనములు బందిరిగా దేవ
దేవతనయు నాగు దీవ వఱచె."

(రామకృష్ణకవిగారి ప్రతి ౫౮౭ ప.)

ఇట తొలిపాదమున 'గంధసింధురములు గందం బులుగ'నని యుండవలయును. తరువాతి పాదముల బరి శీలించిన నచట 'కందంబులుగ' ననియే యుండ వలయు నని, 'గంధంబులుగ'ననుట దోష మని తెలియ గలదు. వావిళ్లవారి ముద్రణమునను నీ పాద మిట్లే కలదు!

కుమారోదయవర్ణనసందర్భమందలి యీ పద్యము జూడుడు:

"సురమహీరుహాలి వందె సురభు లోలి జేసె నా
సురగజంబు మదము సేసె సురసమూహ మెద భయా
తురత వాసె బెరిగె దేవదుందుభుల్ సెలంగె నీ
ధరణి సస్యవృద్ధి బొందె ధర్మచరిత మిగులగాఁ."

(రామకృష్ణకవిగారి ప్రతి ౪౧౬ ప.)

ఇందు తొలిపాదమున రెండు స్ఖాలిత్యములు కలవు. 'సురమహీరుహాలి వండె సురభు లోలి జేపె' నని యుండవలయును. వావిళ్లవారి ముద్రణములో దొలిది సరిదిద్దబడెను గాని మలిది 'జేసె' ననియే యున్నది.

నవమాశ్వాసములోని యీ క్రిందిపద్యము జిత్త గింపుడు:

"దేవకార్యంబుగా మహాదేవితోడ
మీకు సంగతి గావించి మెచ్చు వడయ
వచ్చెగా కంగభవుడు నచ్చె నిన్ను నెఱిగి
యొఱిగి పై నెత్తిరా నెన్ని యొడలు గలవు!"

(రామకృష్ణకవిగారి ప్రతి, ౨౪౧ ప.)

ఇందు తృతీయపాదమున గణభంగము చూపట్టు చున్నది. వావిళ్లవారిముద్రణములో నీ పాదము 'వచ్చెగా కంగధవుడు నీ యచ్చ సెజిగి' యని సరిదిద్దబడినది. ఇది యర్థానుకూలముగా గణభంగదోషము తొలగింప గావించిన సవరణమే కాని యిది వ్రాతప్రతిప్రమాణముతో చేసిన దన గాదు.

పయిని పేర్కొనిన విషయములబట్టి వావిళ్లవారు ప్రకటించిన కుమారసంభవము రామకృష్ణకవిగారు ప్రకటించిన కుమారసంభవమునకు బ్రతికృతి యని, వీరి ముద్రణమునకు రామకృష్ణకవిగారు ప్రకటించిన కుమారసంభవమే మూలమని, వారికడ నున్న దనుచున్న ప్రాచీనవ్రాతప్రతివిషయ మయథార్థమనియు తెలియుచున్నది. అట్టి వ్రాతప్రతియే వారికడ నుండి కుమారసంభవములో గానవగు కొఱంతలను బూరింప గలిగిన మఱియు సంతోషము !

ఇక శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు కుమారసంభవమును బరిష్కరించియిచ్చి రన్న విషయమును నయథార్థమే యనవలసియున్నది. కుమారసంభవవిమర్శములో శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు దశమాశ్వాసములోని నాగబంధమును జిత్రించి దిగువ 'భూరితరచారుసుఖప్రద' యని యుండ రాదని, యట్లున్న బంధము కుదుర దని 'భూరితరసారసుఖప్రద' యని యుండవలయు నని వ్రాసిరి. వారే పరిష్కరించిన వావిళ్లవారి కుమారసంభవములో నీ సవరణము కాన రాదు. శ్రీ రామకృష్ణకవిగారు ప్రకటించిన కుమారసంభవమునందువలెనే యథాతథముగా నున్నది. కనుక లక్ష్మీపతిశాస్త్రిగారు కుమారసంభవమును బరిష్కరించి వావిళ్లవారి కొసగి రను విషయము సందేహాస్పదమగుచున్నది.

'శారదపై పెట్ట కబ్బగింపక చలించుచున్న సురేశ్వరుం బరమేశ్వరవందనుండు గనుంగొని' పలుకుచున్న పద్య మిది చూడుడు :

"సుజనజనైకభూషణము
 శూరత దుర్జనభూషణంబు స
ద్ద్విజవిబుధాశ్రితప్రతతి
 వేడుక ప్రోపును రాజ్యచిహ్న మా
క జలమహాభిషేకమున
 గట్టిన పట్టము వీజనంబు భూ
భుజులక కాక యిన్నియును
 బుట్టికినైనను లేవె చూడగాన్."
(౧౦-౫౬౪)

వావిళ్లవారి ముద్రణములోగూడ నీ పద్యము యథాతథముగా నిట్లే యున్నది. ఈ పద్య మిట్లుండవలయును :

"సుజనజనైకభూషణము
 శూరత దుర్జనదూషణంబు స
ద్ద్విజవిబుధాశ్రితప్రతతి
 వేడుక ప్రోపును రాజ్యచిహ్న కా
క జలమహాభిషేకమున
 గట్టిన పట్టము వీజనంబు భూ
భుజులక కాక యున్నియును
 బుంటికినైనను లేవె చూడగాన్."

ఈ పద్యములో 'దుర్జనదూషణ'మని, 'రాజ్యచిహ్న కాక' యని, 'పుంటికినైనను' అని యర్థానుకూలముగా సవరణలు చేయబడినవి. (చూడుడు: శ్రీ వేంకటేశ్వరప్రాచ్యవిద్యాపరిశోధనాలయ సం చిక.). మఱియు వావిళ్లవారు పైపద్యములోని 'పుట్టి'యను పదమునకు 'పుండుకలవా'డని యర్థము వ్రాసిరి. ఈ యర్థము విచార్యము.

ఏకాదశాశ్వాసములో దేవసేనావర్ణనపద్య మిది చూడుడు :

"తరుగులాద్రులు పిండివించుగ మహా
 ధాత్రీధరిత్రీధరో
త్కరముల్ పెంపఱి నుగ్గునూచముగ ను
 ద్యద్వాహినీవాహినీ
శ్వరవర్గంబులు ద్రుమ్మదూలిగ దదా
 శానాగసాకారిజ (?)
ర్జరితంబై పడ దేవసేన నడచెన్
 సర్వంసహాసహ్యమై."
(౧౧-౫౯౦)

వావిళ్లవారి ముద్రణములోను నీ పద్య మిట్లే యున్నది. కాని మూడవ పాదములో సంశయచిహ్నముగా గుఱుతింపబడిన ప్రశ్నార్థకచిహ్న మిందు దొలగింపబడినది. పూర్వపాదములలోని మహాధాత్రీధరిత్రీధరోత్కరముల్, ఉద్యద్వాహినీవాహినీశ్వరవర్గంబులు అను సమాసపదముల యనుప్రాసమును గమ

నించిన 'దదాశానాగపాకారి' యనుచోట 'తదాశా నాగనాగాలి' యని యుండవలెనని తోచుచున్నది. అర్థమును సరిపడుచున్నది. 'తదాశానాగపాకారి' యన్న నర్థము కుదురదు. అర్థము కుదురకయే తమ వ్రాతప్రతిలో నట్లే యుండుటచే రామకృష్ణకవిగారు దాని నట్లే ముద్రించి సంశయము తెలిపిరి. వావిళ్ల వారి వ్రాతప్రతిలోను 'తదాశానాగపాకారి'యని కలదా ?

పై సందర్భమునందలిదే మఱొక పద్య మిది చూడుడు :

"ధరణీధరశోభితమై
నిరుపమమై యమరవాహినీసంయుతమై
హరిభూషితమై పరమే
శ్వరువాకృతి బోలి గుహుని వాహిని నడచెన్."
(౧౧-౫౮)

వావిళ్ల వారి ముద్రణములో నీ పద్యమున చతుర్థ పాదము 'పరమేశ్వరునంబుధి బోలి గుహుని వాహిని నడచెన్'అని యున్నది. 'పరమేశ్వరునంబుధి'యను పాఠాంతరము శ్రీ రామకృష్ణకవిగారు ముఖ్యపాఠభేదములలో చేర్చినిరి. పూర్వపాదములలోని విశేషణములు పరమేశ్వరునకు, నంబుధికి, గుహుని వాహినికి గూడ సమానములుగ సరిపోవుటచే 'పరమేశ్వరు వాకృతి'యను పాఠముకంటె 'పరమేశ్వరునంబుధి' యను పాఠము రమ్యతర మని వావిళ్లవారు దాని గ్రహించి రనదగును. కాని యీ మార్పు వారి వ్రాతప్రతిలోని దవ గాదు.

పయిని చేర్చినిన విషయములబట్టి గ్రంథ పాఠముల దృష్టితో గాక ముద్రణస్ఖాలిత్యముల దృష్టితో జూచినను వావిళ్లవారికడ కుమారసంభవము ప్రత్యంతరము కల దనుట యయథార్థ మనియు, వారికి రామకృష్ణకవిగారు ప్రకటించిన కుమారసంభవమే మూల మనియు స్పష్టము కాగలదు. వావిళ్ల వారి ముద్రణములో గానవను మఱికొన్ని స్ఖాలిత్యములను ముఖ్యమయినవానిని చేర్చిని వివరించుచున్నాడను :

కుమారసంభవము కృత్యాదిపద్య మిది యిట్లున్నది.

"శ్రీవాణీంద్రామరేంద్రార్పితమకుటమణి
శ్రేణికామాంఘ్రిపద్మ
శ్రీవోద్యత్కేసరుం డాశ్రితజనలసితా
శేషవస్తుప్రదుం డా
దేవాధీశుండు నిత్యోదితు డజుడు మహా
దేవు డాద్యుండు విశ్వై
కావాసుం డెప్పుడున్ మా కభిమతములు ప్రీ
తాత్ముడై యిచ్చు గాతన్"*

ఇందు తొలిసమాసపదము 'శ్రీవాణీంద్రామరేంద్రార్పితమకుటమణిశ్రేణిధామాంఘ్రిపద్మాజీవోద్యత్కేసరుండు' అని యుండవలయును.

శ్రీవాణీంద్ర=లక్ష్మీసరస్వతులకు ప్రభువులగు విష్ణుదేవునిచేతను, బ్రహ్మదేవునిచేతను, అమర + ఇంద్ర=దేవేంద్రునిచేతను, అర్పిత=(సాష్టాంగ నమస్కారము చేయునపుడు శివునిపాదములందు) అర్పింపబడిన, మకుట=కిరీటములయందలి, మణిశ్రేణి=మణులవరుసలయొక్క, ధామ=కాంతుకే, అంఘ్రిపద్మ=(తన) పాదములనెడి పద్మములకు, ఆజీవ=సజీవములై, ఉద్యత్=మీది కెగయుచున్న, కేసరుండు=కింజల్కములుగా గలవాడును—అని యర్థము చెప్పుకొనవలయును. 'కామాంఘ్రి'యని 'వామాంఘ్రి'యని యున్న నర్థము కుదురదు. అచట నుండవలసినది 'ధామాంఘ్రి'యే యనుటకు నన్నిచోడని పద్య మిట్టిదే యష్టమాశ్వాసములో జూడుడు.

"హరివాణీంద్రామరేంద్రాద్యమరగణఫణీం
ద్రాసురేంద్రోరుజూట
త్కరసద్రత్నాలిధామార్పితపదనఖా
ఘప్రపూర్ణేందురశ్మి
స్ఫురితాంగోద్యత్సభాభిశోభితవరనిధ
స్తోత్రసంగీతరావా
వరితాశాద్యంతశోభావహు గనిరి మునిం
ద్రాత మా దేవదేవున్". (౮-౩)

ఇచట 'సద్రత్నాలిధామ' యని యుండుటచే కృత్యాదిపద్యమునను 'మకుటమణిశ్రేణిధామ' యనియే యుండవలయును. అర్థమును సరిపడును.

*ప్రకటనమునకై యీ వ్యాసమునకు పూర్వ వ్రాయుమ భారతిలో శ్రీ కోరాడరామకృష్ణయ్య గారు కుమారసంభవమునుగూర్చి, అందును నీ పద్యమునుగూర్చి వ్రాసిన వ్యాసము చూచితిని. వివర మందు జూడదగును.

"తల్లిదండ్రుల బూజించి తగ వెలింగి
మన్న పొడవైన నే యత్తమామ లనియెం
బ్రియ మెఱుంగు నం చిచ్చిన బిడ్డ మనకు
బాసె నని యుండు డింక నా పలుకు లేల?"

(౨-౪)

ఈ పద్య మి ట్లుండవలయును:

"తల్లిదండ్రుల బూజించి తగ వెలింగి
మన్న పొడవైన నే యత్తమామ లనియు
బ్రియ మెఱుంగు నా డిచ్చిన బిడ్డ మనకు
బాసె నని యుండు డింక నా పలుకు లేల?"

తల్లిదండ్రులు కలిగి వారిని బూజించి గౌరవించియుండిన నత్తమామలనుగూడ గౌరవింపవలయు నని యతఁ డెఱుగును. శివునకు దల్లిదండ్రులే లేరనగా నిక వారిని బూజించుట యెక్కడిది? కనుక నీ యతఁడు అత్తమామలకు జూపవలసిన గౌరవాదికము తెలియఁడు—అని భావము.

"మొగి వేయు బడసిన మునుల మూర్తుల మీఱి
ధర్మశాస్త్రములు మూర్తములు దవర
మణిదీధితుల పెంపు మాయించి సాలోక్య
ముక్తులు తను తేజములు వెలుంగ
వాణీవీణారుచి వారించి సామగా
నంబులు రుతుల దియ్యంబు పెంప
మృగమదాదుల తావి మగిడించి నుడిసి ని
జానవాంబుజగంధ మతిశయిల్ల.

జామరగ్రాహిణీకరచారురత్న
వెలుగ శేయక పాశరుచులు వొలయ
గనకమయపద్మకర్ణికాగ్రమున విశ్వ
కర్త సుఖలీల పేరోలగమున నుండె."

(౪-౭)

ఈ పద్యమునం దెత్తుగీతిలోని ద్వితీయపాదములో గణభంగము. ప్రథమద్వితీయపాదములకు అర్థసంగతియు లేదు. ఎత్తుగీతి తొలిరెండుపాదము లిట్లుండవలయును.

"చామరగ్రాహిణీకరచారురత్న
(రోచి) వెలుగ జేయక పాశరుచులు వొలయ."

"ధారాగృహమున నుండిన
నీరెంతయు నింకె గొలని నీరులలో నం
భోరుహకదళీదళస
హారంబులు గలయ గోడు గమరులు వోరుక".

(౫-౧౬)

ఈపద్యమున తృతీయపాదమున గణభంగము. 'అంభోరుహకదళీదళసహాకారంబులు' నని యుండ బోలును!

"చెలువ దన చెలిమికత్తెల బిలిచి నాకు
గూర్చు నమ్మ లెవ్వ రీ కొమ్మలందు
వారు నేకాని రక్షింపవలయు వీని
బాతిగా నని యందఱ బట్టుకంచి."

(౬-౨౭)

ఈపద్యమున తొలిరెండుపాదములలోను గణభంగము. అవి యిటు లుండవలయును.

'చెలువ దన చెల్మికత్తెల బిలిచి నాకు
గూర్చు నమ్మ లెవ్వార లీకొమ్మలందు'—

స్థాలీపులాకముగా నిట కుమారసంభవము ద్వితీయముద్రణము (వావిళ్లవారి ప్రచురణము)లోని ముద్రణస్ఖాలిత్యము లటనట పేర్కొనబడినవి. సమగ్ర పరిమర్శపరిశీలన మీ గ్రంథమున కెంతేని యావశ్యకము. మదరాసు విశ్వవిద్యాలయమువారిచే బ్రచురింపబడుచున్న కుమారసంభవ మింకను వెలువడలేదు. అందు కుమారసంభవమునకు సమగ్రపరిమర్శపరిశీలనము జరిగియుండు నని యాశింతము.

---

# కాలదోషం

[గత సంచిక తరువాయి]

[కథ]

శ్రీ పంతుల శ్రీరామశాస్త్రి

## 3

'ఈసంవత్సరంఅంత ఎండలు ఏసంవత్సరమూ లేవు. మనుష్యులే ఆవకాయల్లాగు ఎండిపోతున్నారు' అనసాగారు సామాన్యప్రజ.

'అసలు ఢిల్లీలోనో కలకత్తాలోనో నిన్న మున్గురు మనుష్యులు-ఇద్దరు చిన్న పిల్లలు, ఒక పెద్దమనిషి న్నీ చచ్చిపోయారని పేపర్లో పడిం' దని పత్రికాపాఠకులు విజ్ఞానాన్ని వెదజల్లేరు.

మధ్యాహ్నం మూడుగంటలవేళ, తూర్పుగదిలో మంచంమీద వెంకటనరసింహంగారూ, నేలను చాప మీద తలగడ పెట్టుకొని కామేశ్వరమ్మ పడుకొన్నారు.

ఇద్దరకీ నిద్రపట్టదు. ఇద్దరికీ ఏమో మాట్లాడాలనే ఉంది కాని, ఏమి మాట్లాడాలోమాత్రం స్ఫురించదు. గొంతు సర్దుకొని, ఏదో అందా మనుకొన్నా ఏదో వెలితిగా ఉన్నట్టుంది.

చాలాసేపు మంచంమీద అటూ ఇటూ దొర్లి, 'అబ్బబ్బ! ఏమిటీ గాడ్పు? ఎంత వేడిగా తగులుతూందో గాలి, హుఁ ఒకటే చెమట' అంటూ లేచి కూర్చున్నాడు వెంకటనరసింహంగారు, విసనకర్రతో జోరుగా భార్యకుకూడా కొంచెం తగిలేలా విసురుకుంటూ.

కామేశ్వరమ్మ పడుకొనే 'అమ్మాయి అత్తారింటికి వెళ్ళిపోవడం ఇల్లంతా చిన్నబోయింది. ఏమిటో ఏదో కొత్త ఇంట్లో తిరుగుతున్నట్టుంది' అంది.

'నిజమేనే, నాకూ అలాగే ఉంది; రోజుకి వందమార్లయినా నోటికి అమ్మాయీ అనే పిలుపు వస్తున్నది.'

'అదుంటే ఏవేవో పనులు కల్పించేది. ఏమీ లేకపోతే మధ్యాన్నమల్లా నవ్వు వినమ్మా అని ఎన్నో పుస్తకాలు చదివేది. ఎంతసేపూ చదువుకోడం, అల్లుకోడం, రాసుకోడం—అంతే. పాపం, అత్తవారింట్లో ఎలా మసులుకొంటున్నదో, ఎలా పనీ పాటూ చేసుకొంటున్నదో!'

'అమ్మాయికి పనిరాకేం? నువ్వు ఇంట్లో లేనప్పుడు ఇంటంతటి పనీ ఓఅన్నట్టు అవలీలగా చేసుకొనివచ్చేది కదూ!'

'అయితేమాత్రం, మనింట్లో చేసినట్టా! అత్తవారింట్లో అందర్నీ మెప్పించుకురావాలి. అందులో వాళ్ళదీ పదిమంది ఉన్న కుటుంబం అయెను. ఇంకా మొగుడు చదువుకొంటున్నాడు. అతనికీ స్వతంత్రం ఉండదు. మనపిల్లకి అన్నీ ఇక్కడ దానిష్టంమీదనే జరగడం అలవాటు. అక్కడ ఎల్లా సర్దుకొని వస్తున్నదో పిచ్చితల్లి. ఎంత మెతుకువగా ఉంటేనేం! పదిమంది ఉన్న కుటుంబంలో మాటపడిపోడం ఎంతసేపు!'

'నా కాభయం ఏం లేదుసుమా. అమ్మాయికేం మహారాజులాంటి సంబంధం. నిజంగా దాని అదృష్టమే. కాకపోతే, తాంబూలాలు ఇచ్చేస్తేమాత్రం అవతల మూడువేలు కట్నం ఇస్తామంటూంటే తిరిగి పోకపోవడం అదృష్టం కాక మరేమిటి?— అసలు, అల్లుడు మన అమ్మాయిని చూసేక, అవతల మూడువేలు కాదు, పదునాడువేలు కట్నం వచ్చినా, ఇంకొక సంబంధం చేసుకోనని పట్టుబట్టేడట. ఏదో, దాన్ని కని పెంచినందుకు ఒక అయ్యచేతిలో పెట్టేము. అంతే. కలకాలం పిల్ల మనింట్లో ఉండిపోతుందా!'

'ఆడపిల్ల ఇంట్లో ఉన్నా బరువే, మగపిల్లడు దూరంగా ఉన్నా బరువే. నా నాయన రాఘవులు ఒక్కడూ ఎలా ఉన్నాడో, ఏం చేస్తున్నాడో!'

'ఏం చేస్తాం! వాడికి మనం ఏమీ అన్యాయం చెయ్యలేదు. వాడికి ఏమహామహావాళ్ల పిల్లలకీ జరగనట్లు జరిపి చదివించేము. ఎన్ని కావాలంటే అన్ని పుస్తకాలూ బట్టలూ నా తల తాకట్టుపెట్టిఅయినా సమకూర్చేవాణ్ణిగాని ఊరుకొనేవాణ్ణా! వాడికీ ఏం తెలివితేటలకి లోటులేదు. అయితే చివరికి వాడి బుద్ధి తప్పుదారి పడితే దానికి మనం ఏంచేస్తాము? ఇదేం కొట్టిచెప్పే వయస్సు కాదుకదా?'

'మీకెప్పుడూ వాడంటే కోపమే. వాడింట్లో కనబడేసరికల్లా మీరు ధూంధాంమని కేకలు వెయ్యబట్టే వాగమ్మ కంటికి కనబడకుండా వెళ్లిపోయేడు. వాడికేం బుద్ధా భూషణమా, వినయమా వివేకమా ఏది లోటు? వాడు చదువుకొనేరోజుల్లో ఇంతవాడు అంతవాడు అని మీరే పొగిడేవారు. మనవాణ్ణి మనమే తేలిగ్గా అనుకొంటే ఊళ్లోవాళ్లకేం పోయింది, మరి నాలుగంటారు.'

'ఎందుకంటారు, నాయిష్టం నాకొడుకుని నేనంటాను, నన్ను నాకొడుకంటాడు, మధ్యను ఊళ్లోవాళ్లకేం? కాని వాడు ఎంత రానన్నప్పటికీ నాకు అనుమానం ఉంది సుమా. నాజాతకం ఇప్పటివరకూ ఒక్కపిసరు తప్పిపోలేదు. అంతా అక్షరాలా రుజువిచ్చింది. ఈ వయస్సులో బాగా, అసలు బ్రతికినబ్రతుకంతటికీ హాయిగా సుఖపడే యోగం ఉందనే అంటున్నారు, చూసినవాళ్లంతా—ఇప్పుడు నాకు సుఖం అంటే ఏమిటి, అబ్బాయి ఇక్కడో అక్కడో ఏదో పెద్దఉద్యోగం చేసుకొని పెళ్లిచేసుకొని హాయిగా ఉండడంకంటే మరేమి టుంటుంది? నాకు పూర్తిఅయిన నమ్మకం ఉంది. ఈ కుజాంతరం అంత బాగుండదు గాని, రాహువు వచ్చినతరవాత మనం నిర్విచారంగా ఉండగలమని నా నమ్మకం. అబ్బాయి అప్పట్లో వచ్చితీరుతాడు.'

'అదే నానమ్మకమున్నా. అందుకే, కావలిస్తే ఆ ఒక్క మడిచక్కా అమ్మేయండి; ఏదో బాంకులో పడేసుకొని, అందాకా పక్కగది, పిధికొట్టు, పెరటివరండా అద్దెకిచ్చేస్తే ఎలాగోలాగు మనకి గడిచిపోదా అంటాను. తాతలనాటి ఇల్లు; ఇల్లమ్మడం నా కెంత మాత్రం ఇష్టంలేదు.'

'రామాయణం అంతా విని మళ్లీ మొదటికి వస్తే ఏంచెప్పడం? మనం ఇక్కడుండి చేసేదేమిటి చెప్పు. నాకా, ఉద్యోగం అయిపోయింది. ఇక పనీ పాటూ లేకుండా ఇక్కడా అక్కడా దేవిరించేకంటే ఆ పల్లెటూరేపోయి, ఆ నివేశనంలో ఒక మిద్దె కొంప నిలవేసుకొంటాము. చుట్టూ నాలుగుమొక్కలు వేసుకొని పాదులు పెట్టుకుంటే మనకి కావలసినంత కాలక్షేపం. చేతనయిందా' ఆ మడిచెక్కకూడా సేరీపెట్టుకుంటాము. మన కిక్కడ ఇల్లెందుకు చెప్పు'.

'పోనీ, ఉంటే ఏమిటి నష్టం? అద్దెకిచ్చేస్తాం.'

'ఆఁ, అద్దె! ముందు దిగేదాకా పద్దెనిమిదీ ఇరవై ఇస్తామంటారు. తీరా దిగినతరవాత ఎనిమిదీ పదీ అని బేరాలుపెడతారు. ఇక మరమ్మత్తులనీ, అదనపు సదుపాయాలనీ దానిది దానికి సరిపెట్టేస్తారు. పైగా మిగిలినదేనా తిన్నగా మనియార్డరు కడతారా? ప్రత్యేకించి, రైలుఖర్చులు పెట్టుకొని వచ్చి వసూలుచేసుకోవడం మన కేం సదుపాయం?'

'పోనీ వాళ్లంత పంపితే అంతే అయెను. అందరూ దుర్మార్గులే ఉండరుకదా? మళ్లీ అబ్బాయిగాని వచ్చి ఉద్యోగం చేసుకొంటే అద్దె కొంపలో ఉంటాడా?'

'వాడీఊళ్లోనే ఉద్యోగం చేస్తాడని నిబ్బరం ఏమిటి? అంతగా వాడే వచ్చి ఈ ఊళ్లోనే స్థిరపడితే అక్కడి మడిచక్క అమ్మేసి ఏదో కొత్తఇల్లు కొనుక్కుంటాడు. వాడి కసలు మొదటినించీ ఈ యింటి పంపిణీ నచ్చలేదు. ఎత్తు లేకపోవడమూ, చిన్న ద్వారాలూ, కిటికీలుకూడా ఉన్నాయా లేవు అన్నట్టు ఉండడమూ—ఏనాడు కట్టినదో — ఇది ఇప్పట్లో వదల్చుకోవడమే మేలు.'

'అదీ సంగతి! మీకు అమ్మాయిల్ని అని బుద్ధి పుట్టింది. ఇక దాని కనుగుణంగా ఎన్ని కారణాలయినా చెప్తారు.'

'అవు నదీ నిజమే. అవతలవాళ్లు చేతిలో డబ్బు సిద్ధంగా పట్టుకొని ఉన్నారు. అంతా ఆడవాళ్ల మేనేజిమెంటు. ఎంతయినాసరే ఇల్లంటూ దొరికితే చాలునని ఉన్నారు. కాబట్టే మనం ఎంతంటే అంత ఇస్తా మంటున్నారుగాని, మనంతటమనం అమ్మజూపితే ఇందులో సగం రెండువేలయినా వస్తుం దని నమ్మకం లేదు ఏమంటావు?'

'మీయిష్టమే. నే చెప్తే వింటారుగనకనా?'

'ఎందుకు విన్ను? నే చేసేది తెలివితక్కువ పని అయి, నువ్వు చెప్పింది సబబుగా ఉంటే తప్పకుండా వింటాను.'

'బాగానే ఉంది మీ మాట. ఎవళ్లు చేస్తున్నది వాళ్లకి అసందర్భంగా తోచడ మెలాగు? ఒకవేళ తోచినా, ఇవతలివాళ్లు చెప్పింది సబబుగా ఉందని అనిపించడ మెప్పుడు? అంతే, మంచో చెడ్డో, మీయిష్టమే చెల్లితీరాలి; మీపట్టుదలే వచ్చింది అబ్బాయికీన్నీ.'

'మగవా డన్నవాడికి పట్టుదల ఉండవలసిందే; కాని పాపం అక్కడ ఏమి ఇబ్బందిపడుతున్నాడో; వెఱ్ఱి అభిమానం. పదీ, పదిహేనూ పంపినా తిరగ్గొట్టేస్తాడేమో. ఊఁవ్. ఇలా ఎంత విసురుకొన్నా ఇంతే. నేను కాస్త మళ్లీ స్నానం చేసివస్తాను. ఈలోగా కాఫీ వేగం కానీ. ఇవాళ సాయంత్రంలోపుని పురోణీరాత అయిపోవాలి.'

౪

ఆవేళ మెయిలు మద్రాసులో బయలు దేరడమే అరగంట లేటుగా బయలుదేరింది. మధ్యలో ఎక్కడో లైను చెడిపోయిం దని మరి కొంత ఆలస్యం.

ఇప్పుడిప్పుడే కాస్త వెనకటి ఆలస్యాన్ని కూడదీసుకొని రావడానికి డ్రైవరు శాపత్రయ పడుతూఉంటే ఎవరో పడిపోవడం! కాలుకిమాత్రం దెబ్బ తగిలిందట—అక్కడితో వదిలింది. దూరప్రయాణీకులకందరికీ బాధగానే ఉంది ఈ అడుగడుగునా వచ్చే అడ్డంకులమూలంగా. అయితే తక్కిన ప్రయాణీకులందరి బాధా, విసుగుదలా ఒకఎత్తూ, రాఘవరావు ఒక్కడి చీకాకూ ఒకఎత్తూగా ఉంది. ఇలా రైలులో కూర్చోవడంకంటే గబగబా నడిచివెళ్లిపోతే వేగం వెళ్లిపోగలనేమో అనికూడా అప్పుడప్పుడు అనిపించింది అతనికి. రాత్రి అంతా ఎలాగో గడిచిపోయింది. నిద్రపట్టకపోయినా కళ్లు మూసుకొని పడుకొంటే ఏవో కలలవంటి జ్ఞాపకాలతో గడిచిపోయింది. కాని తెల్లవారింది లగాయతు మరీ ఒంటరిగా ఉన్నట్టుంది. బండిలో మరీ తోడితొక్కిడిగా ఉంటే ఎంత కష్టమో ఒంటరిగా ఉండడమూ అంత బాధే. రాత్రి కొంత వరకూ సాయిబుగారయినా తోడున్నారు. పరస్పరం ఎక్కువ మాట్లాడుకోకపోయినా ఒకళ్లనొకళ్లు గమనించడంలో మరొకరుకూడా మనలాగే ఉన్నారన్న తృప్తి. అంతే. ఆయన దిగిపోవడంతో తన సెకండు క్లాసులోకి (అది ఇంటరుక్లాసు ఉన్న రోజుల్లోని సెకండుక్లాసు) మరి ఒక్క మనిషయినా ఎక్కలేదు. ఆ ఆంగ్లో ఇండియనుజంట తను ఉన్నాడనే ఈ పెట్టెలో ఎక్కలేదు. మరొకటి వెతుక్కుంటూ వెళ్లిపోయేరు.

ఈప్రకారం వెళ్తే ఉదయం పదిగంటలకు దిగవలసింది—తాను సాయంత్రానికయినా వెళ్లగలడో, లేదో!

ముందుగా తను ఉత్తరం రాసిఉంటే—నాన్న స్టేషనుకి వచ్చి ఉండేవారేమో. ఊహుఁ, రాయకపోవడమే మంచి దయింది. ఇంత ఆలస్యం జరుగుతున్నందుకు ఆయన స్టేషనులో ఎంత అవస్థ పడవలసి వచ్చును!

అంతే కాదు, తను ముందుగా ఉత్తరం రాసినా, వైరుచేసినా ఆయన పదిమందితోనూ ఈమాట అనకమానరు. ఇక తనను ఏదో వింతమని షినీ చూడ్డానికి వచ్చినట్టుగా ఎందరోమంది పోగవుతారు. ఉఁహుఁ, తన ఉద్దేశం ఎంతమాత్రం అదికాదే. ఎవ్వరి కంటా పడకుండా నెమ్మదల్లగా ఇంటికి వెళ్లి అమ్మ

తోనూ, నాన్నతోనూ హాయిగా ఇన్నాళ్లసంగతులూ మాట్లాడుకోవాలి. తర్వాత కావలిస్తే ఊళ్లో నలుగురు స్నేహితులనీ కలుస్తాడు.

అసలు తన నిప్పుడు అమ్మా నాన్నా గుర్తుపట్టగలరో లేరో? ఇంటికి వెళ్లేవేళకి మునుపటి ఆఅలవాటు దుస్తులు-చొక్కా పంచెమాత్రమే కట్టుకొని వెళ్లాలి. అవయినా అప్పటి బట్టలంటేటి ముతకరకం బట్టలు తన దగ్గర ఇప్పుడు లేనేలేవు. సరే బట్టలకేం, ఎటువంటివి కావలిస్తే అటువంటివి ఎంచుకొని కట్టుకోవచ్చును. కాని, అంతమాత్రంలో తను పన్నెండేళ్ల క్రితం రాఘవరా వయిపోతాడా? ఈ పన్నెండుసంవత్సరాల్లోనూ ఎంతోమార్పు వచ్చిఉంటుంది తన మొగంలో, మాట తీరులో—ఒకంతట, తానే రాఘవుల్నంటే అమ్మా నాన్నా నమ్మగలరో లేరో !

ఎన్నిపువ్వులు ! ఎన్నిపువ్వులు! అయ్యబాబోయ్' ఎంతలో దాటిపోయేయి. ఆఁ, లేదు, మళ్లీవచ్చేయి' అయితే ఇవి ఇందాకటి పువ్వులు కావు. వీటికి వాసన ఉందో లేదో, ఈరైలువాసనలో ఏదీ అందకుండా ఉంది. వాసన ఉన్నా లేకపోయినా మధువు కేం లోటు లేదు. లేకపోతే ఇన్ని సీతాకోక-చిలకలు సందడిగా ఎగర్తాయా? నిజంగా సీతాకోక-చిలకలదే నిర్విచారమయిన బ్రతుకు. తేనెతాగుతూ ఆడుకొంటూ పాడుకొంటూ పువ్వుపువ్వుకీ పరుగెత్తడమే కదూ ఉన్న పనంతా? కాని, ఈ సీతాకోక-చిలకగా మారడానికి ఎంత బాధపడిందో గొంగళిపురుగుగా ఉన్నప్పుడు? తనకయితే, గొంగళిపురుగు అసహ్యంగానూ, అది ఆకులను ధ్వంసంచేయడం అక్రమంగాను, సీతాకోకచిలక చెట్టుచెట్టుకీ పువ్వుపువ్వుకీ ఉల్లాసంగా ఎగరడం ఎంతో అందంగానూ ఆనందదాయకంగానూ ఉండవచ్చునుగాని, వాటివాటి దృష్ట్యా రెండూ భుక్తిఅన్వేషణక్రియనే నెరవేర్చుకొంటున్నాయి. రెంటికీ ఉండే ఆనందం ఒకటే కావచ్చును. తాను మునుపటి ఆ అవస్థలో పొందినకంటె ఇప్పు డేం తన్మయానందం పొందగలుగుతున్నాడా?

నిగనిగలాడే నల్లటి చాపరాతిమీద ఆ అమ్మాయి పిడకలు చరుచుకొంటున్నది. ఎంత శ్రమ, ఎంత శ్రమ. పగలల్లా చేస్తే ఎంతపేడ జాగ్రత్తపెట్టగలదో, ఎన్నిపిడకలు పెట్టగలదో; వంద ఎంతకి చెల్లుతాయో? ఈపల్లెటూళ్లలో కొనేవా ళ్లెవళ్లు? ఎరువుగా పనికివచ్చే పేడను ఇంత శ్రమపడి వంటచెరుక్కింద తయారుచేసుకోవడం ఏమి తెలివితేటలో? శరీరానికా శ్రమ, పొలాలకా సత్తువ చాలకపోవడం! అంతలో అతనికి జ్ఞాపకం వచ్చింది, తా నప్పుడు అనుకొంటున్నవన్నీ వారంరోజులక్రిందట తాను చదివిన సాంఘికారోగ్యశాస్త్రగ్రంథంలోని అభిప్రాయాలేగాని తన స్వంతం కావని. కాని, వెంటనే మనసు మరొకదారి తొక్కింది. చిరకాలంనుండి వస్తున్న ఈ అలవాటులో ఏదో తనకు తెలియని ఆనందం ఉందేమో—లేకపోతే, అంత ఉల్లాసంగా పాడుకుంటూ ఎలాగ చెయ్యగలదా నల్లకలువల కన్నులేపులకాపుపిల్లది. ఎండో తనవలె రైలులో ఒంటరిగా కూర్చొని, ఇన్ని సంవత్సరాలుగా విడిచిపోయిన ఇంటినీ తల్లితండ్రులనీ చెల్లెల్నిగురించి ఆలోచించనూ మాననూ లేక ఆలస్యానికి ఆరాటపడే వాడికి ఆఅమ్మాయి చేస్తున్న పనిలో సుఖమూ ప్రయోజనమూ కనిపించకపోవచ్చును.

దబ్‌దబ్‌దబ్..దబ్‌దబ్-దబ్‌దబ్‌దబ్‌దబ్..ధ్వనిలో ఒక నిత్యగతి లేదు. ఉన్ననీళ్లే కొద్దిగా ఉన్నాయి. అవీ శుభ్రంగా లేవు. వాటిలోనే ఊరిమురికినంతటినీ వదలగొట్టుతున్నారు రజకకులాలంకారులు. ఉదయం మొదలు ఆసాయంతనమూ ఉతికితేకూడా తిండికి చాలీచాలకుండా ఉంటుంది. పాపం, ఒక్కనిమిషం రైలువంక చూసి మళ్లీ పనిలో పడుతున్నారు. వీళ్లను ఇంత శ్రమకు పాలుచేసి పూటపూటా కొత్తబట్టలు కట్టుకోవడమూ దుర్మార్గంలాగే ఉంది; అలాగని, ఎవళ్లపని వాళ్లే చేసుకొని వీళ్లకు అసలే పని (అంటే తిండి) లేకుండా చేసీ ఫలితం లేదు. తక్కువమంది మనుష్యులు తేలికగా పనిచేయడంతో ఎక్కువ మురికిని వదలగొట్టగలగాలి; ఈలోపుని తక్కువ ఈవృత్తి నవలంబిస్తున్న మనుష్యులకు జీవితం సమస్య అయిపోకూడదు. ఏదో కొత్తరహదారి ఏర్పాటు కావాలి. బాగా ఉతికి చలవచేసిన తెల్లటిబట్టలను కట్టుకోవ

డంలోమాత్రం ప్రజలకు తృప్తీ సుఖమూ లేవా? తానూ ప్రజలను ఆనందింపచెయ్యడంలోనే జీవికను సంపాదించుకొంటున్నాడు. సాంఘికోపయోగ దృష్ట్యా రెండూ ఒక్కరకంవే. అయితే తాను రైల్లో హాయిగా విశాలంగా ప్రయాణం చేయగలుగుతున్నాడు; చాకలికి ఎప్పుడోగాని రైలెక్కే అవసరమే కలగదు; కలిగిననాడయినా-తక్కువ ప్రయాణీకులు జాగా ఉన్నా, లేదులేదు నిలబడమనో, కిందను కూర్చోమనో గదమాయిస్తారు. ఎంత వ్యత్యాసం!

తరవాత కొంతసేపటికి, అతనికి తన ఊహాప్రవాహంలోని వక్రగతి బోధపడ్డది. లేదా, అలాగని అతను తృప్తిపడగలిగేడు. వ్యత్యాసం ఉన్న మాట వాస్తవమే. కాని తానుకూడా ఎప్పుడూ ఇలాగే ఉండలేదు. ఈస్థితికి రావడానికి, నిబ్బరమయిన బ్రతుకుబాటను విడిచి ఆశల ఆశయాల దుర్గమపథాన్ని అనుసరించడానికి ఎంతమాత్రనూ వెనుదీయలేదు. ఒక రవ్వంత అటూ ఇటూ అయితే ఎంతటి అగాధంలో పడిఉండునో ఊహించబడదు. తల్లిదండ్రులకీ బంధువులకీ స్నేహితులకీ పరిచితులకీకూడా భారంగా తోచిన రోజులు—రోజులు కాదు, అత్యంతదీర్ఘమయిన సంవత్సరాలే-తన జీవితంలో ఎన్నో గడిచేయి. ఎక్కడా స్థిరమయిన ఆధారం లేక, ఆశలనూ ఆశయాలనూ వదులుకోలేక, అలాగని కోర్కెలకి విరుద్ధంగా బ్రతకాలని లేక, అప్పుడప్పుడు ఆపూట భోజనానికే ఆరాటపడే ఆరోజుల్లో ఎన్నిపర్యాయాలు తను ఆత్మహత్యచేసుకోదల్చుకొన్నాడుకాదు. అయితే, అపజయాల్ని భరించలేక ఆత్మహత్య చేసుకొన్నాడన్న అవమానపు భయమే తనను సంరక్షించింది. కాని, చచ్చిపోయినవాడికి అవమానంతోనూ, ప్రతిష్ఠతోనూ పనేమిటి? ఇదంతా ఆతర్వాత తెలుస్తుందా? అబ్బే, అప్పుడు తనకు ఆత్మహత్య చేసుకోవాలన్న కోరికకంటె, బ్రతకాలనీ, తన కలలు నిజమయితే సంతోషించాలనీ అన్న కాపీనమే ఎక్కువగా ఉండేదేమో?

ఏదయితేనేం, తన కిక అవమానభయం లేదు. తన తాపత్రయంలో, వినోదంలో తా నుండి, ముసలి తల్లిదండ్రులు కష్టపడుతూఉంటే చూసి ఊరుకొన్నాడన్న అపకీర్తి తన కిక ఉండదు. ఇన్నాళ్లూ తా నీ లక్ష్యంతోనే కృషిచేసే డన్నా లోకం మరేమీ అనదు. నాన్న తన యాభైఅయిదేళ్లలోనూ ఆర్జించలేని, ఆర్జించడానికి వీలవుతుందని ఊహించనైనా లేనంత డబ్బు తా నీ మూడేళ్లలోనూ ఆర్జించేడు. అదంతా తనకని ఏమీ ఉంచుకోకుండా ఇచ్చివేయడానికి ఎటువంటి అభ్యంతరమూ లేదు.

రాఘవరావుకి, తనతల్లిదండ్రులంటె ఏకొంచెమో శారీరకంగా మారితే మారిఉంటారుతప్ప, మానసికంగా తాను ఇంటిని విడిచిపెట్టిననాడు ఉన్నట్టే ఉంటారనీ, తనలోని అన్నిలోటుపాట్లకంటె అతిప్రధాన మయినది డబ్బు ఆర్జించలేకపోవడమే అనుకొంటూ ఉంటారనీ తోచింది.

లోపల్లోపల అతని కింకొక చమత్కారమయిన ఉద్దేశంకూడా అస్పష్టంగా ఉంది. తాను ఇంటికి వెళ్లిన వెంటనే కొంతసేపు తన స్థితి యథాపూర్వంగానే ఉందని నటిస్తే—ఇప్పటికీ ఇంకా తన ఆశలు కొనసాగకపోయినా, ఉద్యోగం చెయ్యడం అంటే అయిష్టంగా ఉన్నట్టూ, అక్కడ తను సుమారు వెయ్యి రూపాయిలు అప్పుతీర్చవలసిఉందనీ, లేకుంటే మళ ప్రవేశం చెయ్యవలసివస్తుందనీ తమాషా చేస్తే—!అంతా ఏమిటో, ఒక స్ఫుటంగా ఒక నిశ్చయంగా ప్రసరించకుండా ఉంది మనస్సు. ఎలా అయితే అలాకానీ - ముందిల్లంటూ చేరుకుంటే తక్కినవన్నీ వాటంతట అవే తేలిపోతాయి.

అతని ఆతృతవల్ల నయితే ఎంతో ఆలస్యం అయినట్లుగా తోచిందికాని నిజంగా అయినది నాలుగు గంటల ఆలస్యం మాత్రమే.

స్టేషనులో తన్ను ఎవరూ గుర్తించలేదు. నయమే! లేకుంటే అనవసరపు హంగామా!

బండీలో ఇంటికి వెళ్తున్నంతసేపూ అతనిమనస్సు పరిపరివిధాల భావించసాగింది. నాన్న ఈసరికి ఏం చేస్తూ ఉంటారో? మధ్యాహ్నం భోజనం అయి,

చుట్ట కాల్చుకుంటూ ఉంటారుకాబోలు. అమ్మ ఎల్లా ఉందో!—ఇంతసేపూ తనను వాళ్లు గుర్తించగలరో లేకో అనే ఆలోచిస్తున్నాడు. వాళ్లు తనచేత గుర్తించబడే స్థితిలో ఉన్నారో లేకో? తాను మంచివయస్సులో ఆరోగ్యంగా ఉంటూఉండికూడా ఆర్థికమయిన చిక్కులమూలాన అప్పుడెంత ఇబ్బందిపడ్డాడు కదా, వాళ్లు పాపం ముసలికాలంలో, తన ప్రాపు లేక ఎటువంటి అవస్థలు పడుతున్నారో? తాను ఇన్నాళ్లూ ఉత్తరమయినా రాయలేదు. ఏమో, అకస్మాత్తుగా ఒక్కనాడు వచ్చి, తన ప్రతాపం ప్రదర్శించి విభ్రమింపజేయాలని ఎప్పటికప్పుడు అనుకుంటూ ఇప్పటివరకూ గడిచిపోయింది. పోనీ, ఇదివరకు పడ్డంతకాలం మరి కష్టాలు పడరుకదా! ఒక్కటే విచారం - అప్పుడు డబ్బుకు నొక్కడుపడిన పరిస్థితుల్లో చెల్లెమ్మకి ఎటువంటి సంబంధం చేసేరో—ఆసమయంలో తాను ఇంటిదగ్గర ఉండి చేయగలిగినదేమిటి? ఏమీ లేదు. ప్రస్తుతం తాను తనపనిని నిబ్బరంగా చేయగలుగుతున్నాడు గనక, తనచేతనయిన సహాయం అంతా చేస్తాడు. అంతే. అంతకంటే ఎక్కువగా బాధ్యత తనకి ఉండదనుకోని నీరసపడడం కట్టి తెలివితక్కువ.

పాతవీధులూ, పాతఇళ్లే కొత్తకొత్తగా కనిపిస్తున్నాయి. కొన్నికొన్ని స్థిరమయిన గుర్తులే కనబడడంలేదు. గురయ్యకిళ్లీలకొట్టు ఈసందుచివరనే ఉండేది. ఆర్. నటరాజన్ కాఫీహోటలుకదూ ఇక్కడ ఉండవలసింది. టక్ టిక్ టక్ మని ఈ వ్రణంగిపాపు ఎలా వచ్చిందో? పాపం! నాయుడు! తాను పదో పన్నెండో ఇవ్వవలసి ఉండేది. ఈవూళ్లోనే ఇంకొకచోట ఎక్కడయినా హోటలు పెట్టేడేమో కనుక్కోవాలి.

అంతసేపూ ఎప్పుడెప్పుడు ఇంటిని చేరుకొంటానని తొందరపడిన రాఘవరావుమనస్సు తీరా వచ్చేక మరికొంచెంసేపు బండి నడిస్తే బాగుణ్ణనిపించింది.

ఇల్లేమీ ఎక్కువగా పాతబడినట్లు లేదు. అక్కడక్కడ కొద్దిగా మార్పులు చేయబడినట్లున్నాయి. శుభ్రంగా వెల్లవేసిఉంది. పండుగకి కాబోలు వేసేరు. మరేమీ విచారం లేదు. తాను భయపడుతున్నంత దారిద్ర్యంతో మగ్గిపోలేదు తన తల్లిదండ్రులు. అంతకంటే తన కేం కావాలి? చెల్లెమ్మకూడా ఉందేమో?

ఆఁ, అదుగో, అఁహాఁ, చిన్నపిల్ల. పద్నాలుగేళ్లకంటె ఎక్కువ ఉండవు. చెల్లెమ్మకి సుమారు ముప్పై ఏళ్లుండాలి. తనకంటె అయిదారేళ్లేకదూ చిన్న. చెల్లెమ్మకూతురేమో? ఇంతకూతు రుండడానికి వీలుందా? ఏమో ఇన్ని సంవత్సరాలల్లో ఎన్నివింతలు జరగడానికి సావకాశం లేదు? తానింతలా మారిపోయేడు కదా!

బండి ఆపమన్నాక అతనికి అంతసేపూ కలగని ఒక పెద్ద సందేహం కలిగింది. తాను మెట్లెక్కుతూ ఉంటే ఆ అమ్మాయి కొంచెం సిగ్గుపడింది కాబోలు, లోపలికి పారిపోయింది. అమ్మాయ్, మీ తాతగారూ, వాళ్లూ ఉన్నారా అనాలనిపించింది. కాని వినిపించుకోంటేకదూ__తన సిగ్గే తనది.

తానంటే తెలివితక్కువగా ఇంతకాలమూ తల్లిదండ్రులు ఎప్పటిలాగే ఉన్నారనకొంటున్నాడుగాని, ఈలోపుని ఎన్నిమార్పులు జరిగేయో వాళ్ల జీవితాలలోనూ. తాను లోపలకు వెళ్లడమా, మానడమా? ఇంత మేరావచ్చి, సంగతేమిటో కనుక్కోకుండా తిరిగిపోతే ఏం ఫలితం? ఆఁ, ఎవళ్లో వస్తున్నారు. తన అనుమానమే నిజం. ఒక సుమారు నలభైఏళ్ల పూర్వ సువాసిని, కళ్లజోడు, ఎఱ్ఱ తెంగావిపంచ-ఒక సుమారు పాతికసంవత్సరాల యువకుడు, ఇందాకటి అమ్మాయి, అంతకంటె నాలుగైదేళ్లు పెద్దయిన ఇంకొక అమ్మాయీ. ఇందరి దృగంబకాలూ ఒక్కమారుగా తనమీద పడ్డాయి. రాఘవరావుకి ఏమిటి మాట్లాడాలో తోచలేదు. తన ఆలోచన అంతా ఇలా విఫలమయిపోయింది. వీళ్లతో తనకు ప్రస్తుతం ఏమి పని ఉండవడం?—వీళ్లను అడిగినా వీళ్లకు తన తల్లిదండ్రుల సంగతి ఏమీ తెలియకపోవచ్చును. ప్రస్తుతానికి ఏదో హోటలులో బసచేసి, తరవాత కేశవరావునో, శర్మనో అడిగి కనుక్కోవచ్చు ననుకుంటూ వెనక్కు తిరిగేడు.

కాని, ఎఱ్ఱచెంగావిపంచెఆవిడ ఊరుకోలేదు. 'ఎవరు నాయనా, ఇల్లు పొరపాటుపడ్డావుకాబోలు! వాడూ నాలుగయిదేళ్లాయి రాలేదు. వస్తాడని రెండు రోజులనించీ ఎదురుచూస్తున్నాం. మా చిట్టి చూసి వచ్చేడంటే వాడే అనుకొన్నాం. ఎవరిల్లు కావాలి బాబూ, మాకు తెలుస్తుందేమో చూస్తాం.'

రాఘవరావుకి అంతలో దొరికిపోవా లనిపించలేదు-'నాకాఅండి? ఇది పూర్వం మావా ళ్లుండే ఇల్లు; ఉండే దేమిటి, అప్పుడు స్వంతఇల్లే. అంటే సుమారు పన్నెండు సంవత్సరాలక్రితంవరకు నాకు తెలుసును. తరవాత, ఇది మీస్వంత ఇల్లే ననుకొంటాను.'

'కాదు నాయనా. మేము అద్దెకే ఉంటున్నాము. ఏదీ ఇంకా అన్నెల్లు కాలేదు మే మిందులో దిగి. అప్పుడే ఖాళీచేసేయమంటున్నారు.'

'అయ్యో! అలాగా? ఇప్పట్లో ఈ అద్దెఇళ్లతో ఉన్న చిక్కే ఇది. కాని, ఇంటివారు ఎక్కడ ఉన్నారో తెలుసునా అండి—మావాళ్ల సంగతి చెప్పగలరేమో'.

'ఇంటివారా? పక్కవీథిలోనే ఉన్నారు. ఎవరో కోమట్లట బాబూ—వారూ, మే మిందులో దిగేముందే ఎవరో సాయబులదగ్గర కొన్నారట'.

'అలాగా. అంటే చాలా చేతులు మారిం దన్నమాట. వాళ్లకి తెలుస్తుందో తెలియదో. పన్నెండేళ్లక్రిందటి పరిస్థితి. నాదే పొరపాటు. ముందు సరిగ్గా కనుక్కోకుండా, అంతా ఎప్పటిలాగే ఉంటుం దనుకొని రావడం—మీకు అనవసరంగా శ్రమ ఇచ్చేను. వెళ్తానండి' అని మెట్లు దిగబోయేడు.

ఆవిడకు కష్టంగా తోచింది. 'పోనీ వెర్రివుగాని నాయనా, నువ్వూ మా మేనల్లుడులాటివాడివే. ఎంత దూరంనుండి వచ్చేవో? ఈపూట మాయింట్లో భోంచేసి, తరవాత తాపీగా కనుక్కోవలసిన వాళ్లను కనుక్కొందువు గాని—ఈ సామాను పట్టించుకొని ఇప్పుడు ఎక్కడకని తిరుగుతావు?'

'బాధ లేదు. ఎక్కడనా హోటలులో బస చేస్తా' నన్నాడు కొంత లొంగిపోవా లనుకొంటూనే రాఘవరావు.

ఆవిడ ఊరుకోలేదు. ఆహ్వానాన్ని రెట్టించింది. ప్రక్కనున్న యువకుడుకూడా ప్రోత్సాహంగా 'ఇప్పటికి ఉండిపోండి సార్, తరవాత నేనూ వస్తాను; అలా మనం వెళ్లి కనుక్కొందాం' అన్నాడు. వెనకనుండి వస్తున్న మంజులాలోచనమాలికాపుంజంకూడా అలాగే అంటున్నట్టనిపించింది. అంతసేపూ నీరసంగా ఉన్న జట్కామనిషికూడా అదే ఉచిత మని సలహా ఇచ్చాడు—అతనికి డబ్బులిచ్చేస్తూ మరోక రెండు గంటలు పోయేక తీసుకొని వస్తే అలా వెళ్లాలి అని. అందరి వెనకా తను, తన వెనక ఆయువకుడుగా లోపలికి ప్రవేశించాడు.

ఆనాటి ఆతిథ్యం తనకి నాటికీ నేటికీ వింతగానే రూపిస్తుంది రాఘవరావుకి.

నిజంగా ఇన్ని చేతులు మారినా ఇల్లు అట్టే మార్పు చేయబడలేదు. వీథికిటికీ కొంచెం పెద్దది కావడం, శుభ్రంగా వెల్లవేసి ఉండడం ఎంతో మార్పు జరిగిందేమో అనిపించింది తనకి. అంతే—

తన పుస్తకాలకూజా అలాగే ఉంది. అంతే కాదు, అప్పుడు తను ఇంటర్మీడియటురోజుల్లో కత్తితో చెక్కిన పేరు అలాగే ఉంది. ఇందాకా స్నానం చేస్తుంటే కనిపించింది. అప్పుడు తను ఎంతో శ్రమపడి సంపాదించి, వేసిపెంచిన సంపెంగమొక్క ఇప్పుడు బాగా పెరిగి పెద్దవృక్ష మయింది. గంపలకొద్దీ పూస్తున్నట్లుంది. అలా కొంతసేపు తా నా ఇంటిలో ఒంటరిగా ఉండేసరికల్లా, ఇన్ని సంవత్సరాలూ ఎడతెగకుండా తా నందులోనే ఉంటున్నట్లనిపించింది. అంతేకాదు, కొంచెం పరధ్యానంగా తా నుంటే, 'అమ్మా! చెల్లెమ్మా!' అని తాను పిలిచేస్తాడేమో అనికూడా అనిపించింది.

ఆవేళ—సరిగ్గా ఈ గదిలోనే, అమ్మ కూర తరుగుతూంది. తాను కుర్చీలో కూర్చున్నాడు; చెల్లెమ్మ

మంచంమీద చిఱుకుగా లేచిపోతున్నట్లుగా కూర్చుంది; నాన్న అతి ఆవేశంగా అటూ ఇటూ పచారుచేస్తూ, 'ఏదో ఒకటి తేలిపోవా లివాళ, ఎన్నా ళ్ళీవెధవ వేషాలు' అన్నారు.

అమ్మకీ చెల్లెమ్మకీ తనంటే అంతులేని నమ్మకమే—కాని, లోపల్లోపల, నాన్న ఉద్దేశాలే నిజమేనేమో ననే భయంకూడా లేకపోలేదు.

'తిన్నగా బుద్ధిగా నుందు ఆపరీక్ష పూర్తిచేసి, నౌకరీ చేసుకుంటేనే నాయింట్లో ఉండడం. లేకపోతే ఏకంగా అవతలకి నడవవలసిందే. ఈ వెధవ వేషాలు మరి సాగడానికి వీల్లేదు. ఈపాటికి తాను నౌకరీచేసి నన్ను కూర్చోబెట్టవలసిన వయస్సొచ్చింది. నేను నా పదహారోఏట నౌకరీలో ప్రవేశించేను. పాతికేళ్లు వంటిమీదికి వచ్చీ.........'

అలా నాన్న ఉపన్యాసం సాగిపోతూంది. కోపములో తన వయస్సుకూడా పెరిగిపోయినట్లు తోచిందినాన్నకి...తనకీ లోపల్లోపల ఉడికిపోతూంది. అమ్మా, చెల్లెమ్మాగాని దగ్గర ఉండకపోతే, తానూ మాటకు పదిమాటలు అనివుండేవాడే. అంటే, నాన్న మరీ విజృంభించివుండును. తరవాత ఏమో, ఎంతవరకూ వెళ్లివుండునో?

తాను తలవంచుకొని అవతలకి వెళ్లిపోతూంటే, అమ్మ 'ఎందుకండీ అలా అంటారు? వాడే చిన్నబోయి ఉంటే. కోపం వచ్చి ఈఊరు మరి రాకుండా ఎక్కడికయినా వెళ్లిపోతా' డంది.

అప్పటికీ తను ఒక నిశ్చయానికి రాలేదు. కాని, వీథి సమ్మంలో తానుండగా గట్టిగా తనకు వినబడాలనే నాన్న అన్నమాటలు—'వెళ్లనీ, వెళ్తే నాకు కొడుకే లేడనుకుంటాను—ఎక్కడికి వెళ్తాడు? చెల్లని దమ్మిడీ ఎక్కడికి వెళ్లినా ఒకటే. ఈమాటుగాని, వాడికి ఏమయినా ఇచ్చావంటే చూడు...' అవే తనని తరవాత కాపాడాయేమో!

ఆసాయంత్రమే వెంకటనారాయణ (పాపం, తరువాత ఏడాదికే చచ్చిపోయేడట.) దుకాణంకెట్టెలోంచి తీసి ఇచ్చాడు. 'పాతిక చాల్నా? పోనీ మరోక అయిదుకూడా ఉంచనీ. నే నెలాగో సర్దుకొంటాను. నీ కెప్పుడు వీలయితే అప్పుడిద్దువుగాని. అక్కడగాని ఎప్పుడయినా అంత ఇబ్బందిగా ఉంటే, రాయి— ఏమయినా వీలయితే చూస్తాను.' అన్నాడు.

అంత అభిమానంగా అత డివ్వబట్టే, అక్కడ తనచేతికి వచ్చిన మొట్టమొదటి యాభైరూపాయిల లోనూ అతడి ముప్పై పంపించేసేడు. లేకుంటే తక్కిన చిల్లరబకుళ్ళలాగే మరచిపోవును. ఏమయితేనేం, అప్పుడు పంపించగలగడంవల్ల తాను అదృష్టవంతుడు. లేకుంటే, ఆతర్వాత కొద్దినెలలకే అతను పోయేడట. తన మనస్సు ఎప్పటికీ బరువుగా ఉండును. ఇప్పుడు మాత్రం లేదూ? అటువంటి సహృదయుడయిన స్నేహితుడు పోయినందుకు. అయినా ఇది వేరు.

అప్పుడు తనని ప్రోత్సహించినవాళ్ళూ, దిగలాగినవాళ్ళూ అందరూ ఇప్పుడు ఆత్మీయులుగానే, తనను తనప్రస్తుతస్థితికి తీసుకొనివచ్చే సదభిప్రాయంతోనే కృషిచేసినట్లు కనబడుతున్నారు.

నాన్న అన్నమాటలు అప్పుడు శూలాల్లాగ గుచ్చుకొంటేనేం? అవే తరువాత తనని హాస్యాస్పదంగా తయారవకుండా కాపాడేయి. తాను ఎన్నోమార్లు ఇబ్బందులపాలయి, కొన్నికొన్ని రోజులు భోజనానికి సైతం డబ్బులేక, ఏదో చవకరకం టిఫినుతినీ, స్నేహితుల ఇళ్ళలో భోజనాలవేళ మించిపోయేవరకూ (ఆ పూటకి అక్కడ తప్పనిసరిగా ఉండిపోమనే ఛాన్సు వస్తుందని) బాతాఖానీ వేసిన రోజుల్లో, వీథిలో చేబదుళ్ళిచ్చిన స్నేహితులను తప్పించుకొని తిరిగినరోజుల్లో, అంతే కాదు, ఎవడయినా స్నేహితుడు కొత్తగా పట్నం వస్తున్నాడంటే (కొత్తలో కాస్త పూటుగా ఉంటాడుగనక వాడితో ఒక పదిపదిహేనురోజులు హుషారుగా గడిచిపోతుందని) వాడికోసం ఎదురుతెన్నులు చూసినరోజుల్లో ఎన్నెన్నో మార్లు అనుకొన్నాడు, తిరిగివెళ్ళిపోవాలని. అయితే అటువంటి రోజుల్లో అంతటి నిరుత్సాహంలోనూ నాన్న నాడన్నటువంటి కటూక్తులే స్ఫుటంగా వినిపించేవి—అంత కఠినంగా

గాని ఆయన అనిఉండకపోతే, ఏముంది, తాను మరి నాలుగుమార్లు అటూ ఇటూ తిరిగి, చివరకి తనప్రవర్తన తనకే అసహ్యంవేసి, తనకు అయిష్టమయిన ఏనౌఖరీలోనో ఇప్పటివరకూ కొట్టుకొంటూ ఉండిఉండును.

పైజ్ఞాపకాలతో వెలిపడి ఇంకొకటి అతని మనస్సీమను మెరసింది. ఆవేళ పోస్టాఫీసులో వైరు చేయాలని నిశ్చయించుకొనికూడా, ఎందుకు ఊరుకొన్నాడో, అప్పుడేగాని అక్కడ కిటికీదగ్గర అందరుమంది మనుష్యు లుండకపోతే—తాను వైరుచేసి ఉండేవాడేమో! వెంటనే నాన్న సరిగా కావాలన్న డబ్బుపంపిఉంటే,—తాను ఈ ఇంటికి ప్రస్తుతపు యజమానిగా, హైస్కూలులో మాష్టరుగానో, కలెక్టరుకచేరీలో గుమాస్తాగానో ఈపాటికి పదేళ్ళ అనుభవం సంపాదించిఉండును. ఏదో తిరిగివచ్చినంతలో స్థిరపడిపోతాడని నమ్మకం ఏమిటి? అదివరకెన్నిమార్లు జరిగింది కాదా ఇంగా? భవిష్యత్తులాగే భూతాన్ని కూడా జరిగింది జరిగినట్లుగా కాక, ఆ ఒక్క క్షణంత అలా కాక ఇంకొకలా జరిగిఉంటే, తక్కినదంతా ఏవిధంగా జరిగిఉండేదీ అన్న విషయం ఇదమిత్థమని తేల్చబడదు.

రాఘవరావుకి తన కొత్తస్థితిలో ఆ పాతఇంట్లో ఎన్నడూ తెలియని, ఎంతో అభిమానం చూపే మనుష్యులమధ్య ఉండడం మేలుకొని ఉన్నా కలకంటున్నట్లే అనిపించింది. కొంతసేపు అలా కదలకుండా కుర్చీలో పడుకోవడంతో నిద్రపట్టిపోయింది.

అతనుభోజనం చేస్తూఉండగా ఇంటావిడ నాలుగు భోగట్టాలూ—ఇంటి పేరూ, పేరూ, ఎక్కడఉన్నదీ, ఏమిటి చేస్తున్నదీ అన్నీ సక్రమంగా కనుక్కొంది. మొట్టమొదట, ఏదో చెప్పేద్దా మనిపించింది. కాని, అంతఅబద్ధం చెప్పవలసిన ప్రాణవిత్తమానభంగము లేవీ కావుకదా అని వినయంగానే, 'ఏదో సినీమాల్లో పని చేస్తూంటానండి' అన్నాడు.

'అలాగా నాయనా, మా అచ్యుతాని కదే లోకము. ఇరవై నాలుగ్గంటలూ అదే స్మరణ. వాటిలో వేషాలవీ వేస్తావా, మరేదో డైరెక్షనూ అవీనట—ఆపనా' అని నిలవేసి అడిగింది.

మంచినీళ్లు తాగి సర్దుకొని, 'రెండూ కొంచెం కొంచెం' అని చెయ్యి కడుక్కొండికి లేచేడు.

అంతసేపూ ఏదో పత్రిక చదువుకొంటున్న వాళ్ల అబ్బాయి అచ్యుతానికి ఒక్కమారుగా ఏదో వెండికొండ తమ యింట్లోకి ఎగిరివచ్చినట్టయింది. కాదా మరి? ఊరంతటికీ తాను పేరుమోసిన సినీక్రిటిక్కాయెను. తన వ్యాసాలు ఈ ఊరికి బహుశః తెలిసేఉండవచ్చును. అయితే అవి 'కలంపేరు'తో ఉండడంవల్ల ఫలానా అని తెలియకపోవచ్చును. ఇట్టి పరిస్థితిలో సుప్రసిద్ధ సినీడైరెక్టర్ అండ్ ఆక్టర్ రాఘవరావు తనంతట తాను తన యింటికి ఈవిధంగా వచ్చి అతిథి అవడం కంటె గర్వకారణం ఇంకేముంటుంది? ఇందాకా తనకి కొంచెం అనుమానం తగలకపోలేదు. కాని, ఏదీ అనుకొందికి వీలయినా ఉంటేనా? పాదాచొక్కా, పంచాను. అంతటివాడు ఇలా వస్తాడని తను ఎలా ఊహించగలడు?

కాని తనకు కలిగిన గొప్పతనాన్ని ఏవిధంగా వినియోగించుకోవడమో అచ్యుతానికి బోధపడింది కాదు. అలాగని ఊరుకొన్నాడా? రాఘవరావు పడుకొన్న వెంటనే బయలుదేరేడు సైకిలుమీద మిత్రమండలిని కలియడానికి. కాని, తీరా వెళ్లి నలుగురికీ తెలియజేసినతరువాత, తా ననుకొన్న సభాకార్యక్రమము అంతకంటె ఘనంగానే జరిగేటట్లు రూపించినా, వ్యవహారం తన చేతులలోనుండి చాలావరకు జారిపోయినట్లనిపించింది. కాదా మరి? రాఘవరావు మొదట్లో ఈ ఊరివాడుకదా? ఊళ్లోని పెద్దపెద్దలే అతిఉత్సాహంగా ఉన్నారు. ఎందరోమందికి పూర్వస్నేహితుడు. పైగా, చాలాకాలం శ్రమతమాదులు పడిపడి ఇప్పుడిప్పుడే డబ్బూ, పేరుప్రతిష్ఠలూ సంపాదించినవాడుకదా రాఘవరావు.

విందు అద్భుతంగా జరిగింది. సభకికూడా ఏ మహాదేశీయనాయకులు వచ్చినప్పుడో వచ్చేటంతమంది ప్రజలు వచ్చేరు. అయితే అందుకు కొంతకారణం

మొదట తన ఊరివాళ్ళే నన్ను అభిమానిస్తే అయి ఉంటుంది.

ఇదంతా రాఘవరావుకి బాగుంది అంటే బాగుంది, లేదు అంటే లేదు. మొదట్లో చాలా ఇబ్బందులు పడడంచేత నయితేనేమి, సహజంగా జాగ్రత్త అయినవాడు కావడంవల్ల నయితేనేమి, ఇటీవల తన డబ్బయితే నిబ్బరంగానే కనిపిస్తున్నదిగాని, తనకీర్తి ఇంత పరిమాణంలో ఉందని తెలియదు. ఎప్పుడూ ఏదో ఊపిరితియ్యడానికి వీల్లేనంత పని ఉండడమూ, తాను కలిసే మనుష్యులంతా తనవంటివాళ్ళే కావడమూ మూలాన ఏదో అనుకొనేవాడు తప్ప, ప్రజలు-ముఖ్యంగా తనఊరివారు ఇంతలా ఆత్మీయుడుగా భావించి అభిమానిస్తా రనుకోలేదు. అక్కడివరకూ బాగానే ఉంది. కాని, తా నీఊరు రావడానికి గల ముఖ్యకారణం తలిదండ్రులను చూడడం కాలేదు. ఇక ఊళ్ళో నయినా ఏదో సామాన్యుడుగా ఆ పాతవీధులలో ఒంటరిగా వెళ్తూ, ఆ కాఫీహోటళ్ళూ, ఆ కిళ్ళీ సోడా దుకాణాలూ, ఆ సినీమాహాలూ, అటౌన్‌హాలూ, లైబ్రరీ పార్కూ వీటన్నిటినీ గురించి పూర్వపుజ్ఞాపకాలన్నీ నెమరువేసుకొంటూ స్వేచ్ఛగా ఒకరిప్రేక్ష్యంలేకుండా తిరిగి ఆనందించా లనుకొన్నాడు కాని, ఏదీ కాలయినా కింద దింపని స్తేకదూ? ఒక్కక్షణమయినా తనని ఒంటరిగా విడిస్తేనా? స్నేహితులు, పరిచితులు! అభిమానము, ఆదరమూ వాంఛించదగినవేగాని ఇంత ఉక్కిరిబిక్కిరయితేమాత్రం భరించడం కష్టమే.

ఆపాయంత్రమే అనుకొన్న తన ప్రయాణం తరువాత నాలుగురోజులదాకు సాధ్యమయింది. అప్పటికీ ముఖ్యమిత్రులు కేశవరావు, నగరాజరావు, శర్మ ఇష్టపడనే లేదు—మళ్ళీ తిరుగుదలలో దిగుతానని తనచేత మాటపుచ్చుకొని మరీ విడిచిపెట్టేరు. అయితే తాను కేవలం మిత్రుల సాంగత్యమూ, విందులనూ పొందుతూ వ్యర్థంగా కాలక్షేపం చేసిన ట్లనుకోనక్కరలేదు. ముఖ్యమయిన వ్యవహారంకూడా ఒకటి సాగించేడు. తనకు డైరక్టరుగా, ప్రధానపాత్రధారుడుగా కోరినంత జీతం ఇవ్వడమేకాదు, తక్కిన పూచీ చూవత్తూ నవిూద ఉంచుకొని చేసేటూటయితే పెట్టుబడి ఎంతయినా సిద్ధమే అన్నారు, తన చిన్ననాటికి అస్వతంత్రులుగాఉండి, నేటికి స్వతంత్రులయి బాగా ఆర్జించిన ఇద్దరుముగ్గురు వణిక్ప్రముఖులు. సరిగ్గా రాఘవరావు అటువంటి మహత్తమసావకాశానికే ఎదురు చూస్తున్నాడు. అసలు ఈ ప్రయాణం ఇలా సందర్భించడం కేవలం తన కీసావకాశం కలగడానికే నేమో? ఇంతవరకూ, తనకు ఏవేవో చిన్నచిన్న అంశాలలో తప్ప, ప్రధాన కథావిషయంలోగాని, పాత్రధారుల ఎన్నికవిషయంలోగాని స్వాతంత్ర్యం లేదు. అయినప్పటికీ తన ప్రత్యేకత చూపేందుకు తానేమో తంటాలుపడకపోలేదు. కాని, ఇది తనకూ తన శక్తికీ తగిన సర్వోత్తమమయిన సావకాశం—దీన్ని అద్భుతంగా వినియోగించుకోవాలి. అలా అలా అతని మనస్సు కథనిగూర్చీ, నటీనటులను గూర్చీ, తాను ప్రత్యేకించి నృత్యంలో సంగీతంలో ప్రవేశపెట్టదలచిన వైలక్షణ్యాన్నిగూర్చీ అల్లుకొనిపోతున్నది.

అంతా అద్భుతంగా ఉంది. ఇక ఆలస్యం లేకుండా వెళ్ళి, అమ్మనూ నాన్ననూ తీసుకొని వెళ్ళిపోయి పని ఆరంభించడమే.

తానేమో రైల్లోనే వెళ్తానన్నాడు. కాని, కేశవరావు ఒప్పుకోలేదు. 'అవూరు స్టేషనుకి పదిమైళ్ళదూరం ఉంటుంది. బళ్ళుకూడా దొరికిననాడు దొరుకుతాయి; లేనినాడు లేదు. ఇదివరలో బస్సు వెళ్తూండేది. అది ఈమధ్యనే ఆగిపోయింది. మాకారుమీద మధ్యాహ్నం కాఫీ తాగి బయలుదేరితే నాలుగున్నరకల్లా వెళ్ళిపోవచ్చును—ఇదే ఉత్తమపద్ధతి. నువ్వు మరి కాదనకు' అన్నాడు.

'సరే, కాదననుగాని, నువ్వుకూడా వస్తావంటేనే' అన్నాడు రాఘవరావు.

'అలాగే, ఎప్పుడూ ఉన్న రోగాలేకదా' అని మొండికత్తి బయలుదేరవల్సొచ్చాడు కేశవరావు.

కాని, సరిగ్గా వేళకు ఏదో ప్రసూతిసంబంధమయిన కేసు-ఒక్క అరగంటలో వచ్చేస్తానని వెళ్ళాడు. కాని, అనుకొన్నంత సుళువుగా తెముల్తుందా? అక్కడనుంచే కబురు చేసేడు—ఈరాత్రికి ఉండిపోతే

రేపు ఇద్దరం కలిసి బయలుదేరవచ్చును. కాదంటే, మళ్లీ రాత్రయిపోతుంది, బయలుదేరి పొమ్మని. మరి రాఘవరావుపరిస్థితి ఆలస్యాన్ని సహించే స్థితిలో లేదు. అంతేకాక, తాను ఉండిపోతే, మళ్లీ రేపు ఎటువంటి తప్పనిసరి ప్రమాదకేసులను విడిచిపెట్టిరావలసి వస్తుందో కేశవరావు అని కారు తియ్యమన్నాడు వెంకట్రావుతో.

౫

కొత్తకోడలుసిగ్గుకంటె ముమ్మరంగా పూచాయి మామిళ్లు. కొన్నికొన్ని చెట్ల ఆకులే కనపడడంలేదు పూవులమాటున.

ఒండు విరిగి స్వచ్ఛంగా ప్రవహిస్తున్న ఏరూ, విశాలమయిన ఇసుకతిన్నెలూ, దూరాన ఆద్దరిని అస్తమిస్తున్న అరుణతరణిబింబము—రాఘవరావుకి తన ప్రయాణపు తొందర ఏమీ కనిపించలేదు. ఎంతో కాలంగా ఆప్రాంతాలతో సాంగత్యం ఉంటున్నట్లుగానే అనిపించింది. ఇందాకా కోయిల ఆలా వరసగా కొంతసేపు ఎంత తియ్యగా కూసింది! సినీమాల్లో కోయిలలూ కూస్తాయి, పావురాలూ ఎగురుతాయి, లేళ్లూ పరిగెడతాయి—అంతా నిజమే. అయితే అది చూసేవాళ్లకే. వాటిని కావలసిన పద్ధతుల్లో సమకూర్చి, తాపత్రయం పెట్టుకొన్న వాళ్లకి అవి ఏవో ఉపకరణాలుగామాత్రమే రూపిస్తాయి. ఇవాళ తనకు అటువంటి పూచీ ఏమీ లేదు. తాను కేవలం ప్రేక్షకుడు, శ్రోతమాత్రమే. అందులోనూ, ఇది ఏమీ, వెయ్యిమంది మధ్యను కూర్చొని కొనుక్కున్న టికెట్టుకి కట్టుబడిగా చూస్తున్న సినిమా కాదు. తన ఆనందానికి ఏమి అభ్యంతరం? అలా మాటిమాటికీ ఆనందిస్తున్నానని జ్ఞాపకంచేసుకోవడం కూడా అవసరమే. లేకపోతే తనకుమాత్రం దాఖలా ఏమిటి?

రాఘవరావుకి ఏటినీ, ఇసుకతిన్నెలనూ, అస్తమయసమయారుణతరణిబింబాన్నీ అంత ముభావంగా కారులోంచి చూచివిడిచిపెట్టాలనిపించలేదు. కారు ఆపించి, జోళ్ళు కారులోనే వదలి, పంచె మీదికి కట్టుకొంటూ వెళ్ళి, మొగం కాళ్ళూ చేతులూ కడుక్కొని, చల్లగా పారుతున్న ఏటినీ, మెల్లగా వీస్తున్న గాలినీ ఆస్వాదిస్తూ నిలబడ్డాడు. ఇంకెంత, ఈ ఏటినీరే కదూ తాగుతారు? విశ్రాంతిజీవితం గడపడానికి అమ్మా, నాన్నా ఎంత మంచిప్రదేశం ఎంచుకొన్నారు! ఆ పట్టణంలో, ఆ మురికి వాతావరణంలో, ఆ దోమల సంగీతమూ, అనవసరమయిన గాభరా ఇవేవీ లేకుండా నిర్విచారంగా ఇంతటి సువిశాలసుందరప్రకృతిలో ఐక్యమై నివసించడమే నిజమైన కళాదృష్టి అనుకొన్నాడు.

ఎన్ని మెలికలు తిరిగింది ఈ కొంచెం మేరలోనూ ఏరు. అదుగో ఆమద్ది చెట్లవరసల మధ్యనుంచి వెళ్లుదాం. చిన్నచిన్న ఇళ్ళూ, కొబ్బరి చెట్లూ! అదేనట—చిన్న ఊరే—అంతా ఒక నూరుగందల గడపకంటె ఎక్కువ ఉండ దన్నాడు కేశవరావు—వాడుకూడా వచ్చి ఉంటే చాలా హుషారుగా ఉండి ఉండును.

తన చిన్నతనంలో నాన్న ఎప్పుడో ఏడాదికి ఒకమారు వెళ్ళి సిస్తు అరవై రూపాయిలూ వసూలు చేసికొనిరావడం తప్పిస్తే, తనకీ ఊరుగురించి మరేమీ తెలీదు. డ్రైవరు వెంకట్రావు తొందరపడుతున్నట్లున్నాడు. అదిగో అతనూ దిగివస్తున్నాడు—పిలవడానికే కాబోలు. ఎందుకు తొందర? దగ్గరలోనే ఉంది కదూ—ఏం వెళ్లిపోలేకపోతామా? ఇన్ని సంవత్సరాలలో లేనిది ఈ కొద్దిక్షణాలలో తొందర దేనికి?—అయితే తనిప్పుడు ఇక్కడ ఏమిటి చేస్తున్నాడు? ఏమీ లేదు. ఏమిటో తనకే తెలియకుండా అలా ఇసుకలో కూర్చున్నాడు.

మరి సూర్యబింబం కొండలమాటున కనబడ లేదు. నడిఆకాశాన ఇంతసేపూ వెలవెలబోతూన్న రాజముఖం ఇప్పుడిప్పుడే కళకళలాడుతూంది.

కారు మళ్లీ బైలుదేరింది. 'దారి ఇక్కడే కొంచెం సవ్యంగా లేదు. కాని, ఫర్వాలేదు, వెళ్లిపోతుంది. కిందటిమారు డాక్టరుగారు వచ్చినప్పుడు నేనే డ్రైవుచేసేనని హామీ ఇస్తున్నాడు వెంకట్రావు.

మరీమరీ దగ్గరకు వస్తున్నకొద్దీ అతని మనస్సు, చేసినవిధాన చేయకుండా తల్లిదండ్రుల ప్రస్తుతస్థితిని

గురించి ఊహచేస్తున్నది. అంతలోనే, ఎలాగూ కలుసుకొంటున్నాముకదా ఎందు కాందోళన అని అదే సర్దుబాటు చెయ్యడానికి చూడసాగింది. ఇంకా అతని మనస్సు ఎంతో దూరంగా ఉండి ఆలోచిస్తూఉండగానే కారు ఊళ్లో ప్రవేశించింది.

ఆసమయంలో అదివర కెవరూ అనుకోకుండా కారు రావడం ఊళ్లో కలిగించవలసిన అలజడిని బాగానే కలిగించింది.

పోలీసులు మొదలయినవాళ్లు రావడానికి ఊళ్లో కొట్లాటలు మొదలయినవేవీ తాత్కాలికంగా లేవు. ఇక కాంగ్రెసునాయకులో ఎవరో అంటే, ముందుగా పదిపదిహేనురోజులనుండి అట్టహాసం జరగడం, రెండు మార్లు అనుకొన్నవాటికి రావడం కుదరక తరవాత ఎలాగో దర్శనం ఇవ్వడం జరుగుతుంది. ఇక, మిగిలి ఉన్నది ఒక్కటే సావకాశం. కరణంగారింటికి అప్పుడోకమారు వచ్చేరు, పట్నంనుండి డాక్టరుగారు. కారుకూడా ఆయనదానిలాగే ఉంది. కాని వారింట్లోనూ ప్రస్తుతం ఏమీ వైద్యసహాయం అవసరం లేదే. ఇంతకీ కారును పోలిన కారుండకూడదా?

ఊళ్లోని వివిధపార్టీల చర్చా కూడాలు; పెద్దలు మాత్రం నిశ్చలంగానే ఉన్నా, కుఱ్ఱకారుమాత్రం కారుచుట్టూ మూగి, యథాశక్తి యత్కించిత్ భోగట్టా శేషాన్ని వెనుకవున్న ఇతరులకి అందిస్తున్నారు. ఏమయినా ఏదో కారణం అంటూ లేందే కార్యం (కారు రావడం) ఎందుకు జరుగుతుందీ అని మీమాంస.

రాఘవరావుకి కారులో బయలుదేరడానికి అట్టే ఇష్టం లేకపోవడానికి ఇటువంటి అలజడిని గూర్చిన అనిష్టమే కొంత కారణం. తాను అనుకొన్నట్టుగానే ఉంది. ముందు తానే దిగి ఏ ఇల్లో కనుక్కొందాం అనుకొన్నాడు కాని, కారుచుట్టూ ఉన్న ప్రజని చూసేక గాభరాగా తోచి వెంకట్రావుతో, 'వెంకటనరసింహంగారు ఆయన పేరు—ముసలాయన. పట్నంలో గుమాస్తాపని చేసి, రిటైరయి వచ్చేరు. వారిల్లు ఎక్కడుందో కనుక్కుంటే' అన్నాడు. ఇంకా వెంకట్రావుప్రశ్న సగం నోట్లోనే ఉంది; కొందరు 'ఇలా వెళ్లి కుడిచేతివేపు తిరిగితే అడ్డువీథిలో ఆఖరిఇల్లు. ముందు పిట్టగోడ, గేటు ఉంటాయి. వేరే, దేనితోటి కలియకుండా ఉంటుంది' అని మార్గం సూచించేరు. మరికొందరు తమలో తాము 'ఊళ్లో ఉన్న వాళ్లఘోషే వరసయ్యపంతులు కక్కర్లేరు. అతన్తో ఏంపనో' అని చర్చిస్తున్నారు. సన్నని దారిలో మెల్లగా దారి చేసుకుంటూ నడుస్తున్న కారుధ్వనిలోగాని, ఇతర గల్లంతులోగాని మునిగిపోకుండా స్ఫుటమయిన స్త్రీకంఠము ఒకటి వినిపించింది రాఘవరావుకి. 'అతని కొడుకే కాబోలర్రా, ఆ సుశీలమ్మ మాఅన్నయ్య మాఅన్నయ్య మద్రాసులో ఉన్నాడంటుంది.' అని వినిపించింది.

'అయితే మరేం, బాగుంది. చెల్లెమ్మకూడా ఇక్కడే ఉందన్నమాట' అని ఉల్లాసంతో పల్లవించింది అతని మనస్సు ఆకొద్దిసేపటిలోనే.

అదుగో అదే—గుర్తులు సరిగానే ఉన్నాయి. ఇల్లు ఒక్కటే ఉంది. చుట్టూ అట్టే ఎత్తులేని మట్టిగోడ—లోపల ఏవేవో మొక్కలు. అసలు ఇల్లు అన్న కట్టడం కొంచెం దూరంగా ఉంది. తలుపు పిలవాలి—ఏమని పిలవడం?

కారు దిగి ఏదో సందేహం తోచినట్లుగా 'అయితే కారెక్కడ ఉంచుతావు? అయినా ఇక్కడి ఈవ్యవహారం రేపల్లా పడుతుంది కాబోలు. ఇప్పుడు భోంచేసి నువ్వు వెళ్లిపోతేనే మంచిది. అవతల మళ్లీ వాడికి (కేశవరావుకి) అవసరం ఉంటుందేమో' అన్నాడు.

వెంకట్రావు వినయంగానే 'అక్కర్లేదు బాబూ. మాపంతులుగారు ఒకటిరెండురోజులకి మరేం తొందర్లేదనే చెప్పేరు. మళ్లీ తమరు బయలుదేరేదాకా ఉండమని చెప్పేరు. కారు కరణంగారి పెంకుటిసాలలో పెట్టేస్తాను' అన్నాడు.

'సరే, అలాగే. ఈ హోల్డాలూ, సూటుకేసూ ఇంట్లో పెట్టేసేక నువ్వు ఇది అక్కడ ఉంచేసివస్తావు' అన్నాడు రాఘవరావు.

'ఇక్కడ మా మేనమామగారి కుటుంబము ఉన్నారు సార్. చిన్నప్పుడు మామామే నన్ను పెంచి చదివించేరు. నే నక్కడికి వెళ్లిపోవాలి' అని కొంచెం ఆగి 'తలుపు పిలవమన్నారా?' అన్నాడు — రాఘవరావు మొగమాటపడుతున్నాడేమోనని అను మానించినట్లుగా.

'ఎందుకూ, నేనే పిలుస్తా' నన్నాడు రాఘవ రావు. అమ్మా, అమ్మా!...తన గొంతు తనకే చిత్రంగా వినిపించింది. ఉఁ హుఁ. బాగా లోపల ఉన్నారు కాబోలు. తట్టాలి, తలుపు మరికొంచెం గట్టిగా తట్టాలి—'అమ్మా, అమ్మా'

'ఎవరు, అన్నయ్యే! అన్నయ్యే! ఎన్నాళ్లకి' అని తనతో మరి మాట్లాడకుండా 'అమ్మా! అమ్మా! అన్నయ్య వచ్చేడమ్మా!' అంటూ లోనికి పరుగెత్తినంత తొందరగా వెళ్లింది.

రాఘవరావుకి ఒక్కమారుగా తల దిమ్మెక్కిపోయినట్టయింది. ఆమె 'అన్నయ్యా' అని ఉండక పోతే, ఆమే సుశీల అని తాను పోల్చుకోలేకపోయి ఉండును. పాపం, ఎన్నాళ్లయిందో వైధవ్యం సంప్రాప్తించి. ఛా! తా నెంత మూర్ఖుడు. కఠినుడు! వీళ్ల ప్రసక్తే లేకుండా స్వార్థంగా తన తాపత్రయం తాను పడుతూ కూర్చున్నాడు. కాక తను చెయ్యగలిగిం దేమిటి? తను దగ్గరుంటేమాత్రం చనిపోయే మనుష్యులను బ్రతికించి ఉంచగలడా? కాకపోతే తాను దగ్గర ఉండి ఓదార్పుమాటలు చెప్పవచ్చును. పాపం, ఎల్లా అయిపోయిందో, తనకంటె కూడా పెద్దగా ఉన్నట్టుంది. అలా అడుగులో అడుగు వేసుకుంటూ లోపల ప్రవేశించాడు. తన వెనకాతలే హోల్డాలూ సూట్‌కేసూ పట్టుకొని వస్తున్నాడు వెంకట్రావు.

రాఘవరావుకి ఇంకొక భయం వేసింది. 'అమ్మా, అమ్మా' అని సుశీల లోపలికి పరుగెత్తింది కదా, నాన్న ఏరీ? ఏమిటి కొంపతీసి...అఁహఁ, అబ్బే తాఁ వట్టినే భయపడుతున్నాడు. ఇందాకా విన బడిన గొంతుకలలో నరసయ్యబాబు ఊళ్లో వాళ్లతోనే మాట్లాడ డన్నట్టుగా వినిపించింది. మరేం భయంలేదు—అరుగో అమ్మా, సుశీలా వస్తున్నారు. నాన్న ఎక్కడికో వెళ్లి ఉంటారు, అంతే—

అతనికి వెంకట్రావు దగ్గర్లో ఉండడం కూడా కొంచెం ఎబ్బెట్టుగా తోచింది. 'మరి నువ్వు ఉండ నంటున్నావుకదూ, అవి అక్కడ ఉంచి వెళ్లమ్మా! ఉదయం కలుస్తావుకదూ? రేపు సాయంత్రంలోగా బయలుదేరేమాటయితే. బాధలేదు—లేకుంటే నువ్వు కారు తీసుకొని వెళ్లిపోవచ్చును' అన్నాడు.

"తొందర్లేదు సార్, తమ పని పూర్తయే దాకా ఉండమన్నారు మా పంతులుగారు. ఉదయం మళ్లీ దర్శనంచేస్తాను—నమస్కారం" అని శలవు తీసుకొన్నాడు.

'నా నాయన నా నాయన! రాఘవులు వచ్చేడు' అంటూ అమ్మ రెండుచేతులూ పట్టుకొంది. తనకి కళ్ల నీళ్లు ఎందుకు వచ్చేయో? అబ్బే! మరి నిరోధించాలని ప్రయత్నంచేసి లాభంలేదు.........ఎలాగో సర్దుకొని, గొంతు తెమల్చుకొని, లోపల ధైర్యంగా ఉన్నా, ఏదో మూలనించి వస్తున్న అనుమానాన్ని వదలించుకొందికి 'నాన్న ఏరీ?' అన్నాడు అతిఅసహజ మయిన గొంతుతో.

ఏదో మరిచిపోయినట్లుగా సుశీల 'నాన్నా? పెరట్లో పెయ్యని విప్పుతున్నారు. ముందు అమ్మకి నిన్ను చూపించాలని అమ్మని తీసుకొనివచ్చేను—నాన్నని పిలుస్తా' నంటూ మళ్లీ పరుగెత్తింది సుశీల.

రాఘవరావుకి తా నెదుర్కొనవలసిన విషాద ఘటనలకి ఒకమితి ఏర్పడిందికదా అని నిబ్బరం కలిగింది. పక్కనున్న నులకమంచంమీద అమ్మను కూర్చోపెట్టి పక్కను తానూ కూర్చొని, గద్గదిత మయిన గొంతుతో, 'అమ్మా! నిజమేనమ్మా! నాది తప్పే. మీ రిబ్బందులు పడుతూ ఉంటే, ఏవో స్వప్రయత్నాలకోసం తాపత్రయపడుతూ, మీ సుఖం సంగతి చూడలేకపోయేను... అమ్మా, అమ్మా! ఇన్నాళ్లూ ఎటువంటి చిక్కులు పడ్డారో, ఇక మీదట......' అని ఇంకా ఏమో అనబోతూ ఉండగా 'మా కష్టసుఖాల మాటకేం? ముసలాళ్లం, ఎలా గడిచి

పోయినా గడిచిపోయిందే—నువ్వు ఎన్ని ఇబ్బందులు పడినా కొంపని కాస్త సుఖపడగలిగితే మాకంతే చాలును' అన్నాడు అప్పుడే వచ్చి పక్కనున్న కర్ర బల్లమీద కూర్చుంటున్న వెంకటవరసింహంగారు.

చిత్రమే—ఈ సుమారుపదమూడుసంవత్సరాల లోనూ, నాన్న శరీరంలో అట్టే మార్పు లేదు—అప్పటి కంటె ఇప్పుడే ఆరోగ్యంగా ఉన్నట్టుంది. కాని, గొంతుకలో మాత్రం ముసలితనం బాగా వచ్చేసింది.

రాఘవరావుకి ఏమిటి మాట్లాడాలో, ఏమిటి మాట్లాడకపోవాలో ఏమీ స్ఫురించకుండా ఉంది. ఏమాట అనదలచుకొన్నా ఎవరో దూరపుబంధువులతో ముందుగా అనాలని అనేసుకొన్న మాటలులాగే తోచ సాగాయి. కాని ఊరుకుంటే ఎలాగ? అతిప్రయత్నం మీద, 'ఇన్నాళ్లూ మీరు చిక్కులుపడితే అందుకు పూర్తిగా బాధ్యత నాదే. అయితే ఇకమీదట నిర్విచారంగా ఉండవచ్చును. అసలు ఏడాదికిందట రాద్దా మనుకొన్నాను. కాని, నేనే రావాలనుకొంటూ, తెరిపి చేసుకొనేసరికి ఇన్నాళ్ళయింది' అన్నాడు.

వెంకటవరసింహంగారు పైమీదిగావంచాతో మొగం తుడుచుకుంటూ 'పోనీ, ఎన్నాళ్లకయినా నువ్వు వచ్చి కంటపడ్డావు. దానికి (మీఅమ్మకి) నిన్ను చూడకుండా చచ్చిపోతా నేమోనని మనోవ్యాధయి పోయింది-ఏదో ఉత్తరంముక్క రాసిపడేయకుండా, నువ్వే రావడం క్షేమయిన పని చేసేవు. ఉత్తరం రాస్తే ముసలివాళ్లం కదలలేము, మానలేము—బయుల్దేరాలంటే నానాశ్రమాను. అందులో రైళ్లు ఇప్పుడు మరీమరీ ఇరకటంగా ఉంటున్నాయిటకదూ—' అని, 'ఇప్పుడే వస్తాను. పెయ్యని కట్టేయకపోతే సిరాలు కొరికే స్తుంది' అంటూ పెరట్లోనికి వెళ్లేడు.

అమ్మకూడా లేచింది 'అన్నం చిమిడిపోతుం దేమో' అంటూ. 'నేను వస్తాను, నువ్వు కూర్చో అమ్మా' అంది సుశీల. 'ఎందుకు? నువ్వు కూర్చోని, అన్నయ్యతో మాట్లాడుతూఉండమ్మా' అని, రాఘవ రావుతో, 'నాయనా! నువ్వు కంటబడ్డావు. ఇక నేం విచారం లేకుండా చచ్చిపోగల్ను. భగవంతుడు దాన్నే అర్థాన్నంచేసేసేడు. నాలుగేళ్లయినా నిండా సంసారం చెయ్యలేదు' అని ఆవిడ మరి మాట రాక లోనికి వెళ్లి పోయింది.

తనపనీ అంతలాగే ఉంది. చెల్లెల్ని ఓదార్చా లనీ, ఏవేవో మాటలు చెప్పాలనీ ప్రయత్నం చేస్తున్న కొద్దీ తన కన్నీళ్లు మరీ ఎక్కువవుతున్నాయి. రాఘవ రావు అప్పట్లో అనుకోకపోయినా, ఏవేవో పొడిపొడి మాటల కంటె ఆ కన్నీళ్లే నిజమయిన ఓదార్పేమో.

అంతలో తండ్రి రావడం తప్పనిసరిగా వాస్త వికజగత్తులో పడ్డాడు రాఘవరావు. చెల్లెమ్మ లోనికి వెళ్లిపోయింది.

'ఇందాకా పెయ్యని విప్పుతో ఉంటే ఎవరిదో కారు ఇలా వచ్చిం దన్నాడు సరివిగాడు. అందుమీద వచ్చే వేమిటి? రైలయితే రాత్రి ఏతొమ్మిదిగంటలకో గాని రాదుకదా?'

'అయినా నేను రయిలుమీదే వద్దా మను కున్నాను.'

'ఊఁ'

'అయితే అసలు మీ రిక్కడ ఉన్నారనే నాకు తెలీదుకదూ. పాతఇంటికి తిన్నగా వెళ్లేను. అక్కడ ఊళ్లో వాకబుచేస్తే తెలిసింది. అక్కడ డాక్టరు కేశవ రావు ఉన్నాడు కదూ - వాడే చెప్పేడు. రాత్రి పది గంటల ప్రాంతంలో రయిలుదిగితే బళ్లుకూడా ఉంటాయో ఉండవో, పదిమైళ్లు నడిచివెళ్లాలని— అయినా బాధ లేదన్నాను నేను. కాని, తనకారుమీద వెళ్లక తప్పదని బలవంతం చేసేడు. అతనూ కలిసివద్దా మనుకొన్నాడు. కాని, వీలయింది కాదు.'

'అలాగా, అతగాడికీ నీకూ అంత స్నేహమన్న మాట?'

'అప్పటి స్నేహమే. నేను అక్కడికి వెళ్లిన తరవాత మీరు ఇక్కడున్నారని తెలిసినతరవాత వెంటనే ఆ సాయంత్రమే ఇక్కడికి వద్దామను కొన్నాను. కాని, ఏవో సభలనీ, మరికొన్ని వ్యవహా

రాలనీ ఈ నాలుగురోజులూ కదలనియ్యలేదు అక్కడి వాళ్లు.'

'ఏదో ఇంతకీ వచ్చేవు, అక్కడ లేమని తెలియగానే తిరిగి వెళ్లిపోకుండా'—అని వంటింటివేపు తిరిగి, 'ఔనే, అబ్బాయి ఆకలిపడిఉంటాడు. కొంచెం వేగం తెమలనీ' అంటూ, ఇంకా ఏవేవో వంటవిషయంలో సలహాలు చెప్పడానికి కాబోలు వెళ్లేడు వెంకటనరసింహంగారు.

రాఘవరావుకి అత్యంతాశ్చర్యకారణం అయింది తండ్రియీభావం. తనను చూసి తండ్రి మిక్కిలి ఆనందించడమో, లేక పూర్వపుస్థితిగతుల నన్నిటినీ జ్ఞాపకం చేసుకుని, ఇప్పటికీ తాను మునపటిలాగే నిరర్థకంగా ఉంటున్నాడని తలచి కోప్పడడమో జరుగుతుం దను కొన్నాడు. కాని, చిత్రం, ఆయనకు తన ప్రసక్తే అట్టే కావలసినట్లు లేదు. ఎక్కడ ఉన్నావు, ఎలా ఉన్నావు, ఏమిటిచేస్తున్నావు, ఏమిటికథ—ఏ ప్రశ్నా లేదు. ఎవడో దారంట వెళ్లిపోతున్న బంధువు ఆ పూటకి భోజనానికి వస్తే చేసినట్లు కుశలప్రశ్న చేసి ఊరుకోవడం—పూర్వపు ఆ మనిషేనా ఈయన—ఎంతమార్పు తీసుకొనివచ్చింది కాలం—

పోనీ ఆయన చెప్పినట్లుగానే ముసలివాళ్లు ముసలివాళ్లే. చెల్లెమ్మ హాయిగా ఉందా? పాపం ఆమెగతి అల్లా అయిపోయింది. అమ్మలో మునపటి ఆకతే లేదు. ఎంత బలహీనంగా ఉంది, ఎంత ముసలిదయిపోయింది; అంతా ఈ పదమూడేళ్లలోనే—

'అన్నయ్యా, మంచినీళ్లు తాగుతావా, ఒక్క క్షణంలో వంట అయిపోతుందిగాని, దాహం వేస్తున్నదేమో!' అని అందించింది.

'అట్టే దాహంగా లేదు, ఇందాకా ఏటిదగ్గర కారు దిగి నీళ్ళుతాగేను. కాని, తే' అని పుచ్చుకొని...'కూర్చో చెల్లెమ్మా' అన్నాడు.

ఇందాకటిలాగ, ఏమిటి మాట్లాడ్డం అన్న సమస్య రాకుండా, చెల్లెమ్మే అందించింది సూత్రం.

'కారులో వస్తే నీ స్వంతమే అనుకొన్నా నన్నయ్యా' అంది.

అమ్మయ్య! మరి బాధ లేదు. ఏదో పైవాళ్ల దగ్గరయితే గొప్ప చెప్పుకోడం గాని, ఇంట్లోవాళ్లకి అసలు తెలియవలసిన సంగతి తెలియకపోతే ఎలాగ అనుకుంటూ మొదలుపెట్టేడు.

'కారు లేకేం? అక్కడ ఉంది. అప్పుడు నీతో నిష్కర్షగా చెప్పేనుకదమ్మాయి, ఒక మూడు వేలయినా సంపాదించందీ తిరిగిరానని. ఇన్నాళ్లకి కాలం, పరిస్థితులు కలిసివచ్చేయి-నేను కేవలం నాటకాలలోనే పైటికి రావాలనుకొన్నాను—కాని సినీమాలలో పడవలసివచ్చింది. కాని, ఇందు కేం విచారించవలసినట్టు కనబడడంలేదు. ఇప్పటికి అంతా ఒక యాభై వేలకి లోటు లేదు. ఇప్పుడు మొన్న అనుకొన్న వ్యవహారం గాని స్థిరపడితే మళ్లీ సంవత్సరానికి రెండు లక్షలకి లోటుండదు. ఇప్పటిమట్టుకు మంచి బంగాళా అద్దెకి తీసుకొన్నాను. మళ్లీ సంవత్సరానికి ఒకటి స్వంతంగా కొనేసుకొంటాము' అని ఆగేడు.

'నాకు అప్పుడే తెలుసునన్నయ్యా, నువ్వింత వాడి వవుతావని.. కాని, ఇన్నాళ్లూ నీభోగట్టాయే మాకు తెలీదు. పోనీ ఇన్నాళ్లూ ఉత్తరమయినా రాసేవా?'

'ఏదీ అంతా సరీగా లేఖ తిరిగి, ఈ రెండున్నరేళ్లకంటె ఎక్కువ కాలేదు. ఎన్నోమార్లు ఉత్తరం రాయాలనుకొన్నానుగాని, అదేమిటో అదోకలాగ వెత్తిగా తోచేది ఉత్తరం రాయడం అంటే—'

'అవునులే అన్నయ్యా, నువ్వు ఇలా రావడమే ఎంతో బాగుంది. ఏదో ఉత్తరం రాసి పడేస్తే మరీ గాభరాగా ఉండును. మొత్తానికి అప్పుడు నీ గురించి నువ్వూ నేనూ కన్నకలలు నిజమయే యన్నమాట—'

'అవునమ్మాయి, అసలు మనం అప్పుడు కనిన కంటె కూడా ఉజ్జ్వలంగా నిజమయేయి—నువ్వు ఈ మధ్యను పత్రికలూ పేపర్లూ అవీ చూడడంలేదూ?'

'లేదన్నయ్యా, అప్పుడు కొన్నాళ్లు శ్రద్ధగా చదివేదాన్ని. తరవాత మరి ఇక్కడికి వచ్చేక ఏదో కాలక్షేపం జరిగిపోతున్నది; మరి పత్రికల అవసరమే

కనబడలేదు. అయినా కొంతకాలం, నాటకాలగురించి, ఈ నాట్యకళగురించి ఏమయినా భోగట్టా లుంటా యేమోనని చూసేదాన్ని. తరువాత తరువాత వాటి మీదా విసుగుపుట్టింది. ఎప్పటికయినా స్వయంగా అన్నయ్యే వస్తాడు, లేక ఉత్తరంఅయినా వస్తుందని నా నిబ్బరం. పోస్టుమేను వారానికి బీటుకి వస్తే ఏమిటో ఆశగా ఉండేది. ఇన్నాళ్లకి, ఆ ఆశ అనుకొన్నకంటె బాగా నిజమయింది' అని కొంచెం ఆగి సంశయిస్తూ, 'అన్నయ్యా! మరి నువ్వు...'అని ఇంకా ఏమో అన బోతుండగా, లోపలనుండి, వెంకటనరసింహంగారు, 'తరవాత, భోజనం అయేక మాట్లాడుకోవచ్చును. ఇక తల వడ్డించేస్తున్నది. రా అమ్మాయి, అన్నయ్యకి కాళ్లు కడుక్కుందికి నీళ్లూ గావంచా ఇయ్యమ్మా. వాడికి పట్టుపంచ కట్టుకొనే అలవాటు లేదు కాబోలు. ఆ పంచతోనే కూర్చోనీ' అన్నారు ఒకే బిగిని.

వంకాయ మెంతిపెట్టిన కూర, అప్పడాలు, కంది పచ్చడి, చారు...అహోహో ఏనాటి రుచులు! రాఘవ రావుకి అన్నీ అమృతోపమానంగా ఉన్నాయి. నాన్న ఏదో కూరలో లోపం ఉందంటున్నారు అమ్మతో, తనకిమాత్రం కూర దివ్యంగా ఉంది. ఆకలి లేక పోయినా, ఇటీవల అలవాటుపడినకంటె ఎక్కువగానే తినగలిగేడు. అమ్మమాత్రం తాను ఏమీ సరిగా తినలే దనే వాపోతున్నది. నాన్న 'వాడు తినలేనంటే అట్టే బలవంతంచెయ్యకు. కావలిస్తే, వాడికేం, నీదగ్గర మొగమాటమా?' అన్నారు......అసలు మొగమాటం లేదన్న ఈ మాటే తనని ఎంతో దూరస్థుణ్ణి చేసినట్లని పించింది రాఘవరావుకి—నాన్న శరీరం అయితే అట్టే జారిపోలేదుగాని, భోజనశక్తి తగ్గినట్టే ఉంది; అప్పుడు ఏడాదికి ఒకనాడుకూడా తనపని పొత్తి పంచ కట్టుకొనేవారు. ఇప్పుడు మడిగావంచా కట్టుకున్నారు. ఇందాకా తాను సరిగా చూడలేదు, మెడలో రుద్రాక్షతావళంకూడా ఉంది. పగలు జపం కూడా చేస్తున్నారేమో?

భోజనా లయేక, సుశీలతో తనకు ఎక్కడ ఏవిధంగా పక్క వేయవలసినదీ చెప్పి, పెరట్లో పశువులకి గడ్డి వేసుకొందికి కాబోలు వెళ్లిపోయేరు.

పూర్వం నాన్న వేసుకొనే పెద్దమంచం మీద—అది మిద్దిగదిలో ఉంది. ఎలాగో సుశీలని ఒప్పించి, ఇందాకటి నులకమంచంమీద తన హోల్డాలు పరిచేడు రాఘవరావు.

రాఘవరావు నిద్రపోదామని ఎంతమాత్రమూ అనుకోలేదు. కాని అదివరకు రెండురాత్రులుగా స్నేహితులూ, పేకాటామూలంగా ఏమీ నిద్రలేక పోవడంచేత, అమ్మా, చెల్లెలూ భోజనంచేసి తక్కువ సర్దుబాటు చేసుకొని వచ్చేలోపునే అతనికి నిద్ర పట్టి పోయింది.

రాత్రి లేకపోయినా తెల్లవారుజామున కొంచెం చలి లేకపోలేదు అన్నట్టుగా తన ప్రభావం చూపిస్తూంది. నాన్న చదువుతున్న కృష్ణకర్ణామృతం శ్లోకాలూ, భాగవతంలోనిపద్యాలూ వీటివల్ల తనకు తెలివి వచ్చింది. తన శరీరం నరనరాలలోనూ ఏదో విద్యుత్కిరణము ప్రసరించినట్లయింది. ఆ తెల్లవారు జాముప్రశాంతిలో ఆ ముసలిగొంతుకనుండి రావడం శ్లోకాలు మరీ పవిత్రంగా, తానూ నిజంగా ఒక భక్తు డయినట్లుగా, ఇంతకంటె అనుభవనీయమయిన ఆనం దము ఏముంటుం దన్నట్లుగా అనిపించింది రాఘవ రావుకి.

నాన్నకి తన ఉద్యోగం ఏమిటో తన బాగోగు లేమిటో విచారించే ఓపిక లేకపోయిందిగాని, ఉదయం పళ్లు తోముకొంటున్నంతసేపూ పెరట్లోని పువ్వుల మొక్కలూ కూరగాయల మొక్కలూ పాదులూ పండ్ల చెట్లూ వీటిగురించి ఆయన చెప్పిన ధోరణి చూస్తే ఆయనకి అవన్నీ ఏవో కాలక్షేపసాధనా లన్నట్లు కంటె, అవన్నీ ఒక్కనిమిషమయినా విడవలేని ప్రాణ మిత్రులలాగ కనిపిస్తున్నాయనడమే ఎక్కువ సబబుగా ఉం దనుకోవచ్చును. ఇంత అభిమానం కలిగిన ఈయన ఈ చెట్ల కాయలూ పళ్లూ ఏవిధంగా కోయగలుగు తున్నారో?

ఉదయం నిద్ర లేవడం, కాఫీ అయినా తాగ కుండా, ఆవులపని చూసుకొని అవసరం ఉంటే పొలానికి వెళ్లడం, లేకుంటే ఏదో అలా తోటపని

చేస్తూనే పదకొండుపన్నెండుగంటలవరకూ కూర్చోవడం, అప్పుడు నూతినీళ్లు తోడుకొంటూ పక్కా అరగంట స్నానంచేసి, జపంచేసుకొని అప్పుడు భోజనం! భోజనానంతరం ఒక్క అరగంట చిన్నకునుకు— మళ్లీ సాయంత్రం చీకటిపడేదాకా తోటపనే. మళ్లీ అప్పుడు భోజనం. అంతే, మధ్యను మరేమీ లేదు. కాబట్టే, ఈవయస్సులోనైతేం జిర్రుమని చీదకుండా ఆరోగ్యంగా ఉండగలుగుతున్నారు.

అప్పుడు తన చిన్నతనంలో 'అయ్యయ్యో, కాఫీకింద ప్రతినెలా ఇంతఖర్చు అయిపోతున్నదే' అని వగస్తూఉండడమూ, మళ్లీ ఏఒకనాడయినా పాలు రావడం ఆలస్యం అయేసరికల్లా ఎంతో చంచలంగా ఉండి బాధపడడం, అంతకంటె ఇది వెయ్యిరెట్లు నయం. అంతే కాదు. అప్పుడు ప్రతివారితోనూ అవసరంఉన్నా లేకపోయినా ఎంతో మాట్లాడేమనిషి, ఇప్పుడెవరితోనూ తన కేమీ సంబంధం లేదన్నట్లుగా ముక్కుకి సూటిగా తనపని తాను చేసుకోవడం ఎంతయినా వాంఛనీయమే.

కాని, రాఘవరావుకి ఉదయం కలిగిన తృప్తీ, ఉత్సాహమూ సాయంత్రానికి నిలవలేదు. ఇన్నాళ్లూ యీముగ్గురూ డబ్బు ఏమీ సంపాదించలేకపోయినా, నిత్యకృత్యానికి లోటులేకుండా ఒకరిని యాచించకుండా గడుపుకొని వచ్చేరు. బాగానే ఉంది. కాని, ఇప్పుడసలు మొదటికే మోసం వచ్చేటట్టుందే.

చెల్లెమ్మకి సంతోషమే: తాను బాగా ఆర్జించేడని—అంతేగాని, అది ఉపయోగించాలని కోరిక ఏమీ ఉన్నట్టు లేదు. అసలు మధ్యాహ్నం మొక్కలకి నీళ్లు తోడుతూఉండగా నాన్నతో చెప్తే, నాన్న ఒక్కక్షణం తన పని ఆపి 'నాకు ముందే తెలుసునమ్మాయి, వాడు వచ్చేడంటేనే ఒక లక్షకి పైమాటే అనుకొన్నాను' అని మళ్లీ తనపనిలో పడ్డారు. హుఁ, ఆ గురివిగాడు వెధవ ఏతాం తొక్కుతూ ఉంటే తానే స్వయంగా తోడుకుంటున్నారు. వాడితో వంకాయలగురించీ, మామిడిపువ్వుగురించీ, చిక్కుడుపాదుగురించీ, ఎత్తావుపెయ్యగురించీ మాట్లాడ్డంలో ఉన్న ఆనందం ఆయనకు తన ఆర్జనగురించీ, కష్టసుఖాలగురించీ ఉన్నట్టు లేదు.

---

ఆయనను ఈప్రదేశంనుండి కదిలించడమే ఒక పెద్ద ఘట్టమయే లాగ కనిపించింది రాఘవరావుకి. పోనీ ఇక్కడే అంత తృప్తిగా ఉంటే, ఈ యిల్లు పడగొట్టించి, లేక ఈప్రక్కనే విశాలంగాఉన్న జాగాలో చక్కటి ఎత్తయిన పెద్దయిల్లు కట్టించుకొని హాయిగా ఉండదలచుకొన్నా తనకి తృప్తిగా ఉంటుంది. అసలు ఈముఖావానికి ఏమిటి అర్థమో, కొంపతీసి తనమీద మునపటి స్వేచ్ఛాప్రియత్వానికి కోపం తీర్చుకోడం కాదు కదా! అబ్బే, అలాగేం ఉన్నట్టు లేదు. అసలు, ఇన్నాళ్లు డబ్బులేకుండా, లేదన్న పెద్ద విచారం లేకుండా, ఇక్కడి కిదే మేలన్నట్లుగా చేసుకొన్న అలవాట్లలోనే ఉంది పొరపాటంతాను. ఆయనకి ఆ పసువులపనీ, ఆ గొప్పు తవ్వుకోడం, నీళ్లు తోడుకోవడం అవే ఏవో గొప్ప ఆనందసాధనాలుగా కనిపిస్తున్నాయి– ప్రపంచంలో మరే యితర ఆనందదాయకమయిన పనీ లేనట్టు.

వీళ్లు తనతో అక్కడకు రాకపోయి, ఇక్కడయినా తన డబ్బును ఉపయోగించుకోవడం అంటే అందుకూ ఇష్టపడకపోయేమాటయితే, మరి తన డబ్బుకి సార్థక్యం ఏముంది? వృథాయేకదూ? తా నిన్నాళ్లూ అహర్నిశలు ఎవరిని తృప్తిపరచడమయితే లక్ష్యంగా పెట్టుకొని ఆర్జించాలనుకొంటున్నాడో, వాళ్లకే అక్కర్లేకపోతే తన డబ్బు ఉంటేమి, లేక ఏమి?

అయితే అలవాట్లు ఎంత బలంగా ఉంటేమాత్రం– వాతావరణమూ పరిస్థితులూ మారితే వాటంతట అవే మారిపోవూ? అక్కడ సినీమాలూ, నాటకాలూ, పాటకచేరీలూ, పత్రికలూ, పుస్తకాలూ వీటిలో మాత్రం మనిషికి ఆనందించదగిన అలవాట్లు కలిగించుకోడికి వీలులేదా? ఏదయినా ముందు ఇక్కణ్ణించి కదిలితే తక్కినవాటిసంగతి తరవాత ఆలోచించుకోవచ్చును.

చెల్లెమ్మకూడా తన ఇష్టంప్రకారం జరిగేందుకు ప్రయత్నించకపోలేదు. కాని, ఆమెకూడా

సాధ్యమయేలా లేదు. అసలు అమ్మకికూడా కదలడం అంటే ఇష్టం ఉన్నట్టు లేదు. 'ఎందుకు నాయనా ముసలివాళ్లం, మా కేముంది? ఎక్కడున్నా ఒక్కటే. నువ్వే అప్పుడప్పుడు వస్తూఉంటే అంతకంటె మా కేం కావా' లంటుంది.

ఇదివరకల్లా, తాను కనబడడమే తడవుగా, నీటిలో మునిగిపోతున్న మనుష్యులు ఆధారంగా వేసిన తాడును పట్టుకొన్నట్టు అవలంబనంగా పట్టుకొంటారనుకొన్నాడు. ఈవిషయంలో అతనికి అన్యథా జరగడానికి సావకాశం ఉందనే స్ఫురించలేదు.

అలా ఇసుకలో కూర్చొనికూర్చొని మరీ ఆలోచన తోచక ఏట్లో దిగి మొగం కడుక్కొని నీళ్లు తాగేడు. నీళ్లు రుచిగానే ఉన్నాయి కాని నిన్నటి ఆ మాధుర్యం లేదు. అవును మరి, నిన్నటికి తన మనస్సులో కేవలం ఉత్సాహమే; ఎటువంటి అనుమానస్పర్శా లేదు. అందుకే ప్రకృతి అంత రమ్యంగా కనిపించి ఉంటుందేమో? ఊళ్లోకల్లా ఉన్న మంచినీళ్లనుయ్యి తమఇంట్లోదేనట—తక్కినవాళ్లందరూ ఏటి నీళ్లు తెచ్చుకున్నా తమయింట్లో నూతినీళ్లే తాగుతారు. తనకుమాత్రం అవి తియ్యగా లేవు. నిన్న సాయంత్రం 'ఆహా ఈప్రాంతాలలో ఉండడం ఎంతటి కళాదృష్టి' అనుకొన్నాడు తాను—కాని, నిత్యమూ ఇక్కడే ఉంటే తనకూ ఏమీ ఆనందం కనిపించకపోతుందేమో—నిన్నటికీ ఇవాళకీ ఇంత భేదం ఉంది. నాన్నకి ఇల్లూ పొలంతప్ప తక్కిన ప్రపంచందృష్టే ఉన్నట్టు లేదు. అంతే కాబోలు మనిషి పద్ధతి—ఎంత విశాలమయిన చోట ఉన్నా అందులో ఒక గిరి గీసుకొని ఇదే నాది అనుకొని తాపత్రయపడుతూండడం.

'ఎందుకమ్మాయి, ముసలివాళ్లం మేం ఎక్కడ ఉంటే నేమి! మా కిప్పుడేం కావాలి? అభివృద్ధి పొందవలసినవాడు వాడు. వాడు సుఖంగా ఉంటున్నాడు. ఇక మేం అటూ ఇటూ ఎందుకు తిరుగుతూ ఉండడం? మే మింక బ్రతికినంతకాలం మరి బ్రతకం—మమ్మల్నిలా వెళ్లిపోనీండి'—ఇదీ నాన్న పల్లవి. ఏమిటి సాధనం ? ?

అమ్మయ్య! ఎలాగయితే నేం, నాలుగురోజులకి ఒప్పుకొన్నారు. ఇంతకీ ఏమిటి? చెల్లెమ్మ బలవంతం చేతా, తాను వాళ్లు రాందే మరి కదలనని పట్టుపట్టడం చేతాను.

రాఘవరావు ఆనందానికి మేర లేదు. ఇన్నాళ్లు తాను ఆర్జించిన ఆ డబ్బుకి సద్వినియోగం జరుగుతుందన్న తృప్తి ఆ క్షణాన్నే కలిగింది రాఘవరావుకి.

కాని, రాఘవరావు పైవిధంగా ఆనందించేడంటే అతన్ని అత్యల్పసంతోషి అనిమాత్రమే మనం అనాలి. ఏమంటే అది అట్టేకాలం నిలబడలేదు.

తిరిగి పట్నం రాగానే కొత్తగా తాను తీయవలసిన సినీమానుగూర్చిన పనిలో అతిఉత్సాహంగా లీనమయిపోవడంవలన సరిగా తాను గుర్తించలేదు.

నాన్నకు ఈ పువ్వులతోటా, ఈపనిమనుష్యులూ, ఈపద్ధతీ ఏమీ నచ్చలేదు. అంతా డబ్బుతో కృత హారం—ఏదో తెచ్చిపెట్టుకొన్నట్టుగానే ఉంటుంది. అయినా ఇక్కడ తాను స్వయంగా ఏపనీ చేసుకోబట్టే లేదు. అక్కడ తన మొక్కలూ అవీ ఎలా ఉన్నాయో! పాపం, ఆవుల సంరక్షణ ఎలా జరుగుతూందో? పెద్ద ఆవు ఈనవలసిన రోజులు—సుబ్బిగాడు దగ్గరఉండి చెప్పి చేయిస్తే మంచివాడే—అన్ని పనులూ చేస్తాడు. కాని వాడికి స్వయంగా ఏమీ తోచదు; పైగా మా చెడ్డ మందమతి—ఒక పని చేసేడో లేదో, మరొక్కగడియ పోయేక వాడికే తెలీదు. వాడి అజమాయిషీలో తక్కిన పశువులూ, పొలమూ ఎలా ఉన్నాయో? తోటలో మామిడి పింజలు ఈపాటికి పెద్దవయిఉంటాయి—ఇంట్లో మనుష్యులు లేకపోతే, ఊరిగుంటలంతా ఎగబడతారు. ఈపాటికి రెండు అరిటిగెలలు ముదిరిఉంటాయి—అంతా అక్కడ ఎలా గుందో!...

ఆయనకి కొడుకు తెచ్చే వేలకివేలూ, కారూ, ఎలెక్ట్రికుదీపాలూ, ఫేనులూ, సినీమాలూ, పత్రికలూ, పుస్తకాలూ, విశాలమయిన శుభ్రమయిన బంగాళా వీటివేటిమీదా కలగని కాపీనమూ, స్వంతమనే భావమూ అక్కడి ఆచిన్నయింటిమీదా, ఆ నాలుగు

పశువులమీదా, ఆ నుయ్యా ఆ చెట్లూ వాటిమీదా—అంతే కాదు, ఆ అలవాట్లమీదా కలిగింది. ఇక్కడమాత్రం ఆయనను ఎవరయినా జపంచేసుకో వద్దన్నారా? నుయ్యిదగ్గర స్వయంగా తోడుకొని పోసుకొంటేనేతప్ప ఆయనకు స్నానం చేసినట్టే ఉండదుట—బాత్ రూమ్‌లో స్నానంచేస్తే మరి జపం చేసేదేమిటి లెద్దూ అన్నట్టుంటుందట. ఏమిటేమిటో! మనిషికి అలవాటు అదొక పెద్ద సంబంధం—సుమారు పన్నెండుసంవత్సరాల ఎడతెగని గానుగ అలవాటు ఒక్కమారు మారిపోతుందా? మారితే మాత్రం సుఖంగా ఉంటుందా?

కాని వెంకటనరసింహంగారికే కొంత లౌక్యం తెలియకపోలేదు. ఆయన తిరిగి స్వగ్రామానికి బయలుదేరడానికి పైకారణాలు ఏవీ చెప్పలేదు. కామేశ్వరమ్మగారికి పట్నంవచ్చినదగ్గరనుండీ ఏమిటో సరిగా అన్నం అరగటంలేదు. కొంచెంకొంచెం జ్వరంకూడా వస్తోంది. మరేముందీ, డాక్టరుకూడా ఇక్కడ నీరూ గాలీ పడ లేదనీ, వాతావరణంమార్పు అవసర మనీ సలహా ఇచ్చేడు. ఇక మరి ప్రయాణాని కభ్యంతరం ఏముంది?

రాఘవరావు నచ్చ చెప్పాలని చాలా చూసేడు. అక్కడ వైద్యసహాయం లభిస్తుందా అన్నాడు—మరొకటి కాదు మరొకటి కాదు—ఎన్నయినా కారణాలు చెప్పేడు. ఎన్ని చెప్తేనేం, అసలు నిశ్చయంచేసుకొన్న మనుష్యులకి కారణాలతో ఏంపని?

చివరికి బయలుదేరేముందు చెల్లెమ్మతో, ‘ఇన్నాళ్లూ అంటే ఏదో సాధించా లనీ, లక్ష్యమనీ ఉండేది. ఇప్పుడు మ రేముంది? ఇంటికి వచ్చేసరికి నేనొక్కణ్ణే ఉంటే ఎలా గుంటుందో ఆలోచించు. నువ్వయినా ఉండకూడదా?’ అన్నాడు. అతని మాటల్లోని బాధ సుశీలకి అర్థంకాకపోలేదు.

‘అయ్యో, ఉండ కేమిటన్నయ్యా! అమ్మకి వంట్లో బాగున్నాక నువ్వెప్పుడు రమ్మంటే అప్పుడు వస్తాను, మరెక్కడ ఉంటాను నేను’—అని, అంతలో ఊరుకోక—

‘ఈలోపున నీపెళ్లి అయితే మేం ముగ్గురమూ వస్తాము’ అంది సోల్లాసంగా.

‘నా పెళ్లా? హుఁ, దానికేం’ అని రాని నవ్వు తెచ్చుకొంటూ, ‘కనిపెంచినవాళ్లను ఇంత సుఖపెట్టేనుగనుక ఇక కట్టుకొన్నవాళ్లను ఆనందింపజేయడానికి పెళ్లి ఒక్కటి తరవాయి ఉంది. నాడబ్బు కర్ణుడి అస్త్రాలలాంటిది. ఊహుఁ, కర్ణుడి అస్త్రాలు ముందు ఉండి వేళకు ఉపయోగానికి రావు. నాడబ్బు అలా కాదు. మొదటల్లా లేకపోయి, అవతల అవసరం మరి లేదన్న సమయంలో వచ్చింది’ అన్నాడు.

‘నువ్వలా అనుకో కన్నయ్యా! మనుష్యులకు ఉన్న దే తృప్తి—మనమట్టుకు మనకి కష్టంగా తోచని మనపని చేసుకోడంలో తప్పేముంది? ఆయన ఎక్కడిష్టముంటే అక్కడుంటారు. నీమూలంగా ఆయనకు ఇప్పు డెంత తృప్తిగా ఉందో నీకు తెలీదు. మరి యీ సంవత్సరంలోనే నీపెళ్లి అయిపోవా లన్నయ్యా—నాన్నకూడా ఇదే అన్నారు’ అంది.

రాఘవరావుకి నోటిచివరివరకూ వచ్చింది నువ్వ మళ్లీ పెళ్లి చేసుకుంటేనే నేనూ చేసుకొంటా ననాలని. కాని, ధైర్యం చాలింది కాదు.

తరవాత చివరివరకూ అతనికి లోపల్లోపల బాధగా ఉండేది. వాళ్లకు ఆ ప్రశాంతమయిన జీవితమే సుఖప్రదంగా ఉండవచ్చును. కాని వాళ్లు పట్టణ జీవితంలోని సౌకర్యాలు అరుచికరం అయేంత సుదీర్ఘ కాలం తాను అర్జించలేకపోవడం తన లోపం కాదనుకోడ మెలాగు? పోనీ, ఓ రెండుమూడు వేలయినా దగ్గర ఉండనీయకూడదా అంటే, ‘నాకే కావలిస్తే నీకు రాయనట్రా? ఎందుకు—ఇంట్లో ఉంటే దొంగ వెధవల భయం ఒకటి’ అంటారు నాన్న.

అతని పెళ్లిమాత్రమే తల్లిదండ్రులు చూడగలిగేరు—మనవలను ఎత్తుకునే అదృష్టం లేకపోయింది ఇద్దరికీని. ఒక్క పదిహేనురోజుల వ్యత్యాసంలో ప్రశాంతంగా దాటిపోయేరు భౌతికజగత్తును.

సుశీల వచ్చేసింది. తనతో మాట్లాడినంతసేపూ ఉత్సాహంగానే ఉన్నట్టుంటుంది. కాని, తను లేకపోయేసరికల్లా ఎప్పుడూ ఏవో నాన్న సంపాదించిన పురాణాలు, భగవద్గీత అవే చదువుకుంటూఉంటుంది. ఒక్క పూటే భోజనం. మధ్యమధ్యను ఉపవాసా లున్నూ. ఏమన్నా సరే, ‘నా కిలాగే బాగుం దన్నయ్యా, నువ్వేమీ నాగురించి ఆందోళనపడక పోతేనే నాకు తృప్తి’ అంటుంది. కాలదోషంవల్ల తానూ ఒకనా డిలాగే తయారవుతా డేమో అనిపిస్తుంది రాఘవరావుకి.

# కృష్ణదేవరాయలు

## ౫. కృష్ణరాయలు - మహమ్మదీయులు

(మే నెల సంచిక తరువాయి)

శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

"వీరాగ్రేసరకృష్ణరాయ భవతా
కృత్తా రణప్రాఙ్గణే
ప్రౌఢాః కేచన పారసీకపతయః
ప్రాప్తాః పురీ మామరీం,
పీరుత్తేతి సురా బలద్విషి సుర
త్రాణేతి శచ్యామ్ పున
ర్వీర్వీతి ప్రణతా సలామితి సురాన్
స్మేరాననాన్ కుర్వతే"

### ౧. బహమనీ సుల్తాను

క్రీ. శ. ౧౫౧౦ జనవరి ౨౮ తేదినాటి కృష్ణరాయల హంపిశాసనమున రాయల ప్రతాపాతిశయమును వర్ణింపుచు శాసనగ్రంథకర్త యతనిచే సురత్రాణుడొకడు పరిభవింపబడె నని వ్రాసియున్నాడు 1. రాయలచే నట్లు పరాభూతుడైన సుల్తా నెవ్వడో శాసనగ్రంథమువలన విదితమగుట లేదు. కాని యతడు బహమనీసుల్తాను ఇమ్మడిమహమూదుశా హని దృఢముగ జెప్పవచ్చును. ఏలన, (౧) కృష్ణరాయల రాజ్యాభిషేక కాలమునను, దరువాత కొంతకాలమువఱకును బహమనీ రాజ్యమును బాలించుచుండిన ప్రభువు ఇమ్మడి మహమూదు శాహు; ఇతడు ముహమ్మదుశాహులష్కరీ యను నామాంతరము గల ఇమ్మడిముహమ్మదుశాహుబహమనీ యొక్క కుమారుడు. తన తండ్రిమరణానంతరము క్రీ. శ. ౧౪౮౨ వ సంవత్సరమున రాజ్యాధిపత్యము వహించి క్రీ. శ. ౧౫౧౮ వ సంవత్సరమువఱకు ముప్పదియారేండ్లు ప్రజాపాలన మొనర్చెను. కాని పేరునకుమాత్రమితడు సుల్తాను. ముహమ్మదుశాహు లష్కరీ గతించిన వెనుక బహమనీసుల్తానుల అధికారము సన్నగిల్లినది. రాజ్యమునందలి అమీరులు తిరుగబడి యెవ్వరి జాగీరులందు వారు స్వతంత్రులైరి. వీరియందు ముఖ్యులు నలుగురు: అహమదనగర నిజాముశాహులుక, గోలకొండకుతుబశాహులుక, విజాపుర ఏదులఖాను, గావిల్ ఘుడఇమాదశాహులుక. వీరితోగూడ బెదరకోట బరీదనములుక్కను జేర్చుట యుక్తము. బరీదు తక్కినవారివలె అధికారమును దన పేర జరుపుకొనజాలక సర్వవ్యవహారములను సుల్తాను పేరనే సాగింపవలసియుండెడిది. ఇది యతని హృదయమున కంటకప్రాయమై బాధించుచుండెను. కావున సుల్తానును దొలగించి తానే యతని స్థానము నాక్రమించుకొనవలెనని యతడు ప్రయత్నము చేయుచుండెను; కాని యతని కడక సులభముగ నెఱవేరదాయెను. బహమనీసామంతు లందఱును ఎవ్వరికి వారే స్వతంత్రులైనను, వారిలో నొండొరులకు పొలు తప్పినది కాదు. స్వాతిశయస్థాపనకొఱకు నిరంతరము యుద్ధము చేయుచుండుటవలన సామకార్థ మందఱును సుల్తానునాధిపత్యము నంగీకరించిరెవ్వరికి లాభకరమని తోచినప్పుడు వారతని సముఖమునకు బోయి యతని యాజ్ఞకు బద్ధులైనట్లు కపటనాటక మాడుచుండువారు. అందువలన అప్పటి కింకను వారెవ్వరును 'సుల్తాను' అను రాజబిరుదమును ధరింపలేదు. మఱియు కృష్ణరాయలేమి, సమకాలిక పోర్చుగీసులేమి బహమనీసామంతుల ప్రస్తావము వచ్చినపుడు వారిని 'సుల్తాను' లని యనక ఖానములు కాదిబిరుదులతోడనే పేర్కొనెడివారు. కావున హంపిశాసనములో కృష్ణరాయలచే బరాభూతుడైనట్లు చెప్పబడిన సుల్తాను బహమనీసుల్తానగు నిమ్మడిమహమూదుశాహే కావలయును.

---

1. *EP. Ind. I. p.* 868 'పరిభూతసురాత్రాణేన' అని.

(౨) ఈ యభిప్రాయమును స్థిరపఱచగల సమ కాలికపోర్చుగీసుసాక్ష్యము గొంత కలదు. క్రీ. శ. ౧౫౧౦ జనవరిమాసమున పోర్చుగీసు గవర్నరు అఫ్ఫాంసో అల్బాకెర్కు కృష్ణరాయలకడకు ఫ్రయ్యరు లూయి యనునతని రాయబారమంపుచు, దనతోఁగూడి కల్లికోట మీద యుద్ధముసేయ నొడంబడిన పక్షమున, 'దక్కనురాజు' (అనగా బహమనీసుల్తాను) తో రాయ లపుడు జేయుచుండిన యుద్ధమున దాను తోడ్పడెద నని చెప్పిపంపెను. ఇందువలన క్రీ. శ. ౧౫౧౦ జనవరిమాసమున, నన గా కృష్ణరాయల రాజ్యాభిషేక మైనపిమ్మట నైదాఱునెలలలో వాతడు బహమనీ సుల్తానుతో యుద్ధముసేయుచుండె నని తెల్ల మగుచున్నది 2. హంపికోసనకాల మప్పటికి యుద్ధ మింకను ముగియక పోయినను రాయలకు జయము చేకూడెను 3.

## ౨. యూసుపు ఆదిల్‌ఖాను

కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదలో దాను త్తరదిక్కున శకధాటి జనినపుడు ఏదులఖానుని జంపి నట్లు చెప్పియున్నాడు.

"అలుకన్ ఘోటకఘట్టికాఖుర
పుటీపాల్యన్ ఖురాసానిపు
చ్చలుపో దున్ని చలచ్చమూ
గజమదాసారప్లుతి న్గీర్తిపు
వ్వులసస్యం బిడి యేకధాటి
బళిరా! కట్టించి తా దృష్టి కే
దులఖానోగ్రకపాలమర్థపహరి
ద్భ్వాజాంగలశ్రేణికిన్." 4

ఈ పద్యమువలన మూడువిషయములు దెలియ వచ్చుచున్నవి :—

(౧) కృష్ణరాయ లుత్తరదిశపై నేకధాటి వెడ లెను. 'ఏకధాటి' యనగా నఖండితమైన దండయాత్ర, లేక అడ్డమాకలేక నిరంతరాయముగ నడచిన దండ యాత్రయని యర్థము. అనగా కృష్ణరాయల కీదండ యాత్రయందు శత్రునిరోధ మెచ్చటను గలుగలేదు. (౨) అవిచ్ఛిన్నమైన ఈ ధాటియందు రాయలకు ఖురాసాను దేశజులైన తురకలతో యుద్ధము గలిగినది. కృష్ణ రాయలు విజయము గాంచెను. (౩) యుద్ధమున కృష్ణ రాయ లేదులఖానుని వధించెను.

ఈ దండయాత్ర యెప్పుడు నడచెనో అందు రాయలచే వధింపబడిన యేదులఖా నెవ్వడో కను గొనవలసి యున్నది. మొదటి ప్రశ్నకు సమాధానము రెండవదానిపై నాధారపడి యుండుటవలన నాద్యమున రెండవప్రశ్నకు సమాధానమును వెదకుట యుక్తము.

'ఏదులఖా' నను నది బిరుదు. ఇది 'ఆదిల్‌ఖాన్' అను పారసీమాట కాంధ్రరూపము. కృష్ణదేవరాయల కాలమున మనకు దెలిసినంతవఱకు ఆదిల్‌ఖానునామ ధారులు తురకప్రభువులు ముఫ్వు రుండిరి. వీరియందు ప్రథమగణ్యుడు యూసుపుఆదిల్‌ఖానుడు. ఇతనికి 'సవాయీ'యను సుప్రసిద్ధనామాంతరము గలదు. దీని నుండియే తెనుగు 'సవా', 'సవాద'శబ్దములును, పోర్చు గీసు 'సబైయో' 'సబైయసు' శబ్దములును ఏర్పడినవి. ఇతడు బహమనీసుల్తాను ఇమ్మడిమహమ్మదుశాహు కొలువున ప్రవేశించి పెక్కుయుద్ధములందు దన పరా క్రమప్రదర్శనమువలన పేరుప్రఖ్యాతులు గడించెను; కాని ఇమ్మడిమహమ్మదుశాహు మరణానంతర మతని పుత్రు డిమ్మడి మహమూదుశాహును సరకుసేయక స్వతంత్ర ముగ దన సంస్థానవ్యవహారములు నడుపుకొనుచు నను కూలపడినపు డిరుగుపొరుగు సంస్థానాధిపతులను గొట్టి వారి రాజ్యముల నాక్రమించుకొనుచుండువాడు. విజా పురరాజ్యసంస్థాపకు డితడే. ఇతడు క్రీ. శ. ౧౪౮౯ మొదలు క్రీ.శ. ౧౫౧౦ వఱకు ప్రజాపాలన గావించెను. ఇతని తరువాత పేర్కొనదగినవాడు ఇతని పుత్రుడు ఇస్మాయీలు ఆదిల్‌ఖానుడు. ఇతడు క్రీ. శ. ౧౫౧౦ మొదలు ౧౫౩౪ వఱకు రాజ్యము జేసెను. మూడవ వాడు ఖాన్దేశప్రభువు అజమ్‌హుమాయూన్ బిరుదాంకు డగు ముమ్మడిఆదిల్‌ఖానుడు. ఇతడు క్రీ. శ. ౧౫౧౦ మొదలు క్రీ. శ. ౧౫౨౦ పర్యంతము ప్రజాపాలన మొనర్చెను 5.

ఈ ముఫ్వురు ఆదిల్‌ఖానులలో రెండవవా డగు నిస్మాయీలుఆదిల్‌ఖానుని ప్రస్తావము నిచట జేయవలసిన యావశ్యకత లేదు. ఏలన, నతడు కృష్ణ

---

2. *Commentaries of Affonso Dalbuquerque, II. PP. 74-77.*

3. చూ. రాగల భారతిలోని అనుబంధము ౧.

4. ఆము. ౧: ౪౨.

5. *Briggs' Ferishta, IV. P. 307.* కాని ఇతడు క్రీ. శ. ౧౫౧౧ వఱకే రాజ్యము జేసినట్లు గుజరాతుదేశపు అరబీ చరిత్రయం దున్నది. (*Arabic History of Gujarat, III. P 22.*

రాయల మరణానంతరము నాలుగేండ్లకాలము జీవించి యుండెను; కావున కృష్ణరాయలచే నితడు వధింపబడె ననుట తగదు; అజమ్‌హుమాయూన్ ముమ్మడియాదిల్ ఖానుడు కృష్ణరాయల రాజ్యకాలమున మృతి నందినను, అతడు రాయలతోడి యుద్ధమున రణశయ్య నలంకరించె నని తలచుటకు వీలులేదు. ఏలనగా క్రీ. శ. ౧౫౧౪ వఱకును కృష్ణరాయలు కళింగదండయాత్రయందు నిమగ్నుడైయుండెను; తరువాత కాటూరిపై దాడి. అటుపిమ్మట క్రీ. శ. ౧౫౨౦ వ సం. న రాయచూరు దండయాత్రయు, నిస్మాయిలు ఆదిల్ ఖానునితో యుద్ధము జరిగెను. కావున క్రీ. శ. ౧౫౨౦ సం. న కృష్ణరాయలు ఖాన్ దేశముపై దండువెడలె నని కాని అజమ్ హుమాయూన్ ముమ్మడియాదిల్ ఖానుని వధించె నని కాని తలచుటకు వలనుపడదు. ఇక మిగిలియుండువాడు యూసుఫ్ ఆదిల్ ఖానుడు; ఇతడు క్రీ. శ. ౧౫౦౯-౧౦ న మృతినందెను; గోవెలకొండలో జచ్చె నని తారీఖి ముహమ్మదుకులీకుతుబుశాహందును, గోవెలకొండ కను చూపుమేర నుండగ మృతి నందెనని బుర్హాన్-ఇ-మ ఆసీరునందును జెప్పియున్నది 6. గోవెలకొండ విజాపురగోలకొండరాజ్యముల సరదుస్థలములం దుండిన బలిష్ఠమైన దుర్గము. కృష్ణరాయలు బహమనీసుల్తానుతో నీప్రాంతమున యుద్ధము సేయుచుండిన కాలముననే యూసుఫ్ ఆదిల్ ఖాను మృతి నందియుండుటచేతను, రాయ లాతని రణరంగమున వధించితివని చెప్పియుండుటచేతను బహమనీసుల్తానుతోడి యుద్ధముననే యాదిల్ ఖానుడును నిహతుడాయె నని తోచుచున్నది 7.

### 3. ఇస్మాయీల్ ఆదిల్ ఖానుడు

కురకలపై కృష్ణరాయల యుద్ధము యూసుఫ్ ఆదిల్ ఖానుని వధతో ముగియలేదు. యూసుఫ్ ఆదిల్ ఖానుడు దన జీవితకాలమున విజయనగర సామ్రాజ్యమునకు జెందిన కృష్ణాతుంగభద్రల మధ్య యంతర్వేదియందు జాలభాగమును రాయచూరు ముదుగల్లు దుర్గములతోగూడ నాక్రమించుకొనియుండెను. కృష్ణరాయల పూర్వికులు బలుమారీయంతర్వేదిభూములను దుర్గములను సాధించుటకు బ్రయత్నము సల్పిరి; కాని వారి మనోరథము నెఱవేఱదయ్యె. మఱియు సాళువ నరసింగరాయలు దన మరణశాసనమునందు తన యధికారముక్రిందికి రాక యన్యాక్రాంతములైయుండిన రాచోలు ఓదగిరి కొండలగి యను ముఖ్యదుర్గములు మూడింటిని వానిక్రిందిరాష్ట్రములను మరణ మాసన్నమగుటచే దాను జయింపజాలకపోతి ననియు, దనయనంతరము రాయపీఠము నధిష్ఠించు ప్రభువు లెవ్వైనను వానిని స్వైవసము జేసుకొనవలయుననియు నాదేశించియుండెను. . కావున రాయచూరు ముదుగల్లు దుర్గములను వాని క్రిందిదేశమును సాధించుట కృష్ణరాయలకు బ్రథమకర్తవ్య మాయెను. సమయముగూడ ననుకూలపడినది.

యూసుఫ్ ఆదిల్ ఖానుని మరణానంతర మతని కుమారుడు ఇస్మాయీల్ ఆదిల్ ఖానుడు విజాపుర సంస్థానమున కధిపతి యాయెను. అతడు తరుణవయస్కుడగుటచే నతని తండ్రి కార్యఖడ్గములకు కర్తయై యుండిన కమాల్ ఖానుడు అతనికి బ్రతిగ రాజ్యపాలన సేయ దొడగెను. కీర్తికాముడైన తన యజమానుడగు యూసుఫ్ ఆదిల్ ఖానుని మార్గము నవలంబించి యతడిరుగుపొరుగు సామంతుల సీమలను గబళించి విజాపుర రాష్ట్రమును విస్తరించుటకు ప్రబలప్రయత్నములు సేయగడగెను. అతని రాజ్యతృష్ణకు బహమనీసుల్తానుల ప్రాచీనరాజధాని కలుబరిగ ప్రథమకబళ మాయెను. అప్పు డాదుర్గమును, దాని కనుబంధమైయుండిన రాష్ట్రమును మల్లిక్ దస్తూరుదీనా రను హబిషీ సామంతుని పాలనక్రింద నుండెను. కమాల్ ఖా నాతని మీద యుద్ధము ప్రకటించి కలుబరిగపై గూడిచేసి రెండునెలలపర్యంత మాకోటను ముట్టడించి స్వాధీనము జేసికొనెను 9. దస్తూరుదీనారు కలుబరిగనుండి పాఱిపోయి బీదరుజేరి యచట సుల్తానుకు బ్రతిగ ప్రభుత్వము సల్పుచుండిన బరీదు మమాలి కను మంత్రిని శరణుజొచ్చెను. బరీదు అతని కాశ్రయ మిచ్చి యాదిల్ ఖానుని కలుబరిగనుండి పాఱద్రోలుటకు సైన్యముతో గూడ బయలువెడలెను; కాని యుద్ధమున బరాజితుడాయెను; సైన్యముతోగూడ వచ్చిన బహమనీసుల్తాను ఇమ్మడిమహమూదుశాహు కమాలుఖానునిచే జిక్కి బంది

6. *Briggs' Ferishta III (App) p. 850. Burhan-i-Maasir, IA-XXVIII, p. 319.*

7. చూ. రాగల భారతిలోని అనుబంధము ౨.

8. *Nuniz, See FE. Pp. 308, 316.*

9. *Commentaries of Affonso Dalbuquerque, III, Ch. VIII. p. 36.*

కృతు డాయెను10. తరువాత కమాలుఖానుడు బీదరుపై నడచి దానిని స్వాధీనముచేసికొని మహమూదుశాహు నతని మందిరముననే చెఱబెట్టి యతని యధికారము నంతటిని నాచికొని యజ్మత్-ఉల్-ముల్కను నాదిల్షాహుని సామంతు నాతనిపై గాపుంచెను11.

ఆదిల్ ఖానుని విజయవార్తయు, సుల్తానుబంధన వృత్తాంతమును దెలియవచ్చినంతటనె బహమనీరాజ్యమునం దంతటను గొప్ప సంచలనము గలిగినది. ఆదిల్ ఖానుచే బందీకృతుడైనపిదప సుల్తా నతనికి వశవర్తి యగుటతథ్యము; సుల్తానుపేర బహమనీరాజ్యముపై నతడు దనయధికారమును సాగింపగడగుననుట నిస్సంశయము. స్వాతంత్ర్యమును రుచిచూచిన బహమనీ సామంతుల కాదిల్ ఖానుని యుద్యేశము గిట్టలేదు. కావున వారియందు ప్రముఖులగు బరీద్-ఇ-మమాలిక్, మల్లిక్ అహమద్ భైరీ నిజామ్-ఉల్-ముల్కు, కుతుబ్-ఉల్-ముల్కు, దస్తూర్-ఇ-దీనారు మున్నగువార లేకమై బీదరుపై నడచి యా కోటను ముట్టడించిరి. కొంత కాలము ముట్టడి సాగినది. కోటలోనివా రశేషులు మడిసిరి. జనసామాన్యమునకు రానురాను జీవనము దుర్భరము గాజొచ్చినది. కావున అజ్మత్-ఉల్-ముల్కు బరీద్-మమాలికును గలిసికొని సంధి గావించుకొనెను12. అటుతరువాత సంయుక్తబహమనీసామంత సైన్య మాదిల్ ఖానుని రాష్ట్రముపై నడచెను; భీమా పూర్వతటమునందలి కలుబరిగ మున్నగు దుర్గములనేకములను వాని క్రిందిరాష్ట్రములతోగూడ వారు వశపఱచుకొని కడపట ఆదిల్ ఖానుని రాజధానియగు విజాపురమును జయించు నుద్దేశముతో బయలువెడలిరి.

శత్రువులు రాజధానిపై నెత్తివచ్చుచున్నారను వార్త విజాపురరాజ్యమందంతటను సంక్షోభము గలిగించినది. అప్పటి విజాపురరాజ్యస్థితిని పోర్చుగీసు గ్రంథకర్తలు చక్కగా వివరించియున్నారు. అల్బూకెర్కు కామెంటరీసునం దిట్లున్నది: "సబైయో (సవాయీ = సపాద) గతించినపిమ్మట నతని కుమారుడగు హిదల్ ఖానుడు బాల పసివాడగుటచే దక్కను రాజ్యసామంతుల మధ్య గొప్ప కలహ ముప్పతిల్లినది. గోవాపాలకుడగు మల్లిక్ యూఫర్ గూగి, సబైయో మృతినందినతరువాత నెవ్వరిని సరకుసేయలేదు. ఇతని కొలువున వేవురు ఆయుధోపజీవు లుండిరి. దేశములోని ప్రజ లొండొరులతో గలహింపుచు పోట్లాడుచుండిరి. బెల్గాములోని హిందువులు హిదల్ కానుపై దిరుగబడి, పట్టణమునుండి మహమ్మదీయులను వెడలనడచి, కృష్ణదేవరాయలను వచ్చి తమ పురము నాక్రమించుకొనవలయు నని యాహ్వానించిరి 13.

పుర్చాసు 'పిల్గ్రిం' అను గ్రంథమున నిట్లు కలదు: "సబైయసు (సవాయి=సపాద) మరణించినపు డతనికి మిక్కిలి పసివాడు ఇదల్కానను కుమారు డుండెను. అందువలన ప్రజ లతనిపై దిరుగబడిరి. అతని రాజ్యమును హరించుటకొఱకు నరసింగదేశపురాజు దండెత్తి వచ్చెను. అదే సమయమని యెంచి యాల్బూకెర్కు గోవాను ముట్టడించి స్వాధీనముచేసికొనెను; కాని యనంతర మచిరకాలముననే ప్రచండసైన్యముతో నిదల్కాను వచ్చెను. రాత్రికి రాత్రే పోర్చుగీసులు పారిపోయిరి. నరసింగదేశపు రాజు మరల యుద్ధమునకు రాగా ఇదల్కానుడు గోవాపట్టణమున బలిష్ఠమైన తాణ్యమును గాపుంచి బలాధికుడైన శత్రునిపై గవయబోయెను. కాని యాల్బూకెర్కు తాణ్యము నోడించి పట్టణము నాఅగొనెను14."

---

10. *Commentaries of Affonso Dalbuquerque, See, 'Yavanarajya Sthapanacharya' JOR. X, pp 168–171.*

11. *Ibid III Ch VIII P. 36*, ***Burhan-i-Maasir, I.A XXVIII. P. 319.***

12. ***Burhan-i-Maasir, IA. XXVIII. pp 319-20.***

13. ***Commentaries of Affonso Dalbuquerque.II. ch. XVIII. p. 82, ch XIX p. 85; JOR. X. p. 160.***

14. ***Sewell, F.E. p. 125. n. 1.*** "పుర్చాసుగ్రంథము (ఫోలియో) మొదట క్రీ. శ. ౧౬౨౫ వ సంవత్సరమున ప్రకటింపబడెను. అతడు బ్యారాసు (*Dec. I. l. VIII Cap. 10*) ననుసరించుచున్నాడు." బ్యారాసు దన చరిత్రయందలి మొదటి కాండము క్రీ. శ. ౧౫౫౨ వ సంవత్సరమున ప్రకటించెను. అతడు క్రిస్టవాన్ డి ఫిగ్వేరెడో, డామింగో పయస్, ఫెర్నాన్ న్యూనిజ్ మొదలగు కృష్ణరాయల సమకాలికులగు పోర్చుగీసు గ్రంథకర్తల రచనల నాధారపఱచుకొని దన చరిత్రను వ్రాసెను. (*See F.E. p. V. f*) "నరసింగరాజ్యము అనునది విజయనగర సామ్రాజ్యమునకు పోర్చుగీసురచయితలు వన్నెలను తెఱచుగ వాడు నామాంతరము." (*F. E. P. 236 n. 1*).

ఫ్రయ్యరు లూయి క్రీ. శ. ౧౫౧౦ డిసెంబరు మాసమం దాల్బూకెర్కు కు విజయనగరమునుండి వ్రాసిన యుత్తరమున దక్కనురాజ్య రాజకీయస్థితి నిట్లు వివరించియున్నాడు:

"హిదల్ఖాను గొప్ప సైన్యముతో దక్కనురాజ (సుల్తాను) సామంతుడగు మెలిక్ దిన్తారను హబిసీ యాబదొర పాలనక్రింద నుండు కల్బర్గేటు (కలుబరిగ) ను సాధించుటకొఱకు బయలుదేరె ననె తనకు నమ్మకమైన వార్త వచ్చిన దనియు; నా దుర్గము ముట్టడి కొనసాగకపోవుటవలన రెండు మాసములైన తరువాత కొన్ని షరతులపై నతనికి కైవశ మాయె ననియు; హిదల్ఖాను దక్కను రాజు (సుల్తాను) యొక్క సకలాధికారములను నాచికొని యతని జెఱగొని పోవుట వలన నా రాజ్యములోని సామంతులు నలుగురు అతనిని ప్రతిఘటించి యతని నిర్మూలించు నుద్దేశముతో నతనిపై నెత్తిపోయి రనియు; మార్గమున నొక నదికడకు వచ్చి దాని దాటు వెఱ వెఱుగక నచట విడిసి విశ్రాంతి నంది యుండి రనియు" దెలియపఱచెను 15.

పైనుదాహరించిన పోర్చుగీసుగ్రంథకర్తల రచనలవలన యూసుఫ్ఆదిల్ ఖానుని మరణానంతరము విజాపురరాజ్య మెట్లు సంక్షోభమందియుండెనో చక్కగ దెలియవచ్చుచున్నది. యూసుఫ్ఆదిల్ ఖాను డాక్రమించుకొనియుండిన కృష్ణాతుంగభద్రల నడిమి విజయనగరరాష్ట్రమును మరల స్వాధీనపఱచుకొనుట కంతకంటె సరియైన సమయము మరల లభింపదు; కావున కృష్ణదేవరాయలు వెంటనే సైన్యముతో గదలిపోయి రాయచూరుదుర్గమునకు ముట్టడి వైచెను.

విజాపురసంస్థాన మిట్లంతఃకలహములచే గలగుండువడి పరసైన్యసమావృత మాయెను; సంస్థానమే నిలువకపోవు నేమో యను సంశయము గలిగినది. కాని రాజ్యసంరక్షకుడైన కమాలుఖానుడు ధైర్యము విడనాడలేదు. సంస్థానము నెట్లైన నిలుపవలయు నని పట్టుబట్టెను. గోవా మొదలగు దుర్గములకు గాపుండిన సైన్యములను పిలిపించి, బరీద్-ఉల్-ముల్కు మొదలగు బహమనీసామంతుల నోడించి తఱుమగొట్టెను; కాని యతడు కృష్ణరాయల నెందును ఎదిర్చినట్లు కానరాదు. కృష్ణరాయలయెడ కమాలుఖాను జేల తటస్థుడై యుండెనో తెలియదు; కాని, కారణము దురూహ్యము గాదు. కృష్ణరాయలకును పోర్చుగీసుగవర్నరుకును గల స్నేహము నత డెఱుగును. రాయలును పోర్చుగీసులును నేకమైనచో గోవాను మరల జయించుట సులభసాధ్యముగాదు. మఱియు నొకప్రక్క నుత్తరదిక్కున బహమనీసామంతులతో యుద్ధముసేయ నారంభించిన పిమ్మట దక్షిణమున రాయలతో గూడ పోట్లాటపెట్టుకొనిన జయ మొక్కచోటనేనియు గలుగకపోవచ్చును. ఇంతేకాదు కమాలఖానుని హృదయమున రాజద్రోహబీజ మంకురించినది. పసివాడగు తన యజమానుని దొలగద్రోసి సంస్థానమునకు దానే యధిపతి కావలయు నను వాంఛ యతని హృదయమున బాదుకొనినది. తన యుద్యమమును నెఱవేర్చుకొనుట కతడు మొదట బహమనీ సుల్తాను పేర బీదరును పాలించుచుండిన బరీద్-ఇ-మమాలికునకు గలుబరిగ మున్నగు భీమాపూర్వతటదుర్గములను రాష్ట్రమును వశపఱచి సంధి చేసికొనెను. అట్లే కృష్ణరాయలకును కృష్ణకు దక్షిణమున నుండు దుర్గములను సీమలను ఇచ్చివేసి సంధి చేసికొనియుండవచ్చును. మహమ్మదీయ చరిత్రలవలన కమాలుఖాను కృష్ణరాయలతో సంధిగావించుకొని నట్లు తెలియరాకపోయినను, పోర్చుగీసు రచయితలిట్టి సంధి కల దని చెప్పియున్నారు. క్రీ. శ. ౧౫౧౦ వ సంవత్సరమున కృష్ణరాయలు రెండు పర్యాయము లాదిల్ ఖానుమీదికి దండువెడలె నని పుర్చాసు దన 'పిల్గ్రింసు'లో వ్రాసియున్నాడు. మొదటి దండయాత్ర క్రీ. శ. ౧౫౧౦ ఫిబ్రవరిలో నల్బూకెర్కు గోవాను మొదటిసారి బట్టుకొనుటకు పూర్వము నడచెను. రెండవది క్రీ. శ. ౧౫౧౦ మే నెలలో నల్బూకెర్కు నోడించి యాదిల్ ఖానుడు గోవాను స్వాధీనపఱచుకొనినతరువాత జరిగెను. ఈ రెండు దండయాత్రల మధ్యకాలమున విజాపురవిద్యానగరరాజ్యములకు గల పరస్పరసంబంధమును పుర్చాసు వివరించియుండలేదు; కాని కృష్ణరాయల సమకాలికుడగు కాస్టన్హీడా, ఆదిల్ ఖాను కృష్ణరాయలతో సంధిచేసికొనె నని వ్రాసియున్నాడు; మఱియు క్రీ. శ. ౧౫౫౨ సం. మున ప్రకటితమైన మొదటి డికాడాయందు, అల్బూకెర్కు మొదటిపర్యాయము గోవాను జయించి స్వాధీనపఱచుకొనినవెంటనే గాస్పరుచనోకా యనువానిని విజయనగరమునకు రాయబార మంపె ననియు, నతనికి రాయలు దర్శన మిచ్చి విశేషముగ గౌరవించినను అల్బూకెర్కు వేడికోలు నంగీకరింపక యుచితవాక్య

15. *Commentaries of Affonso Dalbuquerque, III. Ch. VIII. p. 63.*

ముల నంటియున్నటనియట్లు జవాబు జెప్పె ననియు, దానికి గారణ మాదిల్ ఖాను రాయలతో జేసికొనిన యొడంబడికయే యనియు నివేదించె నని బ్యారాసు వ్రాసియున్నాడు 16. గోవాను పోర్చుగీసులకడనుంచి జయించుట కవకాశము గల్గించుట కొఱకె కృష్ణరాయ లాదిల్ ఖానునితో నీ సంధి కొడబడియుండు నని నూరెు లభిప్రాయపడుచున్నాడు 17.

ఆదిల్ ఖానునితో నిట్లు సంధి చేసికొన్నను, అత్యల్పకాలముననే కృష్ణరాయ లతనిపై మరల నేల దండు వెడలెనో కనుగొనవలసియున్నది. కమాలు ఖానుడు బరీద్-ఇ-మమాలికుతో సంధిచేసికొనిన పిమ్మట షోలాపురముపై నెత్తిపోయి యా పట్టణమును మూడు నెలలకాలము ముట్టడించి కైవసము గావించుకొనెను. తరువాత విజాపురమునకు దిరిగివచ్చి యచట దన ప్రభువైన ఇస్మాయిలుఆదిల్ ఖానుని వాతని తల్లియగు బూబూజీఖానమును దుర్గమునందు చెఱబెట్టెను. ఆసమయమునందే కమాలుఖానుని మిత్రుడగు బరీద్-ఇ-మమాలీకు దన యజమానుడగు నిమ్మడి మహమూదుశాహును గుల్బర్గదుర్గమున చెఱయందుంచి రాజ్యము నాక్రమించుకొనెను.

తా నొకటి తలచిన దైవ మొకటి తలచు నను సామెత కమాలుఖానునియెడ సార్థక మైనది. సింహాసనము నధిష్ఠించుటకు వలసిన ప్రయత్నములు సల్పుచుండ నకాలమృత్యు వాతని వాత వేసికొనెను. చెఱయందు బందీకృతురాలై యుండినను బూబూజీఖానము ద్రోహమున కొడిగట్టిన కమాలుఖానుని దుదముట్టించు మార్గమును వెదకుచుండినది. చిట్టచివరకు స్వామిభక్తిపరాయణులైన యనుచరులను బురికొల్పి యతని జంపించెను. కమాలుఖానుని హత్యమూలమున ఇస్మాయీ లాదిల్ ఖానుడు కారాగారవిముక్తుడై మరల రాజ్యాధిపత్యమును బొందెను; కాని రాష్ట్రమున శాంతి మాత్రము కుదరలేదు. ఆదిల్ ఖానుదర్బారు నాశ్రయించియుండిన అమీరులందఱును రెండుకక్షలుగ జీలిరి. కమాలుఖానుడు జాతిచే పారసీకుడు. పారసీఖురాసానియమీరుల కతడు నాయకుడు. తన నాయకుని హత్య చేయించినందుకు గినిసి పారసీఖురాసాని యమీరు లేకమై తురకరూమీదొరలతో బోరాడ దొడగిరి. ఇట్లుండ రాయచూరు ముదుగల్లు మొదలగు దుర్గములను కృష్ణాతుంగభద్రల నడిమిరాష్ట్రముతో గూడ జయించి స్వాధీనము జేసికొని ప్రచండసైన్యమును వెంటగొని కృష్ణదేవరాయలు కలుబరిగదుర్గముపై గూచిచేసెను18.

కృష్ణరాయల కలుబరిగదండయాత్రప్రస్తావము మహమ్మదీయచరిత్రలయందు జెప్పుటను గానరాదు. ఇంతే కాదు; ఫెరిస్తా యప్పటి కలుబరిగవృత్తాంతము నిట్లు వర్ణించియున్నాడు. "ఇస్మాయిల్ ఆదిల్ ఖానుడు బంధవిముక్తుడాయె నను వార్త చెవి సోకినంతనే, అమీర్ బరీదు (బరీద్-ఇ-మమాలికు) గుల్బర్గను త్యజించి బీదరునకు వెడలిపోయెను19." కాని ఫెరిస్తా మాట విశ్వాసపాత్రము గాదు. ఆదిల్ ఖానుడు చెఱనుండి విముక్తుడాయె నను వార్తను వినగనే అమీరు బరీదు కలుబరిగను విడిచి పాఱిపోవలసిన యావశ్యకత యెద్దియుగానరాదు. చెఱనుండి విముక్తుడాయెనే కాని, శత్రులకు భయము గలిగించు శక్తి యతని కెక్కడిది? నిజరాజ్య మంతఃకలహములతో సంక్షోభించుచుండినది; దన యధికార మింకను నెల్లయెడల సాగుట లేదు. అశక్తుడైన రాజు నెవ్వరు సరకుసేయుదురు? అంతశ్శత్రుల నణచి వారిని దన యధికారమునకు బద్ధులను గావింపజాలనివాడు పరుల నెట్లు భయపెట్టగలడు? ఇంట గెలిచి కదా రచ్చ గెలువవలయును. కావున బరీదుపలాయనము వాస్తవమైనచో దాని కన్యకారణ ముండియుండవలయును.

---

16. *Sewell F.E. p. 124.*

17. ,, ,, ,,

18. రాయచూరిదుర్గపతనమునుగూర్చి ఫెరిస్తా ఇట్లు వ్రాసియున్నాడు: "కాని, తిమ్మరాజు సమయమనుకూలమై యుండుటను గని రాజు (ఆదిల్ఖాను) గారి రాష్ట్రముపై నెత్తివచ్చి, రాయచూరుముట్టడి నింకను (ఆదిల్ ఖానుడు చెఱనుండి విడుదల నైనపిమ్మటగూడ) సాగింపుచుండెను; తుద కది యతనికి లోబడెను. రాజ్యముపై దన యధికారమును మరల నెలకొలుపు ప్రయత్నములలో నిమగ్నుడై యుండినందున ఇస్మాయిలు ఆదిల్ ఖానుడు ఆకాలమున ముట్టడిని తొలగించుటకు దగిన బలముల నంపజాలక పోయెను." *(Briggs' Ferishta III. pp. 44-45.)*

ఫెరిస్తా కప్పటి విజయనగరరాయల పేరు తెలియదు. కావున నతడు 'తిమ్మరాజు'ను గల్పించినాడు. రాయచూరు క్రీ. శ. ౧౫౧౧ ఏప్రిలు ౨౫ తేదికిని క్రీ. శ. ౧౫౧౪ నకును మధ్య నడచె నని చెప్పియున్నాడు.

19. *Briggs' Ferishta II. p. 44.*

## ౪. నిజాము

కృష్ణరాయ లీ సమయమున గలుబరిగపై దండెత్తి నట్లు ఆంధ్రగ్రంథములవలన దెలియవచ్చుచున్నది. క్రీ. శ. ౧౬౦౪-౫ వ సంవత్సరమున ఇమ్మడి వెంకట పతిదేవమహారాయలు వ్రాయించిన విజయనగర సామ్రాజ్య మను నక్షత్రపత్రమున కృష్ణరాయల కలు బరిగదండయాత్ర సంగ్రహముగ నిట్లు వర్ణింపబడి యున్నది:

"ప్రజోత్పత్తి సంవత్సరం తయిమాసం కుతప్ప శాహనిజాంశాహమీదికి కూచిచేసి దెలిగుడారం వేసి తరలిపోయిరి. మూడురేండ్లు దండుకేసి మూడు సంస్థానాలమీద కార్యంచేసి కలుబరిగవద్ద విజయ స్తంభం వేయించి మూడుసంస్థానాలవారివద్ద పగుడీ తీసుకొని ముగ్గు...తో (?) పిలిపించుకొని విజయనగరపట్టణం ప్రవేశించివుండి..."20

నడిమిదొడ్డిపాళెపు కైఫీయతునందు కలుబరిగ ముట్టడి విపులముగ వర్ణింపబడియున్నది:

"కొన్ని దినములకు కల్యాణంకలుబరిగలమీదికి యుద్ధసన్నద్ధులై సమస్తమైన జహగీరుదార్లను పిలు పించగా కడపకొలనుగ్రామంలో ముసిలిచన్నమనాయడు తన జమీయతుతో కూడా విజయనగరానకు కృష్ణ రాయలవారి సముఖానకు పోయిన తదనంతరం రాయల వారు సైన్యముతో కూడా ప్రయాణమై కలుబరిగ మీదికి వెళ్లగా సమస్తమైన నిజాములు ఆ కలుబరిగదగ్గ రికి భారీఫౌజులు స్తోమంగా కూడివున్నందున, రాయల వారు సమస్తమైనవారిని పిలిపించి, 'యీయుద్ధమందు వెనుకకు తిరుగక లడాయిచేసి శత్రుపలాయనం చేస్తే మీకు సకలబహుమానాలు యిప్పిస్తున్నార'మని అని వీరకంకణాలు తాంబూలాలు యిచ్చినంతలోగా, లడా యికి షురువు అయి యుద్ధముసేయగా అప్పుడు బహు మంది సర్దారులు మెసామసిలిచన్నమనాయడు సొన్నలాపురంహం డేవారు యింకా పాళెలవారు యేక స్థులై యుద్ధానకు నడచినంతలో అగాధయుద్ధప్రసరిణి అయి కృష్ణరాయలవారిఫౌజు విరిగినందున రాయలవారు చెరొయ్యత్తి ఘల్లున కూసి, 'యీసమయమందు యెవ్వరు యెదురెక్కి శత్రుపలాయనం చేస్తున్నారో వారికి సకలబహుమానాలు బిరుదులు యిప్పిస్తున్నా'మని చెప్పి నందున ముసిలి చన్నమనాయడు యింకా కొంత మంది సర్దార్లతో కూడా తురుష్కలవారి లష్కరు మీదికి యెదురెక్కి తరుముకొని వస్తావుండిన నిజామాది ఫౌజులమీదికి దూరి చిత్తాస్వాతి సంధించినట్టుగా యుద్ధముచేసి మొదటికొప్పు విరుగగొట్టినందున యావ త్ఫౌజు యేకరాశిన దూరగా నిజాములఫౌజు విరిగి నానా హతమై పోయినందున కలుబరిగలో వరాహధ్వజ మెత్తించి జయభేరి వేయించి..."21.

ఈ దండయాత్ర నడచిన దెప్పుడో కనుగొన వలసియున్నది. కృష్ణదేవరాయలు క్రీ. శ. ౧౫౨౦ సం. న ఆదిల్ ఖాను నోడించి రాయచూరుదుర్గమును జయిం చిన పిమ్మట నొకసారి కలుబరిగపై దాడిపెట్టి యాదిల్ ఖానుని మరల పరాజితుని గావించి కలుబరిగను లగ్గలు పట్టెనని న్యూనిజు వ్రాసియున్నాడు. కాని పైనవర్ణింప బడిన దండయాత్ర యది కాదు; దానికంటె భిన్న మైనది. ఇట్లు చెప్పుటకు రెండు కారణములు గలవు: (౧) నడిమిదొడ్డిపాళెము కయిఫీయతు ప్రకారము కలు బరిగను స్వాధీనపఱచుకొనుటకొఱకు కృష్ణరాయలు పోట్లాడినది యాదిల్ ఖానునితో గాదు, నిజామాది ఫౌజులతో. హిందల్కాను బహమనీసుల్తాను నోడించి చెఱబట్టినందులకు గోపించి నలుగురు ముఖ్యబహమనీ సామంతు లేకమై యతనిపై నెత్తివచ్చి కలుబరిగ మున్నగు దుర్గములను జయించి రని సమకాలికపార్సి గీసురచయితలు జెప్పియున్నారు కదా. ఇ ట్లేకమైన నలుగురు బహమనీసామంతుల పేర్లు మల్లిక్ బరీద్-ఇ-మమా లిక్, మల్లిక్ కుతుబ్-ఉల్-ముల్క్, మల్లిక్ దస్తూర్-ఇ మమాలిక్ మల్లిక్ దీనారు, మల్లిక్ అహమద్ భైరీ నిజామ్-ఉల్ ముల్క్ లని మహమ్మదీయచరిత్రకారులు జెప్పు చున్నారు 22. వీరికి నాయకుడు మల్లిక్ అహమద్ భైరీ నిజామ్-ఉల్-ముల్క్. సమకాలికాంధ్రప్రబంధ కర్తలు తనిని 'నిజా'మనియు, 'నిజాము' డనియు పేర్కొని యున్నారు. మఱియు నప్పుడు నిజామ్-ఉల్-ముల్క్ కుతుబ్-ఉల్-ముల్క్లు బరీద్-ఉల్-ముల్క్ పక్షము వహించి యతనికి శత్రులతో బోరాడుటకు దోడ్పడు చుండువారు. కృష్ణరాయలు కలుబరిగపై నెత్తి వచ్చు నను శంకబరీదునకు గలుగకపోయినను, కారాగారవిముక్తుడైనపిమ్మట సాధ్యమైనంత త్వరలో నిస్సామియాలు ఆదిల్ ఖాను డా కోటను స్వాధీనపఱచుకొనుటకు దండెత్తి రాగల

20. భారతి సం. ౬. భాగ ౨. పుట ౬౯౧.

21. *Local Records. Vol.* 39. *p.* 11. *f.*

22. *Burhan -i- Maasir, I.A.* XX VIII *pp.* 319-20.

డని యూత డెలుసును. కావున కోటను ఆదిల్ ఖానునికి హస్తగతముగానీయక సంరక్షించుటకై తన మిత్రులగు నిజామ్-ఉల్-ముల్కు కుతుబ్-ఉల్-ముల్కులకు వర్తమాన మంపి వారికడనుండి దళములను రప్పించుకొని యుండును. ఆదిల్ ఖానుకంటె ముందే కృష్ణరాయలు కలుబరిగమీద కెత్తిపోవుటచే దాని సంరక్షణార్థము వచ్చియుండిన నిజామాదిఖానులతో రాయలు యుద్ధము సేయుటయందు వింత లేదు. ఈ విషయములను జక్కగ బరికించి చూడగా పైవర్ణింపబడిన కలుబరిగదండయాత్ర న్యూనిజు చెప్పినదానికంటె భిన్నమైనదని నిశ్చయమగుచున్నది. (౨) రాజ్యారంభకాలమున రాయ లొకసారి కలుబరిగపై దండయాత్ర సలిపినట్లు 'విజయనగరసామ్రాజ్యము' వలన దెలియవచ్చుచున్నది. కృష్ణదేవరాయలు ప్రజోత్పత్తి తయిమాసం ౧౨ వ తేది, అనగా క్రీ. శ. ౧౫౧౨ జనవరి ౯ వ తేది నాడు దండయాత్ర ప్రారంభముచేసి మూడేండ్లు దండుచేసి కలుబరిగకడ జయస్తంభము వేయించి తిరిగి విజయనగరమునకు వచ్చి, యచటనుండి శ్రీముఖసంవత్సరం చిత్రిమాసము శ్రీరామదశమి, అనగా క్రీ. శ. ౧౫౧౩ వ సంవత్సరం మార్చి నెల ౧౬ వ తేది నాడు గజపతివారిమీద దండుదెత్తి తరలిపోయినట్లు చెప్పియున్నది. కాని, క్రీ. శ. ౧౫౧౨ జనవరి ౯-వ తేదికిని క్రీ. శ. ౧౫౧౩ మార్చి ౧౬-వ తేదికిని మధ్యగల రొడము ఒక సంవత్సరముపై మూడు నెలలు ఆఱుదినములుమాత్రమే. కావున నీ దండయాత్ర కాలము మూడేండ్లనుట తప్పు. దండయాత్ర నడచిన కాలవ్యవధి తప్పైనను ప్రారంభకాలమైనను సరియగునేమో కనుగొనవలసియున్నది. కృష్ణరాయలు దన రాజ్యాభిషేకమైనవెంటనే విజాపురముపై రెండు మారులు దండయాత్రవెడలె ననియు, నందొకటి క్రీ. శ. ౧౫౧౦ ఫిబ్రవరి ౨౦ వ తేదిన యాల్బాకెర్కుగోవాకు వచ్చినపుడును మఱియొకటి కమాలుఖానుని మరణానంతరమును నడచె ననియు నింతకుముందు చెప్పియున్నాడను. క్రీ. శ. ౧౫౧౧ మే నెలలో గమాలు ఖానుడు వధింపబడె నని ఫెరిస్తా వ్రాసియున్నాడు. కమాలుని వధ ఫెరిస్తా చెప్పినట్లు వాస్తవముగ క్రీ. శ. ౧౫౧౧ మే నెలయందే జరిగియుండినపక్షమున, 'విజయనగరసామ్రాజ్యము'న జేర్కొనబడిన కలుబరిగ దండయాత్ర క్రీ. శ. ౧౫౧౨ జనవరి ౯ వ తేది నాడు ప్రారంభమైయుండవచ్చును. ఇం దసంగతి యెద్దియు లేదు.

నడిమిదొడ్డిపాళెపు కైఫియతందును, 'విజయనగరసామ్రాజ్యము' నందును వర్ణింపబడియుండు కలుబరిగదండయాత్ర యొక్కటియే. లభించిన సాక్ష్యమును బరికించి చూడగా కృష్ణరాయలు కలుబరిగమీద రెండు పర్యాయములుమాత్రమే దండయాత్ర వెడలె నని తెలియవచ్చుచున్నది. న్యూనిజు జెప్పిన దండయాత్ర నడిమిదొడ్డిపాళెపు కైఫీయతులోని దండయాత్రకంటె భిన్నమైన దని పైన నిరూపింపబడియున్నది. నడిమిదొడ్డిపాళెపు కైఫీయతునందు కలుబరిగె కోటపై వరాహధ్వజమెత్తకముందు రాయలు నిజామాదిఖానుల నోడించినట్లు వ్రాసియున్నది; 'విజయనగరసామ్రాజ్యము'నందు కుతుబ్షాహనిజాంషాహులపై గూచిచేసిపోయి మూడు యేండ్లపర్యంతము దండుచేసి మూడుసంస్థానాలమీద కార్యంజేసి కలుబరిగదగ్గర విజయస్తంభం వేయించినట్లు చెప్పియున్నది. ఈరెండు గ్రంథములలో వర్ణింపబడిన దండయాత్రలయందు నిజాము కృష్ణరాయలకు బ్రతిపక్షిగ గానవచ్చుచున్నాడు. నిజాముతో కృష్ణరాయలు మఱి యెచ్చటను నెక్కడను యుద్ధముచేసె నని తలచుట కాధారము లేదు; కావున నడిమిదొడ్డిపాళెపు కైఫీయతందును, విజయనగరసామ్రాజ్యమునందును వర్ణింపబడియుండు కలుబరిగదండయాత్ర యొక్కటియే యని తలచుట యుక్తము.

కలుబరిగ యుద్ధమెట్లు నడచెనో నడిమిదొడ్డిపాళెపు కైఫీయతందు చక్కగ వర్ణింపబడియున్నది. మొదట రాయరాణువ శత్రువుల తాకునకు దాళజాలక విఱిగి వెన్నిచ్చెను. తురకలు విఱిగి పాఱు విజయనగరదళములను వెన్నంటి తఱుమ నారంభించిరి. అపజయము సిద్ధమని యందఱకు దట్టినది. కాని రాయలు ధైర్యమును విడనాడలేదు. పఱుగిడుచుండిన సైన్యమునడుమ నచలుడై నిలిచి చేయెత్తి ప్రళయకాలరుద్రునివలె గర్జించెను. నాయకులను పాళెగాండ్రను దొరలను బిలిచి సకలవిధములైన బహుమానముల నిచ్చెద నని యాస చూపి యుద్ధమునకు బురికొల్పెను. రామనామమును విన్న పిశాచమువలె వారి హృదయమున దాగుకొనియుండిన భయము మాయమైనది. రాయరాణువ మరల శత్రుముఖమైనది. మొసావారికి హంబేవారికి ఇతరపాళెములవారికి వీరావేశము పెరిగినది. జయము చేకూడెగదా యని తలచి వ్యూహమును విసర్జించి చిల్లాపల్లుగ దఱుముకొనివచ్చుచుండిన తురకదండున కడ్డపడి నఱుక నారంభించిరి. తలవని

తలంపుగ పిడుగులవలె పైనరికిన హిందూవీరుల ధాటికి బెదరి పాఱు తెంచుచుండిన తురకదళ మాగజాలక వెన్ను జూపెను. అంతట రాయసైన్యమంతయు నొక్కుమ్మడి వారిపై నురువడించి వారిని ఖండతుండెములుగ నఱుక సాగెను. తురకసేనయందు చాల భాగము మడిసినది. హతశేషులు కొందఱు పట్టువడిరి. తక్కినవా రడపొడ గానరానీక పరారి రైరి. సమకాలికకవి యొకడు రాయలచే నిర్జితులైన మహమ్మదీయుల స్థితి నిట్లు వర్ణించియున్నాడు:

"చెడిపిరాలొత్తిన యడుగుదమ్ములకును
గట్టుపయ్యెద జించి కట్టుకొనుచు
బయలైన కుచకుంభపాళులకును జంటి
శిశువుల మాటుగా జేర్చుకొనుచు
గసుగందలకు వడగాలికి జాటుగా
గచభరంబుల విప్పి కప్పుకొనుచు
వీడిన తురుము నీవియదాక సడలించి
చేలాంతము ముసుంగు జేర్చుకొనుచు
ఖానమల్కు వజీరుల మానవతులు
పాటుపరువున నీవు కల్బరిగ గొనిన
బ్రమసి నలుగడ జెడ చెడి పఱతు రౌర
ఆహవోపేంద్ర! కృష్ణరాయక్షితీంద్ర! 23."

## ౫. బరీదు

కలుబరిగదండయాత్ర జయప్రదముగ ముగిసినది. కాని కృష్ణరాయలు యుద్ధము చాలించుకొని నిజరాజధానికి మరలిపోలేదు. బహమనీసుల్తానుల రాజధానియగు బెడదకోట (బీదరు)వైపు సైన్యములతో గూచిచేసెను. దీనికి వాస్తవమైన కారణము తెలియదు. బరీదుచే బంధితుడై కారాగారమున నుండిన ఇమ్మడి మహమూదుషాహను చెఱనుండి విడిపించి సింహాసనముపై నతని పునఃప్రతిష్ఠ సేయుట రాయల ముఖ్యోద్దేశ మని తోచుచున్నది. బెడందకోటదండయాత్రను సమకాలికకవులు పేర్కొనియున్నారు. ఒక యజ్ఞాతకవి—

"గవకుల్ బల్లిదమయ్యె ఢిల్లికిని మ
క్కాకోట మేలయ్యె మం
డుగకుల్ గొత్తగ ద్రొత్తడంబు లమరెన్
బోలేరు చందేరులన్
దవసంపెక్కె బెడందకోటపు రకాం
తా గర్భనిర్భేదన
ప్రవణంబైన భవత్ప్రయాణజయవా
ర్తన్ కృష్ణరాయాధిపా."

అని బెడందకోటదండయాత్రను బ్రకటించియున్నాడు. రాయరాణువ బెడదకోటను జేరెను; బరీదుదళముల గూర్చుకొని వచ్చి మాఱొడ్డి నిలచెను. భీకరసంగ్రామము సాగినది. మహమ్మదీయబలము లోడి పాఱిపోయెను. కృష్ణరాయల బెడందకోటవిజయము నల్లసాని పెద్దనగా రిట్లు ప్రశంసించియున్నారు:

"సమరక్షోణిని కృష్ణరాయలభుజా
శాతాసిచే బడ్డ దు
ర్దమదోర్దండ బెడందకోటయవన
వ్రాతంబు సప్తాశ్వమా
ర్గమునం గాంచి 'శహాసహో!
హరిహరం గాఖూబుఖోడాకి తే
తుముకీ బాయిలబాయిదే ములకియం
దు రిమ్మంటికిన్ బోవుచున్."

ఈవిజయము సంపూర్ణమైనది. బెడందకోట హస్తగతమాయెను. క్రీ. శ. ౧౫౧౨ నాటి యొక తామ్రశాసనమున కృష్ణరాయలకు 'బెడదకోటసప్తాంగహరణ' యనుబిరు దుండినట్లు చెప్పియున్నది[24]. స్వామ్యమాత్యసుహృత్కోశ రాష్ట్రదుర్గబలము లేడును రాజ్య సప్తాంగము లనబడును. బెడదకోటసప్తాంగహరణు డనగా బెడదకోటసంస్థానమును సంపూర్ణముగ జయించిన వాడని యర్థము.

ఇచట స్మరింపవలసిన విషయ మొకటి కలదు. కృష్ణదేవరాయలకు 'యవనరాజ్యసంస్థాపనాచార్య' యను బిరుదు కలదు. విజయనగరరాయలయందు మఱి యెవ్వరికిని ఈ బిరుదు లేదు. రాయల కీబిరు దెట్లు కలిగెనో స్పష్టముగ దెలియబఱచు సాక్ష్య మెద్దియు నింతవఱకు దొరకలేదు. కాని, న్యూనిజ్ చరిత్రయందు కృష్ణరాయలు కలుబరిగ గొన్నపుడు, దక్కనుసుల్తాను పుత్రులను మువ్వురిని యాదిల్ ఖానుచే బంధీకృతులైన వారిని చెఱనుండి విడిపించి, వారియందు జ్యేష్ఠుని యతని తండ్రిసింహాసనము నెక్కించి, తక్కిన ఇద్దరిని తనతోగూడ విజయనగరమునకు గొనిపోయె నని

---

23. *Further Sources*, I no. 114. (b).
24. A. 9 of 1912-13.

యున్నది[25]. దీని నాధారపఱచుకొని పరిశోధకులు కొందఱు కృష్ణరాయలకు 'యవనరాజ్యస్థాపనాచార్య' యను బిరుదు బహమనీసుల్తానుకుమారుని సింహాసనము నెక్కించుటవలన గలిగె నని యూహించుచున్నారు. ఇది సంగతము గాదు ; ఏలనగా, న్యూనిజుప్రకారము రాయలు కలుబరిగను సాధించినది క్రీ. శ. ౧౫౨౦ వ సంవత్సరమున, ఇస్మాయీలు ఆదిల్‌ఖాను నోడించి రాయచూరును స్వాధీనము జేసికొనినపిమ్మట. కావున కలుబరిగవిజయమును, బహమనీసుల్తానుపుత్రుని గద్దె యెక్కించుటయు క్రీ. శ. ౧౫౨౦ వ సంవత్సరమునకు పిమ్మట నడచియుండవలయును. కాని రాయల కీబిరుదు రాయచూరిదండయాత్రకు జాల పూర్వమునుండియు గల దని శాసనసాక్ష్యమువలన రుజువగుచున్నది. ఈక్రింది శాసనము లీ సందర్భమున జ్ఞప్తియం దుంచుకొనదగినవి :

కొనలేదు. అతని తల్లి బూబూజీఖానము దన యనుచరులచే కమాలుఖానుని జంపించి క్రీ. శ. ౧౫౧౧ మే నెలలో దనకుమారుని చెఱనుండి విడిపించెను. రెండవ వాడు బహమనీసుల్తాను ఇమ్మడి మహమూదుశాహు. క్రీ. శ. ౧౫౧౧ లో గమాలుఖానునితో సఖ్యము నుదుర్చుకొని యాతనికి బ్రతిగ జెడదకోట (బీదరు)రాజ్యమును బాలించుచుండిన బరీద్-ఇ-మమాలికాతని జెఱబెట్టి సింహాసనము నాక్రమించుకొని తానె ప్రభువై స్వతంత్రముగ బ్రజాపాలనము జేయ గడగెను. అతనికి నిజామ్-ఉల్-ముల్కు కుతుబ్-ఉల్-ముల్కు మొదలగు బహమనీసామంతులు తోడగుటవలన యతడే స్థిరముగ బీదరురాజ్యమున కధిపతి యగు నను నభిప్రాయ మతనికి గలిగెను. కృష్ణరాయలు క్రీ. శ. ౧౫౧౨ వ సంవత్సరమున ఆదిల్‌ఖానుని జయించి

| | | |
|---|---|---|
| *NDI. Kr.* 27 | 1st *September* 1514 | *Yavanarajyasthapanacharya* |
| *ARE* 272 *of* 1897 | 8*th July* 1515 | ,, |
| *ARE* 243 *of* 1899 | 29*th March* 1516 | ,, |
| *ARE* 381 *of* 1907 | 1517 | ,, |
| *ARE* 244 *of* 1899 | 8*th August* 1519 | ,, |

దీనివలన కృష్ణరాయలకు 'యవనరాజ్యస్థాపనాచార్య' యను బిరుదు కనీసము క్రీ. శ. ౧౫౧౪ వ సం. నుండి యుండె నని తెల్లమగుచున్నది. ఇది 'అష్టదిగ్రాయమనోభయంకర' 'మూరురాయరగండ' యను బిరుదుల వలె పరంపరగ వచ్చినది కాదు. రాయల పూర్వికులకు గాని, యతనిముందు నృసింహాసనము నధిష్ఠించిన విద్యానగరసార్వభౌములకుగాని లేదు ; కావున క్రీ. శ. ౧౫౦౯ వ సంవత్సరమున రాయలు విద్యానగరసింహాసనము నెక్కినతరువాతను, ౧౫౧౪ వ సంవత్సరమున కందుకూరు శాసనమును జెక్కించుటకు ముందును యవనరాజు నెవ్వరినో రాజ్యమున ప్రతిష్ఠించుటవలన గలిగియుండవలయును. ఈ మధ్యకాలమున స్థానభ్రష్టులయి నిజరాజ్యపీఠము నధిష్ఠించుట కన్యుల సహాయము గావలసిన యవనరాజు లిద్ద రుండిరి. ఒకడు ఇస్మాయీలు ఆదిల్‌ఖానుడు. రాజ్యసంరక్షకుడైన కమాలుఖానునిచే బందీకృతు డాయె నని పూర్వప్రకరణమున జెప్పియున్నది. కాని ఇస్మాయిల్ ఆదిల్‌ఖానుడు రాయసహాయమువలన దన రాజ్యమును మరల సంపాదించు

రాయచూరు దుర్గమును సాధించినపిమ్మట బరీదు స్వాధీనమందుండిన కలుబరిగె బీదరుదుర్గములను గైవసము జేసికొనియుండుటవలనను క్రీ. శ. ౧౫౧౪ వ సంవత్సరము నుండి 'యవనరాజ్యస్థాపనాచార్య'యను బిరు దతని కుంకుటవల్లను, బీదరును జయించినప్పు డిమ్మడి మహమూదుశాహును చెఱనుండి విడిపించి సింహాసనము నెక్కించుటవలననే యీ బిరు దాతనికి గలిగె నని మన మూహింపవచ్చును.

బహమనీసుల్తాను విజయనగరరాయలకు ప్రకృతిచే నమిత్రుడు. అతని నాశనము విజయనగర సామ్రాజ్యమునకు శ్రేయస్కరము. విజయనగరబహమనీసంస్థానముల పరస్పరసంబంధ మిట్లుండ, ఖిలమై పోవుచుండిన బహమనీసంస్థానమును బునరుద్ధరించుటకు గృష్ణరాయ లేల పూనుకొనెనో తెలియదు. రాయలు కేవలయోధుడును, దళనాయకుడునుమాత్రము గాదు. రాజ్యతంత్రమును నడపుటయం దాతని ప్రజ్ఞ యఖండమైనది. కావున యవనరాజ్యస్థాపన జేయుటకెద్దియో ప్రబలకారణ ముండియుండవలయును. స్థానభ్రష్టుడైన సుల్తానును మరల గద్దె నెక్కించిన నతనివలన

25. *FE. P.* 358.

భావికాలమున బహామనీసామంతులతో దనకు గలుగ బోవు యుద్ధములందు లాభము గలుగవచ్చు నని యెంచి యట్లు చేసియుండవచ్చును.

ఈ దండయాత్రల మూలమున విజయనగర సామ్రాజ్యపు కీర్తిప్రతిష్ఠలు వాసికెక్కినవి. యుద్ధము నడపుటయందు కృష్ణరాయ లద్వితీయశక్తిసామర్థ్యములు గల సేనాధిపతి యని యందఱకును విదితమాయెను. సింహాసనము నెక్కిన మూడేండ్లలోపల బహామనీసుల్తాను నోడించెను; యూసపుఆదిల్ ఖానుని వధించెను; ఇస్మాయిల్ ఆదిల్ ఖానుని జయించి రాయచూరు ముదుగల్లు దుర్గములను కృష్ణాతుంగభద్రల మధ్య సీమలను స్వాధీనపఱచుకొనెను; కలుబరిగమీద దండువెట్టి నిజామాదిబహామనీసామంతుల నిర్జించి వరాహధ్వజము నా కోటయులంగములపై స్థాపించెను. బరీదును పరాజితుని గావించి యతని సప్తాంగములను హరించి, యతనిచే బందీకృతుడైన యిమ్మడి మహమూదుశాహుబహామనీని చెఱనుండి విముక్తుని జేసి మరల సింహాసనాధిష్ఠితుని జేసి 'యవనరాజ్యస్థాపనాచార్య' డను బిరుదును వహించెను. ఇంతటి యల్పకాలమున నింతలేసి ఘనకార్యముల నొనర్చిన మహారాయల శక్తిసామర్థ్యములను గాంచి విద్యానగరసామ్రాజ్యప్రజ లబ్బురపడుటయందు వింత యేమి కలదు?

(సశేషము)





# డెస్టిట్యూట్

'ఆరుద్ర'

అసమర్థుడి పరిపాలనలాగ అంధకారం ఆవరించింది నగరాన్ని. అంతదాకా మూసిన కనులు అర్ధరాత్రాన విప్పుతుంది నగరం. అంతదాకా చెప్పని కథల్ని హీన స్వరాన చెపుతుంది నగరం. నగరంకుడి కంట్లో పుసి, మలికంట్లో కసి. నగరం తొలి కథలో ఆకలి, మలికథలో చీకటి.

ఇది ఆవేదనాశిశిరం
మానవు డింకా పసరం.

ఈ ఆవేదనాశిశిరంలో ప్రతిమేధస్సూ ఒక మ్రోడు, పచ్చచచ్చినట్టి బీడు, మూలుగుతున్న వల్లకాడు, గూడు అల్లుకొనే సాలీడు. ఈ ఆవేదనాశిశిరంలో ప్రతిచైతన్యతరువూ ఇంగితజ్ఞానపత్రాలని రాల్చివేసింది. అదృశ్య హాలాలతో అవ్యక్తాలని దున్ని అనుమానాలను జల్లి అనవసర ఖేదాలను పండించుకొంటున్నారు అందరూ.

ఇది కఠిననరకం
ఇది ప్రత్యక్షనరకం

బోను తెరిస్తే నోరు తెరిచే పెద్దపులి నగరయామిని. బోలెడన్ని కథలకి చాచిన తన దీర్ఘహస్తాలతో స్వాగతవచనాలను చదువుతుంది నగరం. జీవితపు వరదల బురదల మడుగుల అడుగున అతితొందరగా చిందరవందరగా తిరిగే జీవులు అంతదాకా అక్కడా అక్కడా తిరిగి అప్పుడు చేరుకొంటారు విశాలమైన పావంచాలమీదికి.

నగరంలో యామిని
నరకంలో ఆమని

ఇత డొక యువకుడు. కళాశాలనుండి నిష్క్రమించి నగరంలో ప్రవేశించేడు. నల్లనివన్నీ కన్నీళ్ళు, తెల్లనివన్నీ పాపాలు. పేవ్‌మెంటుమీద పడుకొనడానికి పెద్దదైన సంస్కారం చేతపట్టుకొని కూర్చున్నాడు.

దావానలతులోజ్జ్వల
భావానలకీలలోన పడుతూఉంటూ
భావాలకు బానిసనై
కావాలని గాలిమేడ కడుతూఉంటూ—

ఘోరాటవి ఈ నగరం
పోరాడే శక్తిలేదు పోలేను ఎటూ
లే రెవరూ నా అంటూ
కోరను ఉండాలని పసి (కూనలుమినహా)

వేస్తున్న పథకానికీ చేస్తున్న పాతకానికీ అర్థం తెలుసుకొన్నవాడు.

ఇక్కడ దొరకని దేదో
చక్కదనం అభిలషించి

ఎక్కడికో పోదామని
రెక్క విప్పు చైతన్యం
కనుపించని చక్కదనం
నను పిలిచిన మరుక్షణం
తనువంతా పులకరించి
పెనుతాపం పుటకరించు

కడుసన్నని గాజుతెరల
నడియాడును శైతల్యం
కడలిలాగ కనబడినా
నడిలేనిది వైఫల్యం
కనుకొలకులనుండి కరగి
నునువెచ్చని నైరాశ్యం

పనికిమాలి సుడులు తిరిగి
కనుల మరల గడ్డకట్టు
మొండిచెట్లు లోలోపల
గుండెలోన గునపమగును
పండదు ఏనాటికైన
ఎండమావి నాకోరిక

కదలలేని బండరాయి
చెదపట్టిన నా ఎడంద
వదలలేదు అ దేలకో
చదల కెగురు ప్రయత్నాలు.

ఇతడు డెస్టిట్యూట్.

('నగరయామిని'లో ఒకటవ లిప్త.)



నాటిక:

# నేడు - రేపు

శ్రీ రా. సీ. ఆంజనేయశాస్త్రి

[మహారాజాగారి భవనం. రాజాగారు సోఫాలో కూర్చుని వుంటారు. ౫౫ ఏళ్లుంటాయి. అయినా, గుఱ్ఱపుస్వారీ, కత్తిసాము రోజూ చేస్తూ ఉండటం చేత శరీరం దృఢంగానే వుంది. నిమ్మకాయలు నిలబెట్టగల మీసకట్టులో అక్కడక్కడ తెల్లటి వెంట్రుకలు వెండితీగలల్లే మెరుస్తూ వుంటాయి. దర్బారులో లేకపోయినప్పటికీ, కిరీటం ఖడ్గంవినా, మిగతా రాజోచితవేషమంతా యథాతథంగానే వుంటుంది.

రాజకుమారుడికి యిరవై అయిదే ఏళ్లుంటాయి. తండ్రి యెదురుగా మామూలు పేముకుర్చీలో కూర్చుని వుంటాడు. తండ్రిలాగానే మంచి దృఢగాత్రుడు. కత్తిరించిన మీసాలు. సాదాదుస్తులు. రాజసం ఏమాత్రం కనిపించదు మొహంలో. తండ్రీ, కొడుకూ మాట్లాడుకూండగా తెర లేస్తుంది.]

మహారాజు—ఇంతకీ మేంమాత్రం కాలానికెదురీదుతున్న దేముంది? మాతృభాషలో చదువుసంధ్యలకీ, నిర్బంధసైనికశిక్షణకీ మొట్టమొదట్లో ఏర్పాటుచేసింది మన సంస్థానంలోనే కదా!...

రాజకుమారుడు—కాదనడం లేదు......కాని పేదా బిక్కా...

మ.రా—(కొంచెం విసురుగా) మహా తమకే వాళ్ల గోడు పట్టుకున్నట్టు! తరతరాల్నుంచీ అన్నసమారాధన రోజూ జరుగుతూనేవుంది. ప్రతి ద్వాదశికీ పుట్లకి పుట్లు వార్పించి సంతర్పణలు చెయ్యడం లేదూ. మేం మటుకు?...

రా.కు—నాకు మహాదుఃఖం కలుగుతుంది ఆ సంతర్పణల్లో అంతమందిజనం ఎగబడటం చూస్తుంటే.

మ.రా—(ఆశ్చర్యంగా) అదేమిటి? వేలకొద్దీ జనం మృష్టాన్నతృప్తులై వెళ్లుతుంటే నీకు దుఃఖం కలుగుతోందీ?

రా.కు—పట్టెడు మెతుకులకోసం గంటలతరబడి పడిగాపులు పడివుంటున్నారే పెత్తందార్ల కొరడా ఛెళుకులకి తలఒగ్గికూడా! పాపం ఎంత దుర్భరదారిద్ర్యంలో మునిగివున్నారో వాళ్లు! లేకపోతే, ఆత్మగౌరవం చంపుకుని...

మ.రా—(మొహం పక్కకి తిప్పి) సరిసరి... సంతర్పణలు మానెయ్యమనా ఏమిటి నీ సలహా?

రా.కు—సంతర్పణలు చేస్తామన్నాకూడా జనం రారాదు. రావాల్సిన అవసరమే వాళ్లకుండరాదన్నమాట. తిండికి మొహం వాచేటంత పేదరికం ఒకచోటా, వీధులు కట్టి విస్తళ్లెయ్యగలిగినంత భాగ్యం ఒకచోటా...

మ.రా—(అర్థోక్తిలోనే, తీవ్రంగా)... అయితే ఖజానాలు దోచిపెట్టమనా?...అంతకీ "హరిజనులో, హరిజనులో!" అని గోలపెడుతుంటే, దేవాలయప్రవేశం యిప్పిస్తిమి వాళ్లకికూడా...

రా.కు—నిజమే! కాని అంతమాత్రంచేత...

మ.రా—(విసుగ్గా)... నీకే తృప్తి లేకపోతే, యిహ అలకా వినవలకేముంటుంది?

రా.కు—పాపం, వాళ్లని అలకాజనంగా తయారుచేసింది మనం కాదూ?

మ.రా—మనం చేసే దేముంది? ఆ పరమాత్ముడు చెయ్యాలి ఏంచేసినా!... "బుద్ధిః కర్మానుసారిణీ" అని...

రా.కు—(వినిపించుకోనట్టుగా) మొన్నీ మధ్య మాలపల్లి వెళ్లితే, వాన జోరున కురవని కొంప ఒక్కటంటే ఒక్కటికూడా కనిపించలేదు. గుడిశెలచుట్టూ మురుగునీరు, దోమలూ...పందిగూళ్లు - నయం వాటి కంటె...

మ.రా—(కొంచెం సానుభూతి ప్రకటిస్తూ) అవును పాపం! మొన్నటి గాలివానకి కొంపలన్నీ పడిపోయాయికామాలు! అందుకనేగా, తాటితోపులోంచి తలో తాడీ ఊరికేనే కొట్టుకుపొమ్మని చాటింపేయించాం?

రా.కు—అల్పే! ఒకటీ అరా తాళ్లవల్ల ఏ మవుతుంది? శుభ్రమైన యిళ్లు కట్టించిపెట్టా లని ఆందోళన చేస్తున్నారు వాళ్లు.

మ.రా—(కోపంగా) మేడలూ మిద్దెలూ కట్టించియ్యొద్దూ? ఇళ్లుట! ఇళ్లు! అసలు నువ్వేటగా రేపెట్టింది వాళ్లకి? మన వంశంలో ఎన్నడైనా వుందీ, మాలామండీల గడప తొక్కడం?...

రా.కు—అందుకనే కదూ, నేను వెళ్లేసరికి పాపం, వాళ్లకి కాళ్లు విరగదొక్కుకున్నట్టయింది! ముసలీ ముతకా, "ప్రభువులు మనకొంపలు తొక్కారంటే, ఏం కీడు మూడుతుందో!" అని భయపడ్డారు. నన్ను వెళ్లిపొమ్మని బతిమాలుకున్నారుకూడాను... నాకు చచ్చినచావైంది...మనం మనుష్యులికి దూరమై పోతున్నాం నాన్నగారూ!.........అస్పృశ్యుల మయ్యాం...

మ.రా—కట్టిపెడుదూ నీచదువు!......వాళ్లే నయం. పెద్దా చిన్నా, మంచీ చెడ్డా గమనింపు పోలేదింకాను...అవలీచదువు లొచ్చి నాశనంచేశాయిలే మన సాంప్రదాయాల్నీ, ఆచారాల్నీని. ఇప్పుడే మనుకుంటే ఏంలాభం, నిన్నూ ఆ రొంపిలో దింపాక?...

రా.కు—విజ్ఞానం ఒకరి సొత్తా? ప్రపంచమంతా ముందుకి పోతుంటే, మనం ఆపితేమటుకు ఆ భావాలు ఆగేవా?...

మ.రా—(కొంచెం ఆలోచిస్తున్నట్టుగా) నువ్వు చెప్పిందీ నిజమేలే. కాకపోతే నువ్వన్నా మాతో ఏకీభవించేవాడవేమో నని ఇదవుతున్నా తప్పితే!......ఇంతకీ మొన్న రాజకీయ సభలో మమ్మల్ని వ్యక్తిగతంగా నానాతిట్లూ తిట్టారుటగా? నువ్వూ వింటూ కూర్చున్నావుట మిగతా వాళ్లతోపాటు హర్షిస్తూ!

రా.కు—క్షమించాలి. నేను సైతం మీ చర్యల్ని విమర్శిస్తూ మాట్లాడాకూడాను. కిందటివారం రామచంద్రరావుగారింట్లో జొరబడి సంస్థానోద్యోగులు చేసిన పనులికి మీరే బాధ్యులని ప్రజల విశ్వాసం ...అందుకని, ఆ...

మ.రా—మాకు తెలుసు, రామచంద్రరావుగారు చాలా పెద్దమనిషి. ఆయనతాతగారివరకూ ఎన్నో తరాల్నుంచీ సంస్థానంలో పెద్ద ఉద్యోగాల్లో వున్నవాళ్లే. కాని ఆయన యీ గొడవలలో పడటం, ఆయనమీద వచ్చిన ఫిర్యాదులు చాలా తీవ్రమైన వవడం, మరి తప్పనిసరయిందిట యిల్లు సోదాచెయ్యడం...అంత మాత్రంచేత...

రా.కు—అందు కెవరూ ఆక్షేపించడంలేదు. కాని, ఆయన్ని చావదన్ని లారీలో ఎక్కించుకుపోవడమూ, స్త్రీలని నానాదుర్భాష లాడటమూ కష్టంవేసింది. ఇనస్పెక్టర్ వొచ్చి రామచంద్రరావుగారి కూతురిమీద చెయ్యివేశాడుటకూడాను. పిల్లా జెల్లతో సహా యింటిల్లిపాదినీ తరిమేసి, యింటికి సీలు వేశారు... ఉద్రేకపడిన జనంమీద తుపాకులు పేలిస్తే నలుగురు చచ్చిపోయారు. శవాల్నికూడా బంధువులి కప్పజెప్ప లేదు.

మ.రా—(ఆశ్చర్యంగా) ఇవన్నీ మాకు తెలీదే! సోదాచెయ్యటాని కెళ్లిన ఉద్యోగులమీద జనం రాళ్ల వర్షం కురిపిస్తే, మూకని చెదరగొట్టడానికి గాలిలో తుపాకులు పేల్చవలసొచ్చిందనీ, జనం పారిపోయే తొక్కిడిలో యిద్దరికి స్వల్పమైన గాయాలు తగిలాయనీ మాకు వచ్చిన రిపోర్టు...

రా.కు—కాని యివన్నీ మీయాజ్ఞమీదే జరిపినట్లు ఉద్యోగులు చెబుతున్నారు. నేను నమ్మక

పోయినా ఊరుకోవాలిసొచ్చింది...ఇప్పుడు, మీరు తెలీదంటున్నారుకనక, ఆ వదంతుల్ని ఖండిస్తూ రామచంద్రరావుగారికీ, వారి కుటుంబానికీ తగిన పరిహారాన్ని...

మ.రా—(సాలోచనగా) మాకైతే ఎంతైనా చెయ్యాలనుంది...ఎంత కష్టంగా వుందీ మాకు, రామచంద్రరావుగారి విషయంలో యింత పని జరిగిందని ?! ...కాని...కాని, యివి రాజకీయాలు నాయనా! ప్రధానమంత్రితో సంప్రదించందే ఏ మాటా యివ్వలేను...ఇంతకీ ఎవరివాళ్లు వాళ్లకి కాకపోయింతర్వాత ...(కొత్తత్తగి)...నిన్ను గురించి ఏమనుకుంటున్నారో తెలుసా?...మామీద ప్రజల్లో ద్వేషం పుట్టించి, మమ్మల్ని పదభ్రష్టుల్ని చేసి, ప్రజాప్రభుత్వం అనే పేరుతో నువ్వు గద్దె కెక్కటానికిగాను ఉద్యమంలో చేరావుట!...

రా.కు—(చిరునవ్వు నవ్వి) అవును, నా చెవినా పడిందా పుకారు. కాని, మీ కుమారుడు నీచుడు కాడని మీకు తెలుసుననే నా నమ్మకం. అందువల్ల నా కా పుకా రేమీ బాధ కలిగించలేదు...

మ.రా—నిజమేకాని, నీ చేతలుమాత్రం...

రా.కు—(అర్థోక్తిలోనే, గంభీరంగా) మీకే అనుమానమా? నాయందు విశ్వాసం లేకపోతే, ఇదుగో, నాశిరస్సుని యిప్పుడే ఖండించండి...

మ.రా—(వెరపుతో) ఎంతమాట! మమ్మల్ని అవమానపరచడం కాదూ? మాకు తెలుసు మన రక్తంలో అటువంటి నీచాణువు లుండవు...మన వంశాన పూర్వం ఒకతరంలో తండ్రీకొడుకులికి మాటామాటా వచ్చి బాహాటంగానే ద్వంద్వయుద్ధం చేశారుట. అంతే తప్పితే...(నీళ్లు నములుతూ)...ఇంతకీ...మేం చేసినా నీకోసం కాదూ?...మన వంశమర్యాదా, గౌరవం నిలబెట్టుకుంటూ, తరతరాలా రాజరికమూ...

రా.కు—(తొందరగా) నాకు రాజరికం అక్కర్లేదు నాన్నగారూ! నే నందు కర్హుణ్ణి కాను...నా కా కోరికే లేదని బహిరంగంగా ప్రకటిస్తే నామీది పుకారుకూడా పోతుంది...

మ.రా—(వ్యాకులతతో) నా తల తీసినట్లు కాదూ, నువ్వలా ప్రకటిస్తే? నే నో రావణాసురుడి నయినట్టూ, అందువల్ల నువ్వు రాజ్యాన్నే పరిత్యజించినట్టూ...ముందు నాతల నరికి నువ్వలా ప్రకటించు నాయనా!...

రా.కు—(గద్గదికతో) ...నాన్నగారూ!... నానోరు కట్టేస్తున్నారు...

* * *

రెండో రంగం

[మెహర్ కుర్చీలో కూర్చుని వుంటుంది. పద్దెనిమిదేళ్లుంటాయి. చక్కని రూపం. సాదా వేషం. మొహంలో మటుకు దిగులు కనపడుతూవుంటుంది... చంద్రశేఖరం అటూ యిటూ పచార్లు చేస్తూంటాడు. నల్లగా పొడుగ్గా వుంటాడు. మొరటు మొహం. ఇరవై ఆరేళ్లుంటాయి. కుచ్చితంగా కనిపిస్తాడు. మెహర్ని మాట్లాడనివ్వకుండానే సాగిస్తాడు తన ధోరణి...]

చంద్ర—అవును...అత నలా కాక యింకోలా ఎలా చెబుతాడు? ఎంతైనా తండ్రికదూ! తనమాదిరి చవటవాజమ్మ ఎవరన్నా నవాబ్మలి మహారాజుకి తెలీకుండానే, రామచంద్రరావుగారింట్లో అన్ని రాక్షస కృత్యాలు జరగాయంటేనూ, నలుగురి అరుణరుధిరాన్నీ ఆ పిశాచాలు తాగాయంటేనూ.

మెహర్—(కోపాన్ని సూచిస్తుంది.)

చంద్ర—(కుచ్చితంగా నవ్వుతూ) నాకు తెలుసు, నువ్వతనిమీద ఈగనికూడా వాలనివ్వవని...ఎందుకోకూడా తెలుసు!!...

మెహర్—(ప్రశ్నార్థకంగా చూస్తుంది.)

చంద్ర—వేరే నే నెందుకూ? నీ మొహమే చెబుతోంది నువ్వతన్ని ప్రేమిస్తున్నావని...

మెహర్—(తల వంచుకుంటుంది.)

చంద్ర—మొన్న రాత్రి నువ్వూ అతనూ కోట గుమ్మందగ్గిర...

మెహర్—ఊఁ...(అని ఏదో అనబోతుంటే అర్థోక్తిలోనే)

చంద్ర—"సంఘంపనిమీద నువ్వేకదూ పంపింది?" అనబోతున్నావుకదూ?...అవును... దాంతోపాటు నీపనీనీ...రాజశేఖరం చెప్పలేదను కున్నావా నాతో?...అసలు పెద్ద కుట్రే వుందిలే మహారాజా చేయిస్తోంది, రాజకుమారుడిచేత...

మెహర్—(సాశ్చర్యంగానూ, ప్రశ్నార్థకంగానూ చూస్తూ లేచి నుంచుంటుంది.)

చంద్ర—నీకుమాత్రం తెలీకుండా వుందీ?

మెహర్—("తెలీదు" అన్నట్టుగా తల ఊపుతుంది.

చంద్ర—నూగనోము పట్టావల్లే వుందే యివాళ?...తన రాజరికం ఎలాగూ నిలవ దని మహారాజాకి తెలుసు...తనకి ఊడినా, ప్రజాప్రభుత్వంలో తనకొడుక్కి అధికారం రావడంకోసం రాజకుమారుడిని ఉద్యమంలోకి పంపించాడు. అతను "కార్మిక కర్షకు" లంటూ కబుర్లు దంచుతుంటే, వెర్రిదద్దమ్మలంతా "కుమారరాజాగారంతటివారే మనకోసం పాటు పడుతున్నారు. మహామహులు! త్యాగులు" అంటూ బ్రహ్మరథం పడుతున్నారు.

మెహర్—("నిజమా?"అని అనుమానిస్తున్నట్లు చూసి ఏదో అనబోతుంటే—)

చంద్ర—నువ్వంతమాత్రం అనుమానపడక్కర్లేదు మెహర్. బోలెడన్ని నిదర్శనా లున్నాయి. మొన్న రాజకీయమహాసభలో పాల్గొన్న ప్రముఖు లందర్నీ అరెస్టుచేశారుకదా! మనిద్దరిమీదా, సరే, యిదివరకే పుట్టివున్నాయయ్యె వారంట్లు! కాని అతని మీదమాత్రం చెయ్యి వెయ్యలేదు. ఎలాగైనా రాజకుమారుడుకదూ!... ప్రజాప్రభుత్వంపేరుతో తన గద్దెకాపాడుకునే దురుద్దేశం అతనికి నిజంగానే లేకపోతే ఆ మాట బహిరంగంగా ప్రకటించమంటే ప్రకటించడేంమరి? పైగా వాళ్ల నాన్నగారుట, యీయనగారి నోరు కట్టేశారుట!! అదో చిదంబర రహస్యం!! వెధవకబుర్లు!!! ఎవరికి తెలీవూ యీ కుట్రలన్నీ?...

మెహర్—(మునిపళ్లతో పెదిగోళ్లు కొరుక్కుంటూ పాలోచనగా రెండడుగులేసి మళ్లీ కుర్చీలో కూర్చుంటుంది.)

చంద్ర—(తన ప్రాచీక పారుతోంం దనే ఉల్లాసంతో) అదీగాక, చూడు, మెహర్!...ఇతర్లని పెళ్లి చేసుకోటం మన సంఘపు కట్టుబాట్లకి వ్యతిరేకం, తెలుసా? అంతేకాదు... తలెత్తు... ఇదిగో!... యిలాంటిద్రోహాలన్నా మరీను...?

మెహర్—(నిర్లక్ష్యంగానూ, హీనంగానూ అతనివేపు చూసి పక్కకి తిరుగుతుంది)

చంద్ర—(కొంచెం ఆలోచించి, ఏదో గుర్తుకి వచ్చినట్లు)...ఆ...చూశావూ, మెహర్, యింకో రహస్యం...

మెహర్—('ఆఁ...వినేదేమిటి లెద్దూ. రహస్యం'...అన్నట్టుగా, నిశ్చలంగా యిందాకటి మాదిరే కూర్చుని వుంటుంది.)

చంద్ర—నీపుటకవిషయం అన్నమాట—

మెహర్—(చప్పున అతనివేపు తిరిగి, కొత్త కంఠంతో)...ఆఁ!?

చంద్ర—అవును...చచ్చిపోయిన నీతల్లి బోగంది. ఆమెను మహారాజా వుంచుకున్నాడు. అన్నాచెల్లెళ్ల పెళ్లా? (క్రూరంగా నవ్వుతాడు.)

మెహర్—(పిడుగు పడ్డట్టు తల వాల్చి, "నమ్మమంటావా?" అన్నట్లు దీనంగా చూస్తుంది కన్నీరు కారుస్తూ.)

చంద్ర—అలా చూస్తావేం? అతన్నే అడుగు, కావాలంటే!...మెహర్, నీకోసం నేను...(అంటూ కుర్చీమీద చెయ్యివేస్తాడు.)

మెహర్—(తటాలున కుర్చీలోంచి లేచి నుంచుంటుంది.)

చంద్ర—నీ పలుకే బంగారమైపోయిందేం మెహర్ యివాళ?...సంస్థానంలో చిచ్చుపెట్టాం... ఇహ చాలు...ఇక్కడుంటే, మనని ఎలాగో పట్టేస్తారు. యివాళ కాకపోతే రేపు...కనక మన మిద్దరం సంస్థానంలోంచి పారిపోయి...ఎక్కడో సుఖంగా...

మెహర్—(చీడపురుగుని విదిలించినట్టుగా విదిలిస్తూ రెండడుగులు ముందు కేస్తుంది.)

చంద్ర—(కోపంతో) నీమీద ప్రేమకోదీ యింతకాలం నేను వేచివున్నాను...లేకపోతే అతని నెత్తుటి కళ్లచూసివుందును యీపాటికి...

మెహర్—ఛూ...(అని వెళ్లిపోతుంది.)

చంద్ర—(పళ్లు పటపటా కొరుకుతూ) ఇప్పుడు మీయిద్దరి నెత్తురూ కళ్లచూస్తాడీ చంద్రశేఖరం...

(తెర పడుతుంది చకచకా)

* * *

## మూడో రంగం

[అర్ధరాత్రి. కోటగుమ్మం దగ్గిర రాజకుమారుడూ, మొగవేషంలో ఉన్న మెహర్ మాట్లాడుతూవుంటారు. ఫారాజవానుకేకా, మాటలూ తెర వెనక వినిపిస్తూంటాయి.]

మెహర్—(నిట్టూర్పు విడుస్తూ) సంఘంలోంచి ఒచ్చేశాకా నామీద వాళ్లంతా కసిపూని తిరుగుతున్నారు, పాడిచేద్దామని...

రా.కు—ఎందుకూ పొడవడం?...

మెహర్—అసలుకారణం, చంద్రశేఖరాన్ని నేను పెళ్లిచేసుకోలే దని. చెప్పడంమటుకు "సంఘంలోంచి వెళ్లిపోయి ద్రోహం చేసిందికనక, బతికనిస్తే మన రహస్యాలు బయటపెడుతుంది. అందుకని చంపేయ్యాలి"అని చెప్పి, సంఘంలోవాళ్లకి పురెక్కించాడు చంద్రశేఖరం.

రా.కు—అంత దీక్షగా ప్రాణాలకికూడా తెగించి పనిచేసిన నిన్నే వాళ్లే హత్యచెయ్యాలనా యిప్పుడు?...

మెహర్—అందేకాదు. నేనేం లెక్క? అతన్ని నమ్ముకున్న వందలాది మనుష్యుల్ని నట్టేట ముంచి "చిచ్చుపెట్టాంగా? చాలు. యిహ మనిద్దరం సంస్థానం విడిచి పారిపోదాం" అన్నాడు చంద్రశేఖరం నాతో. మొన్నరాత్రి కర్రలతో ఎదురుతిరిగి సంస్థానోద్యోగుల్ని చావబాదిన రైతులు "మిలిటరీవాళ్లొచ్చి కాలుస్తారని పుకారుగా వుంది. ఏం చెయ్యమంటారు?"అని అడగ్గొస్తే చంద్రశేఖరం మొహం తప్పించాడు...

రా.కు—ఎంత ఘోరం! హింసాపథం నీతులకీ, బాధ్యతలకీ చోటివ్వదేమో!!...

మెహర్—మహారాజాగార్ని చంపాలని చేసిన కుట్రలో నాకూ భాగం వుంది...వారు నాకు తండ్రులని తెలీదు అప్పటికి...చంద్రశేఖరమే మొన్న బయటపెట్టాడు...(ఏడుస్తుంది.)

రా.కు—అవును...పాపం. మీఅమ్మ నిన్ను కనగానే చచ్చిపోయింది. నన్ను ఎత్తుకుంటూవుండేది కూడాను...నాకు కొద్దిగా గుర్తుకూడా వుంది...

మెహర్—నా కెందుకు చెప్పలేదూ, యింతకాలమూను?

రా.కు—సంఘం ఎంత ముందుకు పోయినా, యింకా పాతవాసనలు చావలేదు. వేశ్యపుత్రివని నీకుగాని, యితరులకిగాని తెలియకుండా వుండటమే మంచి దని వూరుకున్నా.

మెహర్—కాని యిప్పు డెంత ప్రమాదం జరిగిందో గమనించారా?

రా.కు—దాని కేం మెహర్! ఎవరు నమ్మిన పంథాలో వాళ్లు ధైర్యంగా సంచరించడం ధర్మం. హింసాపథంలో నమ్మక ముండి నువ్వు కుట్రలో పని చేశా వనుకో. తండ్రయితే నేం? అన్నయితే నేం?... ఇంతకీ కుట్ర ఫలించలేదుగా నువ్వు దుఃఖించటానికైనా?...అదిగో, యింకా ఏడుస్తున్నావా?...

మెహర్—(దుఃఖాన్నాపుకుంటూ) అది కాదండీ...నే నింకా ఘోరమైన అపచారం చేశా...

రా.కు—అంటే?...

మెహర్—(మొహం చేతులతో మూసుకుంటూ) ...మిమ్మల్ని...ప్రేమించా...

రా.కు—(నిట్టూర్పు విడుస్తూ)...నిజమేనా మెహర్? నే నెంత దౌర్భాగ్యుణ్ని? చెల్లెలిలో అలాంటి ప్రేమని రేకెత్తించిన యీ నా నికృష్ట శరీరం...

మెహర్—(కొంచెం తమాయించుకుని)... అయ్యయ్యో! అదేం మాట? నా కండకావరం కన్నుమిన్ను కానకుండా చేసింది...నాకేం దారి యిహ? హింసలో నమ్మకం లేకపోయినా పరిసరాల ప్రభావంవల్ల హింసకి ఒడబడ్డాను. అప్పుడు కుట్ర ఫలించనందుకు విచారపడ్డా-'ఆ వ్యక్తి నే నూహించుకుంటున్న పతికి తండ్రి' అని తెలిసికూడా. ఆ వ్యక్తి నాకుకూడా తండ్రి అని తెలిసిం దిప్పుడు. ఇహ నేను సంతోషించాలా, దుఃఖించాలా?...అన్న అని తెలీక మిమ్మల్ని ప్రేమించా. తెలుసుకుని యిప్పుడు దుఃఖిస్తున్నా...కుట్రలో ఉన్నానని ప్రభుత్వమూ, సంఘంలోం చొచ్చేశానని వాళ్లూ నన్ను వేటాడుతున్నారు. ఇంతవరకూ నేను చేసిన దుష్కృత్యాల పశ్చాత్తాపాలు నా ఆత్మని రంపాన రాస్తున్నాయి... ఏం చెయ్యను అన్నగారూ... (ఏడుస్తుంది వలవలా.)

రా.కు—(గద్గదికతో) చెల్లీ, నేను తుంత వ్యక్తిన్ని కాను...నీకష్టాలకి కారకుణ్ని నేనుకదూ?... నీకోరిక చూచాయగా నేను గ్రహించికూడా మెదలకుండా ఊరుకున్నా నీ జన్మరహస్యం బయలుపెట్టాలి వస్తుందని...మొన్న చంద్రశేఖరం గుచ్చిగుచ్చి అడగడంవల్ల చెప్పక తప్పలేదు...అదీ కొంత మేలే అయింది...

మెహర్—(దుఃఖంతోనే) మా నాన్నగారికి నా సంగతి తెలుసా?...

రా.కు—తెలీకేం మెహర్? నేనూ, నువ్వూ కూడా తనకి వ్యతిరేకంగా పనిచేస్తున్నామని మహా వ్యథ పొందుతున్నారు...

మెహర్—నాకిహ మరణమే శరణ్యం అన్నగారూ!...

రా.కు—ఛీ! అది పిరికిలక్షణం. ఉద్యమం ఫలించే రోజు లొస్తున్నాయి. నాన్నగారుకూడా... (తెరలోకి చూస్తూ) చింతతోపులో ఏమిటా అలికిడి?...ఫారాజవాక్!!...

ఫారాజవాక్—(తెరలోంచే) చిత్తం!...

రా.కు—ఆ చింతతోపులో అలికి డేమిటో చూసి రండి.

ఫా.జ—చిత్తం!...

రా.కు—పిరికిలక్షణం మెహర్, ఆత్మహత్య!...

మెహర్—న .న్నీపాపాలూ, వ్యథా విడిచిపెట్టవు జీవించి ఉన్నంతకాలం.

రా.కు—పశ్చాత్తాపాగ్ని నిన్ను దహించేస్తోంది. నువ్వు ప్రభుత్వానికి వెంటనే వశమయిపో...

మెహర్—తరవాత?...

రా.కు—తరవాతా?......(తుపాకిశబ్దం వినిపిస్తుంది)...అదేమిటి?...

మెహర్—చంద్రశేఖరం కాదుకదా? నన్ను వెంటాడుతున్నాడు లెండి...

రా.కు—అయితేమటుకు? తుపా కెందుకు?... (తెరలోకి చూస్తూ)అరె! భుజా న్నెవరో వేసుకుని ఫారాజవాను పరిగెత్తుకొస్తున్నాడే!...

మెహర్—(తెరలోకి చూస్తూ) అదేమిటి, గుండెల్లోంచి నెత్తురు కారుతోంది? చంద్రశేఖరమే!...

రా.కు—అతనే?...ఏమి టీ హత్య? ప్రాణం పోలేదు కదా?

ఫారాజవాక్—(తెరలోంచి వస్తూ) పోయేవుంటుందండి...చూడగానే గుర్తుపట్టావండి...పారిపోతుంటే కాల్చమని ఆజ్ఞ బాబూ. కాళ్లకి గురిపెట్టి కాల్చేసరికి తప్పించుకుంటానికి నేలమీద పడుతున్నాడండి...అందుకని గుండెల్లో తగిలిందండి...

రా.కు—(ఆదుర్దాతో) అయ్యయ్యో! ఎంత దారుణం, ఎంత దారుణం!! త్వరగా ఆసుపత్రికి తీసుకుపో! (మెహర్‌తో)...మెహర్! మెహర్!! చూస్తూచూస్తూండగానే ఎంత ఘోరం జరిగింది?

మెహర్—(నిశ్చలంగా) లేకపోతే మనిద్దరి ప్రాణాలూ ఎగిరిపోయేవి. మనిద్దర్నీ చంపటానికే అతను వచ్చివుంటాడు.

రా.కు—అందుకేనంటావా?.........అయితేమటుకు? అతను నిన్ను నిజంగానే గాఢంగా ప్రేమిస్తున్నాడేమోనమ్మ?...అతని ప్రాణం పాపం ఎలావుందో! పోదాం పద ఆసుపత్రికి.

మెహర్—(శుష్కంగా నవ్వుతూ) మీ హృదయం నవనీతం...

(ఇద్దరూ త్వరత్వరగా వెళుతూండగా తెర పడుతుంది.)

* * *

## నాలుగో రంగం

[సాదా వేషంలో మహారాజా, మామూలు వేషంలోనే రాజకుమారుడూ, గుండెకి కట్టుతో చంద్రశేఖరమూ ప్రవేశిస్తారు.]

మహారాజు—గాయం నయమవుతోందా నాయనా ?

చంద్రశేఖరం—(వేదనతో) గుండెమీది గాయం నయమవుతోంది కాని గుండెలో తీవ్రమైన గాయం చేస్తున్నారు స్వామీ...మీరు...

రాజకుమారుడు—అదేమిటి చంద్రశేఖరం?...

చంద్ర—రాజ్యాంగంలో సర్వహక్కులూ ప్రజలకిస్తూ మహారాజాగారు చేసిన ప్రకటన నాకు సంతోషాన్నీ, దుఃఖాన్నీ కూడా కలిగిస్తోంది.

మ.రా—చంద్రశేఖరం కూడా మారుతున్నాడేమిటి ?

చంద్ర—నేనిప్పుడు సిగ్గుతో చచ్చిపోతున్నా స్వామీ ! మిమ్మల్ని హత్య చెయ్యటానికి పూనుకొన్న నాకు సంపూర్ణస్వేచ్ఛ నిచ్చారు.

మ.రా—దానికేంలే ! నామీద నీకు వ్యక్తిగతంగా ద్వేషం ఏముందీ, వ్యవస్థతో పోరాటం తప్పితే ? ఆ వ్యవస్థ మారేసరికి అంతా స్నేహితులమే !

చంద్ర—అదే కాకుండా, మెహర్ నన్ను నిరాకరించడంచేత ఆమెనీ, దానికి కారణభూతులని రాజకుమారునీ, హత్యచేయ తలపెట్టాను. ఇది స్వార్థం కాదూ !...కేవలం...

రా.కు—స్త్రీశక్తి అటువంటిది లే చంద్రశేఖరం ! గాఢప్రేమ ఎంత పనన్నా చేయిస్తుంది. అందుకు నువ్వు విచారించకు.

చంద్ర—(దుఃఖంతో)మీకు హృదయం లేదనీ, అటువంటప్పుడు అది మారడం అనేది అసంగత మనీ, కనక రాజవంశంలో ఒక్క పురుగన్నా లేకుండా నాశనం చెయ్యాలనీ నమ్మాను. ప్రచారంచేశాను, ప్రయత్నించాను...ఇప్పుడు తెలిసింది హృదయం లేనిది నా కని...

రా.కు—నీకూ వుంది హృదయం, చంద్రశేఖరం ! లేకపోతే యిప్పుడింత బాధపడవు... ఎందుకులే యింకా పాతవి తవ్వుకోటం!

మెహర్—(ప్రవేశించి) పట్టీ మార్చాల్సిన వేళయింది. రండి, కట్టు కడుతా...

చంద్ర—(మెహర్‌ని చూసి మరీ ఖిన్నుడవుతూ)...సానుభూతిపూర్ణమైన ఆమె ప్రతిపలుకూ నన్ను శూలంలాగా పొడుస్తోంది.

మెహర్—(తీవ్రంగా) మీ కన్నిమాట్లు చెప్పినా తెలీదేం ! డాక్టరుగా రేమన్నారు ? అలా విచారపడితే గాయం నయం కావడం కష్టమని చెప్పలేదూ ?

చంద్ర—నాదురంతాన్ని మీముందు వెళ్లబోసుకుంటేనే గాని నా హృదయభారం తీరదు. మహారాజాగారూ మీరూ కూడబలుక్కుని, ఒకరు కాకపోతే ఒకరు అధికారంలోకి రావచ్చునన్న ఉద్దేశంతో మిమ్మల్ని వారు ప్రజోద్యమంలోకి పంపా రనీ, కనక మిమ్మల్ని ముందు హత్యచెయ్యాలనీ బోధించాను. కాని ఎవరూ ఆ పనికి పూనుకోకపోయేసరికి, యీ నీచుడే అందుకు తయారయాడు...నరకంలోనన్నా నాకు చోటు దొరుకుతుందా మహారాజా ?

మ.రా—ఆ సంబోధన యింకా మానెయ్యి చంద్రశేఖరం...ఎవర్ని ప్రజ లెన్నుకుంటే ఆయనే అధికారన్న మాట.

రా.కు—ఇదిగో, పాతసంగతు లింకా ఎత్తితే వూరుకోను. ఎన్నిసార్లు చెప్పాలి నీకు, చంద్రశేఖరం? అసలే బలహీనంగా వుంటూను !

మెహర్—నామీద ఒట్టు, మీ రింకా ఆ కథలు తవ్వుకుని దుఃఖించా రంటేను !...మహారాజాగార్ని కాక మరొకరి నెందుకెన్నుకుంటారు ప్రజలు కుటుంబ ?...నిజంగా హృదయం గలవారు వారే !...

మ.రా—(నవ్వుతూ) లేం దవరి కమ్మాయీ!... సమయం వచ్చేసరికి అదే కనిపిస్తుంది...(చంద్రశేఖరం వేపు తిరిగి) మనుష్యుని మానవత్వంలో విశ్వాసం ఉంచాలి తప్పితే...

రా.కు—పరిపత్నభర్తలు కనిపెట్టుకు కూర్చుంటారేమో ! వేళకూడా అయింది...లేవండి వెడదాం... (మెహర్ వేపు తిరిగి) మెహర్, చంద్రశేఖరానికి కట్టు కట్టి మీ రిద్దరూ కూడా రండి...వెంటనే.

(మెహర్, చంద్రశేఖరమూ ఒకవేపుకీ, రాజకుమారుడూ, మహారాజా మరోవేపుకీ వెళుతూండగా తెరపడుతుంది.)

---

# గాంధీజాతకములో గాడ్సే ప్రత్యక్షము

•

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

కీర్తిశేషుడైన మహాత్మునికి సంబంధించిన వస్తుజాలము, గ్రంథసామగ్రి మున్నగువానిని సేకరించి భద్రపరచుటకై పనిబూనిన గాంధీస్మారకసంస్థకు ఇటీవలనే మహాత్ముని జాతకము తద్వంశీయుల మూలముగా లభించియున్నదట! ఇది సంస్కృతభాషలో చాలసంవత్సరముల క్రిందట వ్రాయబడినదనియు, తద్గ్రంథకర్తయైన బ్రాహ్మణుడు కీర్తిశేషుడైనాడనియు వార్తాపత్రికలు ప్రకటించినవి. ౭౫, ౭౯, ౮౦ సంవత్సరముల వయస్సులో మహాత్ముడు ఆయుఃఘాతమును పొందుననియు, ఆ గండము గడచినచో మహాత్ముడు ౧౨౫ సంవత్సరములు జీవించుననియు ఆ దైవజ్ఞుడు జాతకఫలము వ్రాసియున్నాడట! అత డెంతటి మహానుభావుడో! వార్ధకావస్థలో పదునారు సంవత్సరములు జరుగవలసియున్న గురుమహాదశలో మారకము జరుగుననియో, మూడవమారు గోచారవశమున శని జన్మరాశిలో సంచరించు కాలము ఆరోగ్యమునకు గండకాలమనియో ఆధునిక కార్తాంతికులు కొందరు ఇటీవల వ్రాసినారనుమాట వాస్తవమే. కాని, ఆ ప్రాచీనదైవజ్ఞుడు మహాత్ముని చిన్నవయస్సులోనే వ్రాసియుంచిన పైఫలాదేశముతో పోల్చినచో, ఇప్పటి వ్రాతల కెంతవిలువ కట్టవచ్చునో పాఠకమహాశయుల ఊహాకే వదలితిని.

ఎట్లయిననేమి, ఆ జాతక మమూల్యమైన దనుటకు సందేహము లేదు. అది ప్రకటింపబడలేదు కనుక, ఏగడియను జన్మకాలముగా ఉపయోగించి, ఏ సంప్రదాయము ననుసరించి, ఏయోగములను నిర్ధరించి, ఏ పద్ధతిని సాధించి, ఆ మహనీయుడు పైన వ్రాసిన ఫలములను ఊహింపగలిగెనో మన మెరుగము. ఆ జాతకమును ఆమూలాగ్రముగా, ఉన్నదియున్నట్లుగా ప్రకటించినచో, 'స్మారకసంస్థా' వ్యవస్థాపకులు జ్యోతిశ్శాస్త్రవిద్యార్థులకు మహోపకార మొనరించినవారగుదురు. ఆ పుణ్యకాలమునకై వేచియుందముకాక!

ప్రకృతము మనకు లభించిన సాయనజాతక సామగ్రి ననుసరించి ప్రశంసావిషయమున ఈక్రింది ప్రశ్నల కేమి సమాధానము దొరకునో చూతము :—

(i) మహాత్మునికి హత్యారూపమైన అపమృత్యువు జాతకములో సూచించబడియున్నదా ?

(ii) ఉన్నచో, ఎట్టి వ్యక్తినుండి హత్య కావలయును ?

(iii) హంతకు డట్టి వ్యక్తి యని అతని జాతకము సాక్ష్యమిచ్చునా ?

(iv) ౩౦-౧-౧౯౪౮ నాడే ఈహత్య జరుగవలసిన అవసర మేమి ?

గతమాసపు 'భారతి'లో మహాత్ముని జాతకములో మారకదశలనుగూర్చి వ్రాయబడిన వ్యాసమును చదివి యొక జ్యోతిషవిద్యార్థి నాకు సూచించిన ప్రశ్నావళి ఇది. పరిశోధకదృష్టితో చూచినచో ఈ ప్రశ్నలు మిక్కిలి రమ్యముగా, సయుక్తికముగా కన్పట్టుచున్న వనుట నిరాక్షేపము. కాని, మహాత్ముడు జీవించియున్న కాలములో వీనికి సమాధానమిచ్చుటకు పరాశరమహర్షియే కావలసియుండు

చేసెనా ! ఇప్పుడు మనకు మహాత్ముని జాతకము, హంతకుని జాతకము, హత్యాకాలము—ఇవి లభించియుండుటచే, వీనికి గల పరస్పరసంబంధమును నిరూపించి, పై ప్రశ్నలకు ప్రత్యుత్తరముల నరయుదము గాక. కృతార్థత వీటాటికో, పాఠకమహాశయులే ప్రమాణము.

ఒక్క మనవి: వ్యక్తిదృష్టితో కాక, శాస్త్రదృష్టితో మాత్రమే మన మీవిషయములను చర్చింతము. హత్యానంతరము సామాన్యముగా 'శవపరీక్ష' చేయుట ఆచారము. ఇపుడు మనము చేయు జాతకపరీక్ష యయిత మట్టిదే కానిండు. పరిశోధకులకు విద్యార్థులకు ఇట్టి విమర్శ ప్రయోజనకారి యని నానమ్మిక.

I

మహాత్ముని జాతక మిదే :

| | | | |
|---|---|---|---|
| V ౩-౫౦ | VI ౩-౩౮ ఇంద్ర౧౮-౨౭ (వ) | VII ౩-౨౭ న ౨౦-౧౦ (వ) | VIII ౩-౩౮ |
| కే ౪-౧౧ IV ౪-౧ | మహాత్ముని సాయనజాతక భావ కుండలి | | IX ౩-౫౦ వ ౨౧-౪౭ |
| మోక్ష (ప) ౭-౩౩ III ౩-౫౦ | | | X ౪-౧ రా ౪-౧౧ మృత్యు (ప) ౧౭-౫౦ చ ౨౦-౧౪ |
| శ ౧౨-౨౧ II ౩-౩౮ | I ౩-౨౭ బు ౩-౪౭ శు ౧౭-౨౮ కు ౧౮-౨౪ | XII ౩-౩౮ ర ౮-౫౭ హత్య (ప) ౮-౪౯ | XI ౩-౫౦ పుణ్య (ప) ౧౪-౪౭ |

అష్టమభావము మిథునరాశివృశ్చికనవాంశలో కుజుని ఏలుబడిలో నున్నది. అష్టమాధిపతి బుధుడు వృశ్చికరాశిలో కుజుని యాజమాన్యము నందే యున్నాడు. లగ్నాధిపతి కుజుడు వృశ్చికరాశియందే నిలిచి అష్టమభావముపై క్రూరదృష్టిని బరపుచున్నాడు! చాలదని, రంధ్రారూఢము మేషరాశిలో మేషనవాంశలోనే (౩ భాగలు ౧౪ కలలు)యుండి కుజుని సంపూర్ణాధికారమునకు లోబడినది. అవసానసహమము (వృషభరాశిలో ౧౮ భాగలు ౪౦ కలలు) పైన జన్మకుజునినుండి క్రూరసమసప్తకదృష్టి వేధ ! పెంత్రము మీద, మహాత్ముని మరణవిషయమున కుజునికి అధికారము పూర్తిగా కలదని స్పష్టమగుచున్నది. అనగా, పిత్తప్రకోపమో, రక్తస్రావమో, లేక అగ్నియో, ఆయుధమో కారణము కావలయునని యర్థము. ఇక అష్టమభావము, అష్టమాధిపతి, అష్టమభావమునందున్న గ్రహము—వీని ద్రేక్కాణధర్మమునుబట్టి మరణపు స్వభావ మూహించుట శాస్త్రసంప్రదాయము. అష్టమభావమున్న మిథునరాశి ప్రథమద్రేక్కాణము శ్వాసకాసరోగమును తెలుపును. అష్టమాధిపతియగు బుధుడున్న వృశ్చికరాశి ప్రథమద్రేక్కాణము శస్త్రవిషాదులవలని మృత్యువును సూచింపగలది.

"ఆద్యేఽలిన స్త్రీభాగే,
శస్త్రవిషస్త్రీకృతాన్నపానభవః" (సారావళి)

మరియు, అష్టమభావములో నున్న బృహస్పతి వృషభరాశిలో తృతీయద్రేక్కాణములో నుండుట. వాహనములనుండి పడుట, శస్త్రఘాతము—ఇవి మృత్యుకారణముగా పరిణమించుట దీని ధర్మము.

"విద్యాత్ తృతీయభాగే
యానాసనవాజిపాతకృతం,
పుంసాం భవతిహి మరణం
రణశిరసి మహాస్త్రకృతమేవ." (సారావళి)

ఇంతే కాదు. ఈ జాతకమున చంద్రుడు 'హిల్లాజము' (*Hyleg*)—అనగా ఆయువుపట్టు. ఈ చంద్రుడు లగ్నమందలి కుజునినుండియు, అష్టమభావమందలి బృహస్పతినుండియు కేంద్రవేధపాలయినాడు. సింహరాశిలో మూడవ ద్రేక్కాణములో ఈచంద్రు డుండుట! ఈ ద్రేక్కాణము సూచించు మరణకారణములలో శస్త్రఘాత మొక్కటి—

"విషశస్త్రయోగదోషై
రభిఘాపాద్వా తథా చ పాతాద్వా
అంత్యే సింహత్ర్యంశే
భవతిచ మృత్యుర్న సందేహః" (సారావళి)

ఇక, పంచమహాపురుషయోగములలో 'రుచక' యోగమునకు 'శస్త్రాగ్నివలకృతమృత్యువు' చెప్పబడినదని గత వ్యాసములో కనుగొంటిమికదా ?

సమష్టిపైన చూచినచో, శస్త్రఘాతవలని రక్తస్రావముమూలముగా ఆకస్మికబలవన్మరణమే మహాత్మునికి సూచితమని చెప్పవచ్చును.

సరే కాని, ఆయుధఘాతముచే మృతి రావలసినచో, అది యుద్ధములో రాకూడదా? అనవచ్చును. కాని, ఇతరులతో యుద్ధమునకో, స్పర్ధకో దిగుటకై జాతకునికి అభిలాష యొక్కటి కావలయునుగదా? 'నిర్మలాంశ'లో లగ్నమందున్న బుధుడు శుద్ధమైన జ్ఞానమును, సాత్త్వికధర్మబుద్ధి నిచ్చు సింహరాశి ౨౦ వ భాగలో నున్న ధర్మస్థానాధిపతియగు చంద్రుడు సాత్త్వికస్వభావమును మహాత్మునికి సమృద్ధిగా ప్రసాదించియున్నారు. పైగా అతని జాతకమునందు ఏగ్రహముకాని క్రూరషష్ట్యంశలో లేదనుట యొక అమూల్యమైన విశేషము. చూడుడు—

| | | |
|---|---|---|
| ౧ లగ్నము | ... ... | సౌమ్యాంశ |
| ౨ ఇంద్రుడు | ... ... | సుధాంశ |
| ౩ వరుణుడు | ... ... | కాలరూపాంశ |
| ౪ శని | ... ... | దేవాంశ |
| ౫ బృహస్పతి | ... ... | కోమలాంశ |
| ౬ కుజుడు | ... ... | మహేశ్వరాంశ |
| ౭ రవి | ... ... | చంద్రాంశ |
| ౮ శుక్రుడు | ... ... | క్షితీశ్వరాంశ |
| ౯ బుధుడు | ... ... | నిర్మలాంశ |
| ౧౦ చంద్రుడు | ... ... | కులనాశనాంశ |

మహాత్ముని సహజసౌమ్య నిర్మలస్వభావమున కీషష్ట్యంశలు సాక్షి. కాని, చంద్రుని 'కులనాశనాంశ' సయితము సౌమ్యమా యని తలంచువా రుందురు. భారతదేశములో సనాతనపద్ధతిగా భావించబడు కులభేదములవలని సాంఘికలోపములను నిర్మూలించుటే పరమధర్మము, దేశహితము అని నమ్మిన వ్యక్తి మహాత్ముడు. అస్పృశ్యతా నిర్మూలనమునకై ప్రతినబట్టి హరిజనోద్ధరణ విషయమున అతడు సాధించిన కార్యము చరిత్రలో శాశ్వతముగా నిలుచునట్టిది. దీనికై అతనిని నిందించినవారు, ద్వేషించినవారు సయితము లేకపోలేదు, అది వేరుమాట. కాని, అతడు చేసిన దేశసేవ అమూల్యమైనది. కనుక, ఉదారబుద్ధితో అర్థము చెప్పినచో, ఈ షష్ట్యంశసయితము, ఇప్పటి మనదేశపు సాంఘికరాజకీయ పరిస్థితులలో, మంచిదనియే భావించుట తప్పుకాదనుకొందును.

అది యట్లుండె. అహింసాతత్త్వాభిమానము, కోమలహృదయము, శాంతిప్రియత, ధర్మబుద్ధి-ఇవి సహజగుణములైన జాతకుడు ఇతరవ్యక్తులతో యుద్ధమునకో, కలహమునకో దిగగలడా?

పోనిండు. కాలుజారి ఆకస్మికముగా ఆయుధములపైన పడుటవలననో, ఇతరులు పొరపాటున ఆయుధప్రయోగము చేయుటమూలముగనో రక్తస్రావము సంభవించి మహాత్ముడు మరణించియుండవచ్చును గదా? హత్యకే సరికానేల? అనవచ్చును. సమంజసమే. కాని, అష్టమాధిపతి బుధుడు వృశ్చికరాశిలో నున్న భాగ మహాత్ముని మరణమునకు 'శత్రు'తో సంబంధమును సూచించుచున్నది కదా? అష్టమభావముపై అర్ధకేంద్రవిషమదృష్టిని బరపుచున్న మాయలమారిఇంద్రుడు మోసమో, తంత్రమో కలదని భావించుట కవకాశ మిచ్చుచున్నాడు. అగుటచే, తనయొక్కకాని, ఇతరులయొక్కకాని పొరపాటున ఆయుధఘాతము జరుగవచ్చుననుయుక్తికి ఇచ్చట అతుకు కుదరదని సహృదయులు సులభముగా నూహించగలరు.

ఇంతేకాదు. జాతకములో రవి (జీవాత్మ) హత్యాసహమబిందువునే ఆశ్రయించియుండుట చదువరులు గమనించగలరు. అవతారసమాప్తికి హత్యావ్యాజమును మహాత్ముడు కోరుకొన్నట్లు చూపట్టుచుండలేదా? పై సామగ్రి అంతయు హత్యకారణముగా శస్త్రఘాతము వలన మహాత్ముడు మృత్యువును సంపాదించుకొనునని సూచించుచున్నది.

ఇంతటి మహనీయునికి హత్య కావింపగోరునంతటి కచ్చిగల శత్రువు లుందురనియు, వారిపట్ల అంతటి అపరాధము నితడు చేయుననియు జాతకములో ఏమి సూచనలున్నవి? అని యడుగుదురేమో! హత్యలు చేయువారి ఉద్దేశములు భిన్నభిన్నములుగా నుండుననుట సుప్రసిద్ధము. కొన్ని సందర్భములలో హత్యకు తగిన ఉద్దేశమే కానరాదు. అబ్రహాంలింకనుమహాశయుని తుపాకితో కాల్చిచంపిన హంతకుని కేమి కచ్చి

యుండెను? లింకను వానికి చేసిన మహాపరాధ మేమి! సామాన్యజానపదుడుగా జనించిన లింకను అమెరికా ప్రెసిడెంటుపదవి నధిష్ఠించి లోకోత్తరకీర్తి నార్జించుట చూచి ఓర్వలేక, అట్టి మహనీయుని చంపినచో, అజ్ఞాతకులగోత్రుడైన తనపేరు శాశ్వతముగా జగత్ప్రసిద్ధి కాంచునని హంతకుడు తలచెనట! ఎంత రమ్యముగా నున్నదో ఈ యుద్దేశము? అంతయేల? కడచిన ౧౯౪౬ వ సంవత్సరమున జరిగిన కలకత్తా, నవకాళీ దురంతములలో అనవసరముగా ఘోరమృత్యువువాతైన స్త్రీలు, శిశువులు, ఎవరి కేమి అపరాధము చేసియుండిరనగలము? అసాధారణమైన భావోద్రేకము ఉన్మత్తమైన కతమున యుక్తాయుక్త వివేకము కోలుపోయిన వ్యక్తికి అపరాధము కావలయునా, కచ్చితో అవసరమా? జగత్ప్రసిద్ధుడైన మహాత్ముని జంపినచో తానొక ఘనకార్యము చేసిన ట్లగునని హంతకుడు భావించియుండునేమో? చంద్రుని షష్ట్యంశఫలమే అపరాధముగా అతనికి తోచియుండరాదా?

ఏది ఎట్లయిన కానిండు. సామాన్యముగా హత్యకు తగిన అపరాధము మహాత్ముడు చేయలేదనియు, అట్టిదోషమునకై అతని జాతకములో స్తనశల్యపరీక్ష చేయబూనుట అసంగతమనియు చెప్పుటకే ఇంత వ్రాసితిని.

## II

మహాత్ముడు హత్యపాలు కావలసియుండుట విధి యనుకొన్నచో, హంతకు డెట్టివాడుగా నుండవలయు నను ప్రశ్న యున్నది. ఈ విషయమున మహాత్ముని జాతకమున సూచన యేమున్నదో చూతము. ఏ గ్రహములు ఇట్టిఫలమును చూపగలిగినవో, ఆ గ్రహములకు ప్రాబల్యమో, ప్రాముఖ్యమో హంతకుని జాతకములో కానరావలయు ననుట యుక్తియుక్తము. మహాత్ముని జాతకమున జ్యోతిశ్చక్రమందలి ఏ ప్రత్యేక భాగలు విషమఫలమును సూచించినవో, వానితో హంతకుడు కాబోవువాని జాతకగ్రహాదులకు సన్నిహితసంబంధము సయితము రావలసినదే. ఈ దృష్టితో పరిశీలింతము.

(i) ఆయుధప్రహారమును ప్రేరేపించిన గ్రహము కుజుడు. కుట్రతో మోసమును మేళవించి హత్యకు సాయపడిన గ్రహము ఇంద్రుడు. ఈ రెండు గ్రహములకు హంతకుని జాతకమున ప్రాధాన్య ముండితీరవలెనని ఊహించుట సమంజసము. అందులో, కుజుడు తన నైజమైన సైనికధర్మమును చూపువాడుగా నుండక, నైచ్యస్వభావమును చూపుస్థితిలో, ఇంద్రుని సాచివ్యములో ఉండుట ప్రకృతకథ కత్యంతావశ్యకము. ఉద్రిక్తస్వభావము వచ్చుటకు జలరాశిలో కుజుడుండవలయును. కర్కాటకము లగ్నమై, దానిలో ఇంద్రకుజు లుండగల్గినచో సరిపోవచ్చునేమో? కాని, ఇతర సాక్ష్యమును చూతము.

(ii) మహాత్ముని జాతకములో హత్యాసహాయమునకు సాయపడిన గ్రహము ఇంద్రుడని కనుగొన్నాము. ఈ రెండింటి సమష్టిప్రభావమును భచక్రములో ఏస్థాన మాకర్షించినదో, ఆప్రదేశమునకు హంతకుని జాతకములో విశిష్టమైన గొప్ప విలువ యుండవలయు నని ఊహించుట తప్పుకాదు.

| | రా. | భా. | క |
|---|---|---|---|
| ఇంద్రస్థానము ... | ౦ | ౧౮ | ౨౬ |
| హత్యాసహాయస్థానము... | ౬ | ౯ | ౪౯ |
| మొత్తము ... | ౬. | ౨౮. | ౧౫ |
| పైరెండింటి మధ్యబిందువు (Centre of gravity) | ౩. | ౧౪. | ౭ |

అనగా, హత్యాసహాయముయొక్కయు, ఇంద్రునియొక్కయు పరస్పరసంబంధమువలని ప్రభావము పరిపూర్ణముగా వ్యక్తముచేయుగల భచక్రప్రదేశము కర్కాటకరాశిలో ౧౪ వ భాగ యనుట! ఈ భాగకు హంతకుని జాతకములో ప్రాధాన్యము తప్పనిసరియని భావించుట సహేతుకముగా నుండగలదు. అనగా, ఈభాగ లగ్నకేంద్రమో, దశమకేంద్రమో కావలసియుండును. ఇట్టి పరిస్థితులలో జనించిన వ్యక్తికి మహాత్ముని జాతకమందలి వాగ్దానమును చెల్లించు శక్తి యుండుట అసంభావ్యము కాదు—ఇతర కల్యాణగుణము లన్నియు సమకూరినచో!

(iii) జాతకములో ప్రత్యక్షశత్రుస్థానాధిపతి కుజుడనుట చదువరులు మరచియుండరు. శత్రువు,

అనగా హంతకుడు—చేసిన కార్యములో హింసాత్మక మగు కుజధర్మ మున్నది. కాని, ఆకార్యము సాధించిన పద్ధతిలో కుజస్వభావము లేదు. మోసముతో సమీపించి, భక్తునివలె నటించి, అదాటున తుపాకి ప్రేల్చుటలో శుక్రస్వభావ మున్నదేకాని, కుజస్వభావము కానరాదు. అనుటచే, హంతకుని స్వభావములో కుజధర్మము, వ్యాపారములో శుక్రధర్మము ఇమిడియున్నవి. అనగా, లగ్నముపైన కుజునికిద, శమస్థానముపైన శుక్రునికి, స్థితివలననో, ఆధిపత్యమువలననో ఏదోరీతిగా అధికారము లేనిచో ఈఫలము సిద్ధించదు. ఇతరవిధముగా సాధించిన సాక్ష్యముతో దీనిని సమన్వయముచేసినచో, ఇంద్రకుజాలు కర్కాటకలగ్నములో, శుక్రుడు మేషమునందు దశమకేంద్రములో ఉండుట సమంజసమని తోచును.

(iv) మహాత్ముని జాతకమునందలి మృత్యుసహమవింటి స్థానముతో సయితము సన్నిహితసంబంధము గల జాతకయోగములతో హంతకుడు జనించవలయు నని మన మూహించుట సులభము. క్రూరగ్రహవేధమో, క్రూరసహమసంయోగమో హంతకుని జాతకమునుండి మహాత్ముని జాతకమునకు రావలసియుండును. లేనిచో, మృత్యుఫలమును అత డెట్లు ఉద్బోధింపగల్గును?

(v) శస్త్రప్రయోగమును సూచించు కుజుని స్థానము మహాత్ముని జాతకములో తులారాశిలో ౧౫ భాగలు ౩౮ కలల పట్టు. ఈ భాగ హంతకుని జాతకచక్రములో ప్రాముఖ్యము నందుటసయితము అత్యావశ్యకము. హంతకుని స్వభావమో, సంస్కారమో తెలుపు యోగ మా స్థానములోనికి రావలసియుండును. అటు కాదేని, కుజుడు సూచించు శస్త్రప్రయోగము చేయుటకు వలయు సంస్కారము హంతకుని కెట్లు రాగలదు?

(vi) మారకధర్మము గల మహాత్ముని రాహువుయొక్క స్థానము సింహరాశి నాల్గవభాగ, మరణసమయములో కుట్రకు సంబంధమున్నదని సూచించు వృశ్చికరాశినాల్గవభాగ—ఈ రెండింటితో హంతకుని జాతకగ్రహములతో, లేక చలితగ్రహములతో సన్నిహితసంబంధము తప్పనిసరిగా కానరావలసియుండును.

(vii) మహాత్ముడు జనించినపుడే హంతకుడు జనించుట అసంభవముగదా? తరువాత ఎప్పుడో జనించు వ్యక్తి హంతకుడుగా ఏర్పడవలె నన్నచో, మహాత్మునికి క్రూరదశాపరిపాకము గల కాలములోనే అతడు జనించుట యుక్తముగా నుండును. మహాత్మునికి ఆయుఃఘాతమును సూచించు గ్రహము కుజుడే యనుట మనము మరువరాదు. జన్మరవికి దేవమానదశాపద్ధతిలో చలనవశమున జన్మకుజసంయోగము ౪౧ వ సంవత్సరపు వయస్సులో రాగలదు. ఆకాలమున జనించిన వ్యక్తి మహాత్ముని రవిని (జీవుని) హరించుశక్తి కలిగియుండుటలో వింతలేదు. ఇట్లనుటచే, ఆసంవత్సరమున పుట్టినవా రందరు హంతకధర్మమును పొందగలరని నా అర్థము కాదు. గ్రహవైషమ్యము గల కాలములో, చేసిన పనినుండి ప్రాపంచికముగా సౌఖ్యము కాని, అప్పుడు జనించినవారినుండి సామాన్యముగా మేలుకాని మనకు దొరకుట దుర్లభము. తన జాతకములో శుక్రుడు చెడిన వయస్సులో పుట్టిన కన్యకను పెండ్లాడిన వరునికి వైవాహికజీవితములో సౌఖ్యము సున్న. అంత ఏల? దైనికచారమువలన రవివైషమ్యము కల దినమున అధికారమునకు వచ్చిన ఉద్యోగినుండి సేవకుడు కొరవితో తలగోకుకొన్న ట్లుండును. సర్వసామాన్యముగా జీవితములలో ఇట్టి అనుభవములు మనకు సులభముగా గోచరించుచున్నవి. ఇదే ధర్మమునే మహాత్ముని జాతకమునకు సయితము మన మన్వయించవలసియున్నది.

రవికుజవైషమ్యము గల సంవత్సరములో జనించినవా రనేకు లుందురు. వారిలో ఎవ్వనికైన మహాత్ముని జన్మరవికి వేధాస్థానములో కుజు డుండెనేని, ఆ కుజునికి ఇంద్రసంబంధము కలిగెనేని, అట్టి కుజుడు నీచస్థితికి పాల్పడెనేని, ఇట్టి పరిస్థితులలో కర్కాటకరాశిలో కుజనవాంశ యగు ౧౮ వ భాగ ప్రదేశము లగ్నముగా ఏర్పడెనేని, అట్టి వ్యక్తికి హంతకస్వభావ మేల రాకూడదు? మనము పైన ఊహించిన ఇతరధర్మములు సయితము ఆవ్యక్తిజాతకమున కలవడినచో, దుష్పరిణామమున కవకాశము సమృద్ధిగా లభించదా? ఇట్టి వ్యక్తు లెందరుండగలరో, పాఠకమహాశయులే ఊహించుకొనగలరు.

(viii) ఒక చిన్న ఆక్షేపము రావచ్చును. మహాత్ముని ౭౫ సంవత్సరముల వయస్సున చలితరవి జన్మబుధసంయోగము సంభవించును. ఆ బుధుడు అష్టమాధిపతి అగుటచే, ఆ సంవత్సరమున జనించినవాడే హంతకు డేల కారాదు! అనవచ్చును. ఆయుధ ప్రయోగముచే మరణము రావలసినప్పుడు కుజుని సంబంధము కావలయును కాని బుధుని అనుగ్రహ మక్కరయుండదు. ఇంతేకాదు. ౭౫ వ వయస్సున చలితమృత్యు (అష్టమ)భావమునకు వేధ యేమియు నుండదు. ౪౧ వ వయస్సులో చలనవశమున ఈ భావము కర్కాటకరాశిలో ౧౦½ భాగకు రాగలదు. అగుటచే హత్యాసహమముతో కేంద్రసంబంధ మప్పుడు దీనికి లభించుచున్నది. హంతకు డాకాలములో జనించుట యుక్తియుక్తముగా నుండును.

మరియొక విశేషము. ఆవయస్సులోనే వర్ణ ద్వేషవాదులగు దక్షిణాఫ్రికావాసుల అనూయకు పాత్రుడై మహాత్ముడు సత్యాగ్రహము చూపి కారాగారనివాస మనుభవించుట ! అది యట్లుండె.

ఇపుడు తేలిన సారాంశ మిది. ఈక్రింద వివరించిన జాతకధర్మములు కల వ్యక్తియే హంతకుడుగా నుండగల డని మహాత్ముని జాతకమునుండియే సూచన లగుపడుచున్న వనుట—

౧. లగ్నము కర్కాటకరాశిలో ౧౪ వ భాగ ;

౨. కర్కాటకరాశి ౧౦-౧౧ భాగలలో లగ్నములో కుజస్థితి ;

౩. కుజునికి ఇంద్రగ్రహసంబంధము ;

౪. దశమస్థానముపై శుక్రుని యాజమాన్యము ;

౫. సింహరాశి ౧౬ వ భాగ,
వృశ్చికరాశి ౧౭ వ భాగ
సింహరాశి ౪ వ భాగ
వృశ్చికరాశి ౪ వ భాగ
వీనితో గ్రహసహమముల సంబంధము ;

౬. మహాత్ముని ౪౧ వ సంవత్సరపువయస్సులో —అనగా, ౧౯౦౯-౧౯౧౦ వ సంవత్సరమున— జననము.

హెచ్చుప్రయాస కేమంది ఇంతమాత్ర మూహింపగల్గితిమి. త్రిస్కంధపండితులగు శాస్త్రజ్ఞులు పరిశోధించిరేని, ఇంకను కొన్ని విషయములు దొరకవచ్చునేమో ! ఇంతటితో చాలించి, మనము ఊహించిన ధర్మములు హంతకమహాశయుని జాతకములో కానవచ్చునా యని పరీక్షింతము.

III

జాతకశాస్త్రాభిమానము గల నామిత్రులు కొందరు చాల ప్రయాసపడి నాథూరాంవినాయకగాడ్సే జాతకమునకు వలయు సామగ్రిని సేకరించి దయతో నాకు బంపిరి. ఈసామగ్రి ఏడెనిమిది నెలలకు పైబడి నావశములోనుండినా, హత్యాభియోగవిచారణ న్యాయస్థానములో జరుగుచుండిన కాలమున దానిని ప్రచురించి విమర్శించుట పాడికాదని ఊరకుంటిని. గాడ్సే హంతకుడుగా తీర్మానింపబడి, ఆతీర్మానమును ఖండించుటకుగాని, దయాభిక్షమును కోరుటకుగాని, అతడే నిరాకరించుటచే, ఇపుడిది ప్రకటించితిని.

ఈమహనీయుడు ౧౯౧౦ వ సంవత్సరమున మే నెలలో ౧౯ వ తేదీనాడు పూనానగరప్రాంతమందలి 'బారామతి' అను గ్రామములో సూర్యోదయాదిగా ౬½ గడియలకు—అనగా, ౮-౪౬ *A m.* (*L. M. T*) జనించెనట ! ఈ ఆధారమున గుణించిన సాయనజాతకకుండలి ఇది—

| | | | |
|---|---|---|---|
| | X౬-౩౦<br>సు౧౨-౫౭ | శ ౦-౧౩<br>ర ౨౬-౧౫<br>రా ౨౭-౨౬ | బు౬-౪౯<br>(వ) |
| | నాథూరాం<br>వినాయకగాడ్సే<br>జాతకము<br>(సాయనము) | | కు౧౦-౪౫<br>I ౧౪-౦<br>ఇ ౧౬-౧౬ |
| వ ౭౫-౪ | | | హర్ష (వ)<br>౧౬-౨౧ |
| | పుణ్య (వ)<br>౧౭-౩౯ | చ౧-౫౪<br>గు౪-౫౩<br>(వ) | |

ఈ చక్రమునందలి గ్రహాదిస్థానముల నొక్క మారు తిలకించిరేని, మనము ఊహించిన ధర్మములు—ఇంచుమించుగా అన్నియు—స్పష్టముగా కానవచ్చుచున్నవని సహృదయులు గుర్తింపగలరు. కావున, చర్వితచర్వణముగా మరల వానిని చర్చించుట అనవసర ప్రసంగ మగు నని తలచి మానితిని.

పైజాతకసామగ్రిని నాకు పంపిన నామిత్రము వ్రాసిన లేఖలో జాతకుని స్వభావమును తెలుపు ఈ క్రిందివాక్యము లున్నవి:—

"త్వరగా కోపము వచ్చును. కాని పైకి చూపడు. కోపము వచ్చినపుడు శాంతముగా నుండును. పెద్దమనుష్యుడుగా కానవచ్చును. చాలా తెలివితేటలు గలవాడు. వాగ్ధోరణి అద్భుతముగా నున్నది. మాటలతో ఎదుటివానిని తనతో ఏకీభవింపజేయు శక్తి కలదు. గొప్ప పట్టుదల గల వ్యక్తి. వివాహము లేదు. తల్లిదండ్రు లున్నారు. ౧౯౨౯ లో మెట్రిక్కుతో చదువు చాలించి పబ్లికుజీవితములో దిగెను. ౧౯౩౯ లో మొదటిసారి కారాగారవాసము ననుభవించినాడు. ౨౪-౩-౪౮ లో 'మారుతి' అను దినపత్రికను ప్రకటించ నారంభించెను. ౩౦-౧-౪౯ తేదీనాడే అరెస్టు అయినాడు."

సంక్షిప్తముగా ఉన్న నేమి, పై వర్ణనము జాతకుని స్వభావాదులను ముద్దుగా చిత్రించినది. దీని సమర్థమున గ్రహయోగాదు లేమనుచున్నవో, పరికింతము:—

(౧) నీచకుజునికి, మాయానియగు ఇంద్రునికి నెలవగుమనే లగ్న మున్నది. కుజుని ఘాతుకత్వము, ఇంద్రుని మాయ—ఇవి కరగించి పోతపోసి తీర్చిన విగ్రహమా ఈ లగ్నము! లగ్నము కుజనవాంశ; లగ్నములో నున్నవాడు కుజుడు; ఈ కుజునితో లగ్నాధిపతియగు చంద్రునికి కేంద్రఘర్షణము. త్వరగా కోపము రాదా మరి? కాని, లగ్నములో నున్న ఇంద్రుడు కనుకట్టు కట్టి ఆకారగోపనము చేయగలడు. శుక్రుడు దశమ కేంద్రములో నున్నాడు. పెద్దమనుష్యుడుగా ఏల కానరాకుండును? విక్రమస్థానాధిపతియై స్వక్షేత్రమందున్నవాడు బుధుడు. వీనికి గురుచంద్రులనుండి ప్రబల మిత్రదృష్టి! తెలివితేటల కేమికొదవ? రవివరుణుల అనుకూల్యదృష్టి ఉపజ్ఞాయుతమైన గొప్పసంకల్పశక్తిని ప్రసాదించినది. ఇక, వాగ్ధోరణిని అడుగవలయునా? బుధుని స్నేహదృష్టిలో నున్నవాడు శుక్రుడు రసికశిఖామణి. రమ్యముగా మాటలాడు నేర్పున్నది. లగ్నమందలి ఇంద్రుడు ఇతరులకు 'టోపీ' వేయు శక్తిని అనుగ్రహించినాడు. మాటలతో ఎదుటివారిని వశముచేసుకొను నేర్పున్నచో ఆశ్చర్యమేమి? పంచమరాజ్యాధిపతియై లగ్నమందున్న కుజుడు యోగకారకుడు. నీచుడైన నేమి, శక్తికేమియు లోపముండదు. స్థిరరాశిలో నున్న రవి (సంకల్పకారకుడు) గొప్పపట్టుదల స్వభావమును సూచించును. 'మురారి' మార్గమును చూపు వరుణుడు కళత్రభావమున నుండుట; కళత్ర కారకుడగు శుక్రుని పై రవికి అర్ధకేంద్రవిషమదృష్టి - ఇది వివాహాభావమునకు కారణము లైయుండును. మాతృభావము (చతుర్థము), పితృభావము (దశమము)-వీనికి శుభగ్రహాశ్రయ ముండుటచే జాతకుని మాతాపితృస్థానములకు దోష మెట్లు వచ్చును?—అనగా, ఇట్టిపుత్రుని పడయుట దోష మనుకొన్నచో, అది తప్పు! (౨) గ్రహసంయోగము లన్నింటిలో ఇంద్రకుజసంయోగమునకు పాశ్చాత్యపరిశోధకులు మహాదుష్ఫలమును నిర్ణయించినారు. ద్రోహచింతనము, మాయదారితనము, అసభ్యములగు కోరికలు, అసాధ్యఫలవాంఛ, తలకెక్కిన ఆత్మవిశ్వాసము, స్వకార్యనాశనపద్ధతి, పరార్థధ్వంసన కుతూహలము, దుర్విషయవ్యామోహము, అపారభావోద్రేకము, అసంగతములైన ఊహాపోహలు—ఇత్యాదులీయోగపు ఫలమట! జాతకమున పరస్పరము ౭ భాగల దూరములో నున్న ఈ గ్రహముల సంయోగము పూర్ణ ఫలము నీయనేల? అనవచ్చును. కాని, ఈ రెండు గ్రహముల పరిమధ్యమందే లగ్నముండుటచే దుష్ఫలము పూర్ణముగా చెల్లిరాగల దనవచ్చును. స్వభావమున కెంత మంచి యోగ్యతాపత్రము నిచ్చినవో యీ గ్రహములు! (౩) చతుర్థకేంద్రములో నున్న గురుచంద్ర సంయోగము జూడుడు! ఇది రమ్యమైన 'గజకేసరీ'యోగము! పరాశరుడు దీనిని చాల పొగడినాడు.

"గజకేసరిసంజాతః
స్తేజస్వీ ధనవాన్ భవేత్,

మేధావీ గుణసంపన్నో
రాజప్రియకరో భవేత్." (బృహత్పారాశరహోర)

అహో! ఎంత గుణసంపన్నుడో? ఎంత రాజప్రియకరుడో ఈ జాతకుడు? ఈ 'గజకేసరి'యోగమున కేమి గ్రహచారము పట్టినదో గమనింపుడు! లగ్నాధిపతి చంద్రుడు తులానవాంశ (వర్గోత్తమాంశ)లో నున్నాడు. ఈచంద్రునిపైన శుక్ర, రవి, బుధ, కుజుల దృష్టి యున్నది. ఇది యొక రాజయోగమే. కాని, నీచకుజుడుసయితము తులానవాంశలోనే ఉండుట.

"లగ్నపాఠదావేకాంశగా క్రూరహత్యా."
(జాతకతత్త్వము)

లగ్నాధిపతియు, కుజుడు ఏకాంశలో నుండినేని, జాతకుడు క్రూరహత్యల జేయవచ్చునని పై సూత్రము. చంద్రుడు 'ఉత్తమశ్లోకతను' ఈయగలవాడేకాని, కుజసంబంధము హెచ్చై చెడినాడు. ఇట్టిచంద్రుని ఆశ్రయించియున్న బృహస్పతి మంచి ఫలము నీయగలడా? ఈబృహస్పతికి సయితము కుజకేంద్రవేధ యున్నది అగుటచే, ఈ'గజకేసరి'కి సహజసుగుణము లేమి యుండినా, అవి వక్రమార్గము నంటినవి కాబోలు? హత్యాకార్యమునకు ఈయోగము 'జవాబుదారీ' కాకపోవచ్చును. కాని, జాతకమండలి ఇతరగ్రహాదులవలని వైషమ్యమును ఈయోగము మాన్పజాలనిచో, దీని ప్రాశస్త్య మేమి?

అనేకఘోరహత్యలు చేసి ఉరికంబ మెక్కిన 'లాంద్రు' మున్నగువారి జాతకములు పెక్కులు సంపాదించి, విమర్శించి, ఈ'గజకేసరి' వానిలో అనేకుల జాతకములలో నున్నదని చూపి, విమర్శకాగ్రేసరుడగు కార్టరు మహాశయుడు ఈ యోగమునకు సాధుశీలమును కాని, ధార్మికస్వభావమును కాని ఇచ్చుశక్తి అనంత లేదనియు, సులభమార్గమున కార్యసాధనమో, ధనార్జనమో చేయుటేర్పును, తక్కువ పరిశ్రమతో ఉన్నతస్థితికి రావలయు నను ఆశయు ఈ యోగమునకు సామాన్యఫలము లనియు సోదాహరణముగా తీర్మానించినాడు. మహాత్ముని ప్రాణము తీయుటకు సులభమార్గమును 'మోటు' కుజానికి ఈ యోగము నేర్పించెనేమో? లేక, చేసిన పని ధర్మమే అనునమ్మకమును జాతకుని కిచ్చినదా యీయోగము?

(౮) ప్రశంసలో నున్న హత్యావిషయమున కటకరాశి ౧౮ వ భాగ కెంత ప్రాముఖ్య మున్నదో కనుగొంటిమి. లగ్నము స్వభావమును తెలుపవచ్చును కాని, ఆ మాత్రముననే హత్యకు జాతకు డుద్యోగించి కార్యమును సాధించునని చెప్పుట న్యాయ్యమా అనవచ్చును. సత్యమే! ఉద్యోగము దశమకేంద్రమునకు చెందినది. ఈజాతకమున దశమకేంద్రము మేషరాశి ౨౮ భాగలో కుజుని యాజమాన్యములో నున్నది. ఇంతేకాదు.

"చరేతు సప్తమం భాగం
స్థిరేష్వపిచ పంచమం,
ఉభయే నవమంచైవ
వదశీతిముఖం విదుః"

అని, మేషరాశి ౮ వ భాగకు వినాశము సూచించు ధర్మము కలదని ప్రాచీనుల మతము. మారిన్ లెమిస్ పండితుని మతములో క్రౌర్యము, సాహసము, ప్రాణవిధ్వంసకశక్తి, ఇవి మేషరాశి ౮ వ భాగకు ధర్మములు. ఈదుష్టభాగలో నున్న దశమకేంద్రము జాతకునితో హత్యాకార్యము చేయించుటలో ఆశ్చర్యమేమి?

ఇచట ఒక విశేషము. కర్కాటకరాశి ౧౮ వ భాగ లగ్నముగా నుండినా, ఉద్యోగభావము (దశమకేంద్రము) మేషరాశి ౮ వ భాగప్రాంతములో నుండు గల్గుట ఉత్తరా క్షాంశ ౧౯-౨౧ భాగల భూప్రదేశములో జనించినవారికిమాత్రమే! కావుననే, పూనాప్రాంతములో జనించిన వ్యక్తికే ఇట్టి భాగ్యము బ్బుట!

(౯) ఈ జాతకునకు పుణ్యసహమము వృశ్చిక రాశిలో ౧౨ భాగలలో కలదు. దీనిపైన సహా కుజుని అధికారమే! (ఇదే మహాత్ముని జన్మ కుజస్థాన మని చదువరులు గుర్తించియుందురు.) ఈ సహమబిందువుపై ఇంద్రుని మిత్రదృష్టి యున్నది. ఈ జాతకములో ఇంద్రు డేమి స్వభావమును సూచించునో, మన

13

వింతను మనసే గుర్తించియున్నాము. ఆ స్వభావము ఫలించుట కనుగుణమైన పరిస్థితులలో, పూర్వపుణ్య ఫలము కుజుని ఆజ్ఞలో, ఇంద్రుని అనుగ్రహమున, పక్వమై ప్రారబ్ధరూపమున ఏ సంస్కారమును సూచించుచున్నదో, దానిని ఈ సహమబిందుస్థానము వ్యక్తము చేయుచున్నది.

(౬) జాతకునికి అసాధారణమగు చొరవ కలదనుట స్పష్టము. లగ్నమందలి కుజుడే దీనికి కారణము కావచ్చును. కాని, ఈ ఘోరకృత్యము జరిగినతరువాత, సామాన్యులవలె తప్పించుకొనిపోవుటకుగాని, హత్యావిచారణసందర్భమున న్యాయస్థానమున నిర్దోషి నని వాదించుటకుగాని జాతకుడు ప్రయత్నించలేదని వింటిమి. కడకు దయాభిక్షమునైనా కోరలేదట! దేశమునకు తా నేదో గొప్ప సేవ చేసినా ననియు, తత్ఫలముగా అపకీర్తిపాలయినా—కడకు తన ప్రాణములనే కోలుపోవలసివచ్చినా—మంచిదే అనియు, జాతకుని అసాధారణబుద్ధికి తోచినదేమో ? రవితో మిత్రదృష్టి నార్జించి మకరరాశిలో ౨౫ భాగలలో నున్న వరుణ గ్రహమును చూడుడు. మకరరాశిలో ౨౫ వ భాగ పరహితార్థమైన స్వార్థత్యాగమును తెలుపునట్టి దని మారిస్ వెమిస్ పండితుని సిద్ధాంతము. ఇట్టి భాగలో నున్న వరుణుడు లగ్నమందలి ఇంద్రుని సమసప్తక ప్రతికూలదృష్టికి ఫలముగా, ఇట్టి స్వార్థత్యాగాభాస బుద్ధిని అనుగ్రహించియున్నాడుకాబోలు !

ఇంతే కాదు. కటకములో ఇంద్రు డున్న ౧౪ వ భాగ స్వధర్మనిర్వహణశక్తిని తెలుపునట. ఇదే రాశిలో కుజు డున్న భాగ క్రౌర్యములోటి నిర్దయాత్మకతను సూచించునట్టిది. ఈ కుజుడు నేర్పినది ఘాతకధర్మము. ఈ ధర్మమునే నిర్వహించవలె నని ఇంద్రుని ఉపదేశము ! ఈ కార్యములో ఆత్మనాశనము సంభవించినను, అది స్వార్థత్యాగరూపమైన ఉత్తమగుణమే యని పొగడుచు వరుణుడు భుజముల తట్టుచున్నాడు!! వృశ్చికరాశిలో ౨౯ వ భాగ 'అపరిహార్యపురాతనదుష్కర్మానుభవమును' తెలుపునట్టి దని ఎరుగుదుము. జన్మరవిని కబళింపబోవుచున్న మహారాహువు జాతకములో ఈ విశిష్టభాగకు ఎట్టయెదుట (వృషభరాశిలో ౨౮ భా, ౨౬ కలలు) నిలిచియున్నాడని గమనించినచో, ప్రారబ్ధప్రవాహ మే రీతి ప్రవహించుచున్నదో సూచన రాగలదు. ఏమి యీ విచిత్రగ్రహఫలసమ్మేళనము !

ఒక్క మనవి. ఈ జాతకము సర్వాంగిముగా దోషభూయిష్ఠ మని, గుణరహిత మని చెప్పుట నా ఆశయము కాదు. అది సృష్టిధర్మమునకే విరోధము. ఏస్వభావమైనా పరిస్థితుల ననుసరించి, కాలదేశపాత్రముల కనుగుణముగా, సుగుణముగనో, దుర్గుణముగనో కానవచ్చుట నైజము. ప్రశంసావిషయమున కాలకర్మసంయోగప్రభావ మెంత విశదముగా కానవచ్చునో చూచుటే మన ఉద్దేశముకనుక, ఆ దృష్టితోనే మన మిది చర్చించుచుంటి మని పాఠకమహాశయులు మరువరాదు. దృష్టిభేద మున్నచో, అది వేరు మాట.

IV

గాడ్సేజాతకమున గ్రహాదియోగములు ప్రకృత విషయమున సూచించిన వాగ్దాన మెట్టిదో చూచితిమి. దేవమానదశాపద్ధతి ననుసరించి ౧౯౪౮ వ సంవత్సరమునకు చలితగ్రహాదులు ఏరీతిగా ఫలపరిపాకమును చూపునో పరిశీలించవలసియున్నది. మరియు, ౩౦-౧-౧౯౪౮ నాటి దుష్ఫలపరిణామమున కేమి సౌకర్యము లబ్బినదో చర్చించుట శాస్త్రదృష్టితో లాభకారి.

"యదుపచిత మన్యజన్మని
శుభాశుభం తస్య కర్మణః పక్తిం
వ్యంజయతి శాస్త్ర మేతత్
తమసి ద్రవ్యాణి దీపఇవ." (లఘుజాతకము)

# ఆద్యంతాలు

[కథానిక]

●

శ్రీ క్రొవ్విడి లక్ష్మన్న

మర్నాడు తండ్రితద్దినం. ఆమాటా యీమాటా అనుకునే సందర్భంలో పార్వతిని తీసుకువస్తానన్నాడు వెంకట్రావు. పార్వతి అతని పినతండ్రి కూతురు. తండ్రిప్రసాదం తనలాగే చెల్లెలుకూడా పుచ్చుకోవా లని అతని ఆరాటం.

"ఆముండవ్వా తెత్తేవంటే గంటేస్తాను జాగర్త" అంది తల్లి.

"పోనీ అమ్మా. యీ ఒక్కరోజే కాదుటే!"

"చాల్లే నేర్చుకుపోయేవ్ పాత్తు! కాకపోయినా యిదేం పోయే కాలంరా నీకూ?"

"మళ్లీ రేపుసాయంత్రం బస్సులో పంపించేస్తానులేవే" అంటూ ప్రాధేయపడ్డాడు.

"నోరు ముయ్యి!"

అతని తండ్రే మూసేసుకున్నాడు నోరు పదహారేళ్ల క్రితం. వెంకట్రావు తాతగారు పోయిన కొత్తరోజులవి. పంపకాల విషయంలో అద్దాలబీరువాదగ్గిర వచ్చింది పేచీ. అసలుకి అది వివాదపడవలసిన విషయమే కాదు. అయినా అంతలో అల్లుకుపోయింది. పట్టుదలలు పెరిగిపోయేయి.

నిజం చెప్పవలసివొస్తే, చిన్నకోడలు ముచ్చట పడుతోందిగదా అనే ముసలాయన చేయించేడు ఆ బీరువా. తమ్ముడికి వెళ్లడమే సబబు అని వెంకట్రావు తండ్రీ అన్నాడు. అదుగో వాచ్యంగా ఆయన ఆ మాట అనడంతోనే వెంకట్రావుతల్లికి అరికాలిమంట నెత్తికి ఎక్కింది. ఇంటికి పెద్దకోడలిని, నామాట అంతా మన్నించాలి అంటూ పరవళ్లు తొక్కింది. ఆ పెదధర్మమా అని అన్నదమ్ములకి మరి మాటలు లేకుండా పోయేయి. చివరికి తమ్ముడు పోయినప్పుడు కూడా మాటవరసకి వెళ్లి పరామర్శించేడేగాని, యింకె లాగానూ ఆదుకోలేకపోయేడు వెంకట్రావునాన్నగారు. పెనిమిటి పోయిన పదోరోజు దాటకుండా మరదలూ భవబంధాన్ని బాపుకుంది. నాటినుంచీ ఆ ఒక్కగాని ఒక్క కూతురూ మాతామహుల యింట్లోనే పెరుగుతూవచ్చింది. ఆ చెల్లెల్ని చూడాలంటే నాటికీ నేటికీ సుగ్రీవాజ్ఞ వెంకట్రావుకి. అయినా అడపా దడపా తల్లికనుచాటుగా చూసివస్తూండేవాడు.

చెల్లెలు రాకుండానే, తద్దినం పెట్టుకుని మర్నాడు మెయిలులో వెళ్లిపోయేడు అతను నౌకరీలోకి. పరాయివూరు వచ్చేడు అన్నమాటే కాని మనస్సు మనస్సులో లేదు. దృష్టి అంతా చెల్లెలిమీదికే పోతోంది. వొచ్చి పదిరోజులు అయినా స్వాస్థ్యం కుదరలేదు. ఓనాడు రివ్వున సైకిలు తొక్కుకుపోతూవుంటే ఆశాత్తుగా కంటపడింది ఆమె, కుడిచేతిలో పుస్తకాలు గుండెలమీదుగా వొంచిపట్టుకుని మరో నలుగురు పిల్లలతో కాలేజీకి వెళుతూను. ఇద్దరూ గతుక్కుమన్నారు. కాలేజీచదువుకోసం వచ్చిందిట ఆమె. హాస్టలులో ఉంటున్నాను అంది. తను ఫలానావారి యింట్లో గది అద్దెకి తీసుకొన్నాను అన్నాడు వెంకట్రావు. ఏడ్నర్థానికి కలుసుకున్న వాళ్ల ఆనందానికి అవధి లేదు. పార్వతి కొన్నాళ్లపాటు ఆ వూళ్లో స్థిరంగా వుంటుం దని తెలుసుకుని వెంకట్రావు కొండ అందుకున్నాడు. ఆ రోజునుంచీ పార్వతికి తండ్రిలేని లోటే అవుపించ లేదు. పాఠాలు మొదలుకుని పట్టుచీరెలవరకూ అన్నీ అతను ఓకంట కనిపెడుతూవుండేవాడు. నిజమే. తోబుట్టువులు లేనివాళ్లకి గాని అర్థంకాదు ఆ ఆరాటం!

చెల్లెలికి ముద్దూ ముచ్చటా తీర్చడంలో తల్లికి పంపవలసిన సొమ్ము అప్పటప్పట వెనకపడుతూ వుండేది. "ఊఁహ్. ఆ పల్లెటూళ్లో అమ్మకి ఖర్చేమిటి?" అనుకుని సమాధానపడేవాడు. ఆ మాటలో నిజం లేక

పోనూలేదు. అయితే, యీసారి గత రెణ్ణెల్లనుంచీ యింటికి ఎఱ్ఱని ఏగానీ పంపలేకపోయేడు. క్రిందటి నెలలో పార్వతి పుట్టినదినం వచ్చింది. పంపుదాం అనుకున్న ముప్పైరూపాయిలూ పట్టుచీరకి సరిపోయేయి. ఈ నెలలో ఏవో పుస్తకాలూ, నోట్సూ మింగేసేయి ఆ నాలుగురాళ్లూను. పోనీలే అనుకున్నాడు అతను.

తల్లిమాత్రం అంత చులాగ్గా పోనివ్వలేదు. గత పదిరోజులబట్టీ కరణంగారి యింటికి వెళ్లి బీటు పోస్టుమేనుగురించి వాకబుచేస్తూనే ఉంది. వాడూ బీటుప్రకారం బుధవారం, శనివారం వచ్చేడు; కరణంగారి యింట తిని, ఎంగిలిపట్టు అలికి వెళ్లిపోయేడు. వచ్చిన రెండుసార్లకీ యిచ్చింది ఒక్క వారపత్రిక మాత్రమే.

"తపాలావాడు కాని తినేసేడా" అని అనుమానించింది అనుభవజ్ఞ. "సుబ్బు పేకయ్యడూ, సూరన్నగారూ" అని అంతలో సమాధానపడింది. తన కొడుకు దూబరాకర్చు పెడతాడంటే కలలోనూ నమ్మదు ఆమె. నమ్మలేదు. మరి రెండు నెలల నుంచీ యీ నాగా లేమిటి చెప్మా? ఉత్తరముక్కా లేదు. ఇంకోనాడు రాసేడా ఏమిటి? అయినా అవో అర్థణాదండుగ ఎందుకూ.? కొంపదీసి, వొంట్లో ఏమైనా నజ్జుగా వుందా? ఛీ! అవాచ్యపుమాటలు అనకోకూడదు. ఆలోచిస్తూ నట్టింటి గడపలో కూర్చుంది ఆమె, వీభూతిపండూ వొత్తులబుట్టా దగ్గిరెట్టుకుని. "బుధవారానికి బుధవారం ఎనిమిది, లక్ష్మివారం తొమ్మిది, శుక్కురారం పది..." సొమ్ము రావలసిన వ్యవధి మించిపోయి ఎన్నాళ్లయిందో లెక్కపెట్టుకుంటోంది.

"ఏమమ్మోయ్, జ్ఞాపకం ఉన్నానా?" అంతలో వచ్చింది వీథిగుమ్మంలోంచి పలకరింపు.

"ఓహోహో! వెంకన్న బుగతా! రావయ్యా, రా. అలాగ ఆ బల్లమంచంమీద కూర్చో. ఈమధ్య కాశీరామేశ్వరాలు పట్టిపోయావుటగా? ఊఁ, ఏమిటి విశేషాలు?"

"ఏమున్నాయీ?"

"అన్నట్టు మావాణ్ణి చూసేవా? నీ కసలు జ్ఞాపకంకూడా ఉండీ యేడుస్తుందా యేమిటిలే. ఊళ్లోకి వచ్చేక యిహ బావుండదని ఓసారి పలకరించిపోదాం అని వచ్చివుంటావు. అవునా?"

"ఆఁ, చూడకేం? మీవాణ్ణి కలుసుకున్నాను."

"ఊఁ"

"నెమ్మదిగానే ఉన్నాడు."

"అంటే!"

"ఏమీలేదు. బాగానే ఉన్నాడు అంట."

పొడిగా వెకిలినవ్వు నవ్వేడు వెంకన్న బుగత. ఆమెకి ఆ నవ్వు వికృతంగా కనిపించింది. అయినా యింకేమయినా వివరిస్తాడేమో నని ఓనిమిషం పస్తాయించింది. బుగత మరి మాటలేకుండా మొలనుంచి పొడుంకాయ తీసి ఎడమచేతిలో రాల్చుకున్నాడు, ఓచిట్టెడు పట్టు. ఆమె యింక పట్టలేకపోయింది.

"భోగట్టా చెప్పమంటే అలా నీళ్లు నములుతూ కూర్చుంటావేమిటయ్యా!" నిలవదీసి అడిగింది. దాంతో చెబుదామా వద్దా అనుకుంటూన్న బుగత ఒక నిర్ధారణకి వచ్చేసి—"చెబుతున్నాను కదూ" అన్నాడు. అంతలో ఏదో గొంతుకకి అడ్డుపడినట్టయి మరి మాట రాలేదు అతనికి. కాస్త చిన్నగా దగ్గి, గొంతుక సవరించుకొని, "అయితే ఒకటి అయివుంటుంది లెండి" అని తమ్మందంగా ఆరంభించేడు.

"ఏమిటయ్యా అయేది ఒకటీ రెండూనూ. పోనీ నెమ్మదిగా ఉన్నాడా, మూలుగూ ముక్కిరింతా లేకుండానూ?"

"ఆరోగ్యంగానే వున్నాడు, దానికేం?... అహఁ, ప్రయివేట్లు చెబుతూఉంటేనూ, పాపం, ఆ కంపెనీలో యిచ్చిన జీతపురాళ్లు అటి రావడం లేదు కాబోలు అనుకున్నాను."

"నీకు తెలియనిది ఏముంది చెప్పూ, వెంకన్న మామా? పిడికిలి మూసివుంచినంతసేపే...అక్కడ వాడూ, యిక్కడ నేనూ, కుంభాలు వెళ్తాలా? పాపం, ఏమి కష్టపడిపోతున్నాడో, వెర్రిబాగులవాడు!"

"కష్టం ఫలిస్తూన్నట్టే వుందిలేవమ్మా" వెంకన్న బుగత శ్లేషించేడు. ఆమెకి బోధపడ్లేదు.

"ఏమో, ఏం ఫలించడమో క్రిందటి నెల ఏమీ పంపలేదు. ఈనెల—యివాళ అప్పుడే యిరవైయొక్కటి కదూ?"

"అయితే నేం లేవమ్మా. క్రిందటి నెలలో నే కదూ శిస్తులు వసూలుఅవుతా. కాకపోయినా అతని నౌఖరీమీద నే ఆధారపడ్డట్టు మాట్లాడతా వేమిటి?"

"అ దేమన్నమాట, వెంకన్నమామా...పోనీలే. అయితే,యింతకూ,ఎవరి యింట్లోనట చదువు చెప్పడం? ఊరల్లా తిరిగి అట్టే పొద్దుపోయిందాకా పేముకలు సున్నం చేసుకోడం లేదుకదా ?"

"అతను పెళ్లి నక్కరలేకుండా ఆ పిల్లే అతని బసకి వస్తూంటుంది."

"ఏమన్నావూ ? పిల్లా ? ఎన్నేళ్లుంటాయి ?" ఆశ్చర్యంగా అడిగింది ఆమె.

"ఏం చెప్పమన్నావమ్మా. ఈడొచ్చిన పిల్లేను. ఈ పల్లెటూరిలో వున్నందుకు మనలాంటి ఛాందస కుటుంబాలలోనైతే ముగ్గురుబిడ్డల తల్లి అవును. ఇన్నోటి దెందుకూ ? ఒక్క బల్లే అడ్డు అనుకో. యిటో కుర్చీ అటో కుర్చీ వేసుకుని కూర్చుంటారు. చేతివేళ్లు తగులుతునే వుంటాయి-పుస్తకాలూ కలాలూ అటూ యిటూ మారుతూన్నప్పుడు..."

అసలే విస్తుబోయిన ఆమెకి యీమాటతో నడ్డి విరిచినట్టయింది.

"అయ్యొయ్యో, అయ్యొయ్యో, నీకళ్లు వెలిసిపోను! ఫెళ్ళని యెంతమాట అన్నావు!"

"మీ రిలా యిదవుతారని నాకు తెలుసును. కాని యేం చెయ్యనూ ? చిరకాలంనుంచీ కుటుంబాన్ని యెరిగివున్న వాణ్ణికనక, ఆదిలోనే చెబితే మంచిది అనుకున్నాను. వెళ్ళొస్తాను, మరీ. ఊరికే గుంజాటనపడి కుంగిపోకమ్మా; తనే దిద్దుకుంటాడు నాలుగురోజులు పోతేను...ఏదో చిన్నతనం..."

బుగతకిర్రు చెప్పుల చప్పుడు క్రమేణా శ్రుతి పుటంనుంచి దూరం అవుతూన్నకొద్దీ, ఆమెగుండెలు తీవ్రంగా కొట్టుకోసాగేయి. కళ్లు మసకలు కమ్మినట్టనిపించింది. "చెడిపోవడానికి ఎంతసేపు కావాలి? అందులోనూ దూరాభారాన ఉన్నాడు. కాస్త ఓకంట కనిపెట్టడానికి యింక పెద్దదిక్కు యెవ్వరూ లేరు కదా." తను యిలా అనుకొంటూన్నకొద్దీ యీమాటలే ఎవరో స్పష్టంగా చెవిలో చెబుతూన్నట్టు తోచింది. కంగారు హెచ్చింది.

ఆ సాయంకాలం యింక ఆమె ఫలహారం చెయ్యలేదు. చీడీమీది బల్లమంచం నడివాకిట్లోకి యీడ్చుకుని నడుము వాల్చింది. కొంజా గుమ్మంతలుపు గడియ వేస్తూఉంటే శిష్టకరణాల కుర్రాడు కనిపించేడు, సినీమాపాట పాడుకుంటూను. ఆవిడబిళ్లు ఝల్లుమంది, వాణ్ణి చూసేసరికి. ఔను మరి. అవ్వూళ్లో అందరికీ తెలుసును, వాడు సినీమాలు మరిగి చెడిపోయినాడని. చివరికి ఆ చెడిపెమ్మండ—కిరస్తానీ మేష్టరుకూతుర్ని— కూడా తీసుకొచ్చి దగ్గిర పెట్టుకున్నాడు. ఔలే! మూడుమైళ్ల దూరంలో కాని సినీమాల్లేని ఆ పల్లెటూరే అలా తగులడితే, వీథికి మూడుసినిమా లుంటే పట్నాల సంగతి వేరే అడగాలా ?

ఆమెఊహ గాలిపడగలాగా ఎగురుతోంది. కన్ను మూడుచుకున్నా కునుకు రావడం లేదు. ఏదో చెప్ప రాని దిగులూ. మనసుకి ధైర్యం చెప్పుకోడానికి కాబోలు "ధర్మరాజు జూదం" పాడడం ఆరంభించింది :

"అలికి విడిచిన గడప దాటడే రాజా
మునిమాపు ముంజూరు దూయడే రాజా
బియ్యమ్మ మునిపంట బట్టడే రాజా"—

అంత అలా ఆచారవ్యవహారాలు పాటించినా అవసలు తప్పేయి కావు. ఈరోజుల్లోనా ? అందులోనూ హోటేలులో తినేవాడికి ఆచారంకూడానా. ఏ జాతీ కులమూ లేనిదో పట్టుకువోస్తుంది భోజనం డబ్బాల్లో పెట్టి. అప్రాచ్యపుముండ! అదుగో ఆ ముక్క అనుకు నేసరికి మళ్లీ పరిపరివిధాల పోయింది పాడుమనస్సు. ఎన్ని సారులు ప్రయత్నించినా తన కళ్ల ముందు ఒకటే దృశ్యం ప్రత్యక్షం అవుతోంది—ఓ చిన్న టేబిలూ, యివతల కుర్చీలో వెంకట్రావు, అవతల దాంట్లో అదీ—సిబ్బిలా బొట్టయినా లేకుండా మొహం, కుడిచెంపని ఎర్రటి తూరీగపిన్నీనూ, జడలో కాగితపు మల్లిపువ్వులదండ, గొరకచీపురుకట్టలాగ సగంసగం వేసుకొని వొదిలేసిన అజడకి ఓ రంగుగుడ్డ పీలికాను !

ఏదో సెపంమీద నిమిషనిమిషానికీ చేతులు కలుస్తూన్నట్టూ, మాటలసందర్భంలో విరగబడి నవ్వుతూన్నట్టూ, ఆ కేరింతాలలో ఆచిన్నదాని జుట్టు వెంకట్రావుమొహాన్ని తాకినట్టూ, వెంకట్రావు పిల్లదానిచేతులు పుణికిపుచ్చుకుని—

అవ్వ! ఆమె గుండెలు గొల్లుమన్నాయి. ఛళ్లున తెల్లవారింది. వెంటనే పెళ్లి చేసెయ్యాలని నిశ్చయించింది. టెల్లిగ్రాఫు యిచ్చి తెప్పించింది వెంకట్రావుని. ఆడవాళ్లు అనుకోక నేపోవాలి గాని అనుకొంటే మరి అంతరాయం అంటూ వుంటుందా ? అందులోనూ ఆమెకీ.

## ౨

మూడునెళ్లూ పడిపోయేయి. పదహారురోజుల పండుగా అయింది. మంగళహారతిపళ్లెం పట్టుకోడానికి మాత్రం పార్వతి నోచుకోలేదు. మరో పదిహేను రోజుల్లో అతను తిరిగి ఉద్యోగంలోకి వెళ్లి పోయేడు—మళ్ళీ యే మొహం పెట్టుకు చెల్లిని చూస్తావా అని యెంతో తపన పడుతూను. చివరికి గుండె రాయిచేసుకుని, కచేరీకి పోతూ పోస్టలుకేసి తిప్పేడు సైకిలు. తలుపులు మూసివున్నాయి. అప్పటికి అప్పుడే అంత మందీ కాలేజీకి వెళ్లి పోయేరు.

సాయంత్రం యింటికి వొచ్చేసరికి పార్వతే వచ్చి నిరీక్షిస్తోంది, అతని రాక తెలుసుకుని. చూసీ చూడ్డంతోటే యిద్దరి కంటికొలకులూ చెమ్మగిల్లేయి. ఏవో విషయాలు చెప్పి వాపోతూ—

"చూడు, పార్వతీ, వాకెమ్మకే అయిపోయినాను. ఇంతకూ యింటిపరిస్థితులు నీకు తెలియనివి కావు కదా. చివరికి ఓ శుభలేఖకూడా..." గద్గదికతో అర్ధోక్తిలోనే ఉండిపోయింది మాట.

"ఇంతకూ నేను నోచుకోలేదు అన్నయ్యా. అసలు నువ్వు పిలిచినా వొచ్చే స్థితిలో లేను. తాతయ్యగారికి..."

"అదేమిటి ? నెమ్మదిగా వున్నారా ?"

"ఇప్పుడు నెమ్మదిగానే ఉన్నారు. కాని ఉపద్రవమయిన జబ్బు చేసింది. టెలిగ్రాం వస్తే వెంటనే బయలుదేరి వెళ్లేను."

"ఎంతపనీ ? నాకో టెలిగ్రాం అయినా యిచ్చేవు కావేం తల్లీ ?"

"ఇస్తేమట్టుకు ఆ పల్లెటిమ్ముండావూళ్లో అంది చచ్చిందా ఏమిటిలే. శుభమా అని కార్యం తలపెడితే పిడకలవేట్లాటలాగ యిదొకటీ అని దొడ్డమ్మకి కోపం రావడానిక్కాని... అసలు అన్నీ నేనే మానుకోవలసి వచ్చింది, డాక్టర్ని పిలిపించడం దగ్గిర్నుంచిన్నీ. ఇంతకూ అమ్మమ్మ తప్ప యింకెవరున్నారు చెప్పూ, అన్నా, కొంపలోనూ ?"

"పాపం, ఏం అవస్థ పడిపోయేవో. దొడ్డమ్మ ఏదో అనుకుంటుం దని ఊరుకున్నావా, వెర్రితల్లీ. కాకి చేత కబురంపితే రెక్కలు కట్టుకు వాలనూ ? పదహారు ఏళ్ళయి చూస్తున్నావుకదా, నా సంగతి తెలియదుటమ్మా ?"

ఇంకా ఏదో మాట్లాడుకుంటూనే వున్నారు. అంతలో పోస్టలుబంట్రోతు వొచ్చి టెలిగ్రాం ఒకటి ఆమెకిచ్చి వెళ్లిపోయేడు.

సరి. ఉన్న ఊపిరీ పోయింది. కోలుకుంటున్నారనుకున్న తాతగారు కాస్తా పరమపదించేరు.

## 3

అతనికి గడ్డుసమస్య పట్టుకుంది. చెల్లెలికి ఉన్న ఒక్క పెద్దదిక్కూ పోయె. తను ఆరాటపడడమే గాని భారీగా యేపనీ స్వతంత్రించి చెయ్యడానికి అవకాశం లేదు. ఇహను, చెట్టుమీది పిట్టకయినా ఆధారం అంటూ వుంటుంది కాని ఆ పిల్లకి మాత్రం అంత లేదు. మొగాడు కాదు కదా బతకలేకపోతాడా అనుకోడానికి. ఈడు వచ్చిన పిల్ల. ప్రాజ్ఞత కలిగింది; చదువుకుంటూన్నదీని. పోనీ అని ఆమెకి ఏదైనా స్వతంత్ర జీవనోపాధి కల్పిద్దాం అంటే, తనది జాతిగా హీన కులమూ కాదు; అలాగని ఏమంత గొప్ప కుటుంబమూ కాదు. మొదటి తరగతివాళ్లు చేసిన పనులు ప్రపంచపు దృష్టిలో లెఖ్కకి రావు. ఇంక రెండవ తరగతి వాళ్లా ? వాళ్లు యేం చేసినా మా బాగే. అసలు వాళ్లు యేమి చేస్తే అదే ఆదర్శం అయికూర్చుంటుంది. ఎటొచ్చీ, మధ్యతరగతివాళ్లకే యిబ్బందులు ! ఉన్న వొరవళ్లకి తలవెంట్రుకవాసి వారా అనుపిస్తే, ముక్కువేలెట్టుకుని కనిబొమ్మలు ముడివేసి చూస్తుంది లోకం. ఈసడిస్తుంది. ఛీ అనేస్తుంది. వెలివేస్తుంది. అందులోనూ తనశాఖలో జాతిగానేను !

ఎన్నివిధాల చూసినా పెళ్లి చేసెయ్యడమే మంచిదిగా అవుపించింది. కాని అదిమాత్రం అంత సులువుగా అయ్యే పనా ? కాస్త ఢోక్కశుద్ధి ఉన్నవాడు కట్నాలు కక్కమంటాడు. ఎలాగో సరిపుచ్చుకుందాం అని వెతికితే దొరికేవాడు ఏ పౌరోహిత్యుడి కొడుకోను ! అన్నా, యేం చిక్కు వచ్చిపడింది !

పదిహేనురోజులు బుర్ర చించుకున్నా దారీ తెన్నూ ఏమీ కనిపించలేదు. చివరికి, కాగల కార్యం గంధర్వులే తీరుస్తారు; చదివించడమే ఉత్తమం అనుకున్నాడు. అయితే చెల్లెలు బి. ఏ. దాకా చదవాలి అంటే ప్రస్తుతం తెస్తూన్న జీతపురాళ్లు చాలవు. ఏం దారా అనుకుంటూంటే మిలిటరీవాళ్ల ఆఫీసు కనపడింది. నాలుగుసంగతులూ అడిగి తెలుసుకుని అందులో చేరిపోయేడు. జరుగుబాటు బాగానే వున్నట్టు తోచింది ఆదిలో. కాని పట్టుమని పదినెలలయినా

తీరక్కుండా పయిదేశాలకి పోవలసివచ్చింది. తల అమ్ముకున్నాక తప్పుతుందా?

౪

అయిదేళ్లు విదేశపర్యటనం చేసి చివరికి తన దేశం చేరుకున్నాడు వెంకట్రావు. మూడురోజులయి అదే ప్రయాణం స్వగ్రామానికి. వేసవికాలమేమో, విపరీతమయిన ఎండా, గాడుపూను. ఎన్ని లైంజూసులు తాగినా నాలిక ఎండిపోవడమే! ప్రక్కనున్న ఆయన్ని అడిగి కూజాలో నీళ్లు తాగేడు. దాంతో పరిచయం ఏర్పడి మాటలు ఆరంభం అయినాయి, యిద్దరికీని. ఆయనా తన ఊరివాడే నట. రానురాను ఊరిభోగట్టాలలోకి దిగిపోయింది బాతాఖానీ.

"పోనిస్తురూ! రత్నంలాంటి పిల్ల, అగ్నిహోత్రంవంటి మనిషీని"—

వెంకట్రావు తదేకధ్యానంతో వింటున్నాడు, ఎప్పటికయినా ఆ ఉదంతంతాలూకు ఆచోకీ దొరుకుతుందేమో నని. అవతల ఆయన రేడియోవార్తలలాగ చెప్పుకుపోతున్నాడు.

"రామరామ! ఆమె ఇంటరో ఏదో పాసయిందిట కూడాను. అలాంటి దాన్ని యింట్లో పెట్టి బయట తాళం వేసుకుపోతాడు...అదికాదు, అంత అనుమానపు మనిషి ఎందుకు చేసుకోవాలీ అంట...రెండో పెళ్లి కూడా కదా...అద్దెకి ఉన్నవాళ్లం మేం చస్తున్నాం ఆ యిల్లాలిపాట్లు చూడలేక..."

"ఆయనపేరేమిటి అన్నారూ?"

ఏదో చెప్పేడు. వెంకట్రావుకి తెలియలేదు.

"అహాఁ, అలాగ చూస్తారేమిటి? ఇదివరకు ఆ కంపెనీలో హెడ్గుమాస్తాగా ఉండేవాడు-రావుగారని, ఎరగరూ?"

తన పేరే ఉటంకించేసరికి గతుక్కుమన్నాడు వెంకట్రావు. అంతలో సర్దుకుని—"తెలియకేం? అయిదేళ్లయింది కాదూ అతనా వుద్యోగం మానేసి?" అన్నాడు గంభీరంగానూ.

"మరేం, అతని పినతండ్రి కూతురేనట. అన్నయ్యే ఉంటే అంత అన్యాయం జరక్కపోను అని ఆఅమ్మాయి అహర్నిశలూ వాపోతూవుంటుంది."

అలాగ ఆయన కాఅంత భక్తిచేసేసరికి చెంప ఛెళ్లుమన్నట్టు అనిపించింది వెంకట్రావుకి. త్రుళ్లిపడ్డట్టు రైలూ ఆగింది. "దువ్వాడా" అని నిద్రమత్తుగా పోర్టరు కేక వినపడింది. ఇద్దరూ అపాళంగా దిగిపోయారు. సామాను కూలీనెత్తిన ఎక్కించుకుని అలా వెళుతూ ఉంటే ఎవరో ఒకామె పక్కనించే వెళ్లినట్టయింది. నాలుగుగజాలు ముందుకు సాగి వెనక్కి తిరిగి చూచిందేమోకూడాను. వెంకట్రావూ చూచేడు అప్రయత్నంగానూ. ఎవరో. గేటువగ్గిర టిక్కట్టు యిచ్చేస్తూఉంటే ఎవరు చెప్మా అనిపించింది మళ్లీని. ఎరిగివున్న మొహంలాగే తట్టింది. కూడావున్న ఆయన్ని సామాను చూస్తూఉండమని చెప్పి ప్లేటుఫారంమీదికి వచ్చేసరికి—సరి, రైలు కదిలిపోయింది. దూరంగా యింజనుకి పక్క పెట్టెకిటికీలోంచి ఆమెకళ్లు ఎవరినో వెతుక్కుంటూన్నట్టు అవుపించేయి. పోలిక అనిందో. లేదో స్టేషను శూన్యం అయిపోయింది.

చెల్లి! చెల్లే. ఇంకా అనుమానం ఎందుకూ? ఎంతెలాగ అయిపోయిందీ కంపలాగ! తనూ మారిపోయేవుంటాడు; లేకపోతే బిక్కుమాలిన కాకీగుడ్డలలో స్వస్వరూపం అణగారిపోయి అయినా వుండాలి. ఇందాకా వెనక్కి తిరిగిచూసింది కదూ! అన్నయ్య అవునా కాదా అని ఆమెకీ సందేహం కలిగివుంటుంది. పాపం! రెయిల్లో ఎక్కి దూరదూరంగా పోతూఉన్నా తన మూర్తినే ఎదరగా, దగ్గిరగా చూసుకుంటూ ఉంటుంది. సన్నిధికి వచ్చి ఉండీకూడా సవ్యంగా నోరారా పలకరించే యోగ్యత లేకపోయింది. వెధవ అనుమానం, మొహమాటమున్నూ. నాలికచివరికి వచ్చింది మాట. అప్పుడే "పార్వతీ" అనేస్తే తీరిపోను! గుండెల్లో ఆరాటం గొంతుకదాకా వచ్చీ కూడా వాగ్రూపం ధరించిందికాదు. ఎంత పొరపాటు జరిగిపోయిందీ! ఏవూరు వెళుతోందో! మళ్లీ ఎప్పుడో కలుసుకోవడం. కాకపోయినా తన అత్తవారి ఊరు ఆమె ఎందుకు వచ్చింది చెప్మా!

౫

అరనిమిషంలో అమాంతంగా ఆకాశం కూలి తన నెత్తినే పడినట్టనిపించింది వెంకట్రావుకి. క్షణంలో ఆవరించుకుపోయిన కంగారు కప్పిపుచ్చుకుందాం అని ఎంత కష్టపడి యత్నించినా, కత్తి వేస్తే నెత్తురు లేకుండానిర్విణ్ణం అయిపోయింది మొహం. కూడా ఉన్న మిత్రుడుమాత్రం కులాసాగా కబుర్లు చెబుతూనే ఉన్నాడు. జట్కా సాగిపోతూనేఉంది. జట్కా ఒకలెఖ్ఖా, రెయిలే రొగిరిపోయింది రెండునిమిషాల

త్రితం రెక్కలు కట్టుకుని. ఎండలకి బీటలువారిన పొలాలని ఆనుకొని, ఒక్కటి ఒక్కటిగా మలుపులు తిరుగుతూ రోడ్డమ్మటే జట్కా సాగిపోతూన్నా, వెంకట్రావుదృష్టిలోమాత్రం ఆ రెయిలే—అప్పుడే ఆగినట్టు కాస్సేపూ, బరువుగా ముందుకి సాగిపోతూన్నట్టు మరికాస్సేపూ, అంతలోకే తనని ఆఖరిసారిగా చూద్దాం అని రెక్క వాల్చలేదన్న నెపంమీద నిలుచుండిపోయినట్టు మరికొంతసేపూ—అలాగ అవుపిస్తూనేవుంది. దానిమీదే మనస్సు పూర్తిగా లగ్నం అయివుండేమో, మొదట కలిగిన ఒక చిన్న భావానికి ఓచిలవా, ఆచిలవకి ఓపలవా అలా అలా అల్లుకుపోయినాయి; తన గుండెల్లోనే తన కో ప్రపంచం ఏర్పడి అందులో కొందరు మనుషులూ, కొన్ని పరిస్థితులూ ఏమిటో ఏమిటో గోచరింపసాగేయి. వాటిలోనే జీవించసాగేడు అతను. భౌతికంగా చూస్తే అతను జట్కా యొక్క ఒక మూల్లో వెళుతున్నాడన్నమాటే గాని, నిజం చెప్పవలసివస్తేమాత్రం అతను అక్కడ తప్ప యింకెక్కడయినా వున్నాడు, జట్కాతోటీ అందులో ఉన్న ఆ మిత్రుడితోటీ సంబంధం లేకుండాను. వాగుడుకాయలాగ మాట్లాడుతూన్నవాడు అకాత్తుగా మూగనోము పట్టేసరికి, ప్రక్కని ఉన్నాయన ముదలకించేడు "ఏమండోయ్ రేడియోస్విచ్ ఆఫ్ చేసేసేరు?" అని. తను తూష్ణీంభావం వహించేడని ప్రక్కనిఉన్నాయన గమనించేడని తెలుసుకుని మరీ యిదయిపోయేడు వెంకట్రావు. ఏదో అందాం అనుకున్నాడు సర్దుబాటుగాను; కాని కడుపులో పుట్టిన మాట గొంతుకలోనే చచ్చిపోయింది. ఓ నవ్వు నవ్వేసి కానిచ్చేద్దాం అనుకున్నాడు. పళ్లు యిగిలించినా నవ్వుమాత్రం అయింది కాదది. అంతలో యిల్లు చేరుకోవడం, నలుగురిలోనూ పడిపోవడమూ జరిగిపోయినాయి.

తన కడుపులో ఊహాలనిబట్టీ ఏవో సంగతిసందర్భాలు తనకి గోచరిస్తాయేకాని, పయివాళ్లకి తెలుస్తాయా ? ఇంట్లోవాళ్లు మామూలుగానే పలకరించేరు, మాట్లాడేరు. తన అంతఃకల్లోలం వాళ్లకి తెలియకుండా వుండాలనీ, వాళ్లు ఎప్పటిలాగ మెసులుకోవాలనీ ప్రయత్నమూ చేసేడు వెంకట్రావు. మెదడులో జనించే గభీరఆలోచనాతరంగాలవల్ల హృన్మానసిక డోలాయమానం అయేటప్పుడు కలిగే పరిస్థితే అంత. జనసమూహంలో జీవి సంచలిస్తూన్నట్టే అవుపిస్తూ, సాధ్యమైనంతవరకూ తనమట్టుకు తాను ఒంటరిగా ఉండాలని యత్నిస్తుంది. అప్పుడు—ఏకాకిగా వుంటేనే ఆ సమయంలోకాని, క్షుభితహృదయానికి శాంతి కలగదు.

తనకి తనే మిగిలిపోతాడు వెంకట్రావు. ఎంతసేపూ ఇంకొకరి జోలి లేకుండా తాను ఒక్కడే ఉండాలి అనిపిస్తోంది అతనికి. ఇరుగూ పొరుగూ ఎవరైనా పలకరించడానికి వస్తే, పెళ్లైనప్పట్నుంచి చూస్తున్నారుగదా, ఎందుకు యిలాగ చుట్టేసేస్తారు చెప్మా అని విసుగే పుడుతోందికాని, కలకాలానికి కంటపడ్డాడని చూడవొస్తున్నారనిపించడం లేదు. అదో జబ్బు. పిచ్చిలాంటిది. మామూలుగా మాటలూ చేష్టలూ ఎలాగఉన్నా, ఒంటరిగా ఉందాం అన్న యత్నమూ, అలాగ ఉండడమూ పిచ్చితరగతిలోవే. అందుకే ఆ లక్షణాలు పదిమంది దృష్టినీ ఆకర్షిస్తాయి. పట్టి అప్పచెప్పేస్తాయి. వెంకట్రావూ అలాగే దొరికిపోయేడు.

"ఏమర్రా, అల్లుడు రాలేదూ యింకానూ ?" అన్నారు మామగారు, పెట్టెని విప్పడానికి వెళుతూను.

"బావ కనిపించేర్రా తమ్ముడూ"అని కూతురు పృచ్ఛించింది, బాఘా పొద్దుపోయి వొచ్చిగా తమ్ముణ్ణి మందలించడం మానేసి. రాత్రి భోజనాల దగ్గిరా, తదనంతరంకూడా వెంకట్రావునోటమ్మట మాటలు ముడిగానే వచ్చేయి. ఇల్లాలు యింటిపనులు చక్కపెట్టుకుని వచ్చేసరికి,తను అవతలపక్కకి వొత్తిగిలి పడుకున్నాడు.

"తమలపాకులు వేసుకోరూ ?"

... ... ...

"పాదాలు వొత్తనా?"

... ... ...

"ఎడంచెబ్బ తీసేసేరు, పాపం!"

ఆమె ఒక్కర్తే మాట్లాడింది.

మర్నాడు ఓపెద్దమనిషి "అల్లుడుగా రొచ్చేరుటగా"అంటూ పలకరించేడు మామని.

"ఇప్పుడే వెళ్లేడండీ, ఎటోను" అనక తప్పింది కాదు ఆయనకి. అప్పటికప్పుడే మూడు కేంపులయినా వెళ్లొచ్చేడు, వెంకట్రావు—చుట్టుపట్ల తన బంధువులు ఉన్న ఊళ్లన్నీ జ్ఞాపకంటూ చేసుకుంను. చెల్లెలిఅచోటే మాత్రం అందకుండా వుంది. ఎక్కడికి వెళు

తున్నాడో ఏమిటో! సూర్యోదయాన్ని కనిపించిన మనిషి మళ్ళీ అర్ధరాత్రిదాకా అవుపించకుండా పోతున్నాడు. "కాలుగాలిన పిల్లి. ఏమిటో యీ వాటం?" అని అనుమానాలు బయలుదేరక పోలేదు శ్వశుర గృహంలోను. మరో రెండురోజులకి ఊరే గుప్పుమని పోయింది పుకార్లతోటి. వెంకట్రావు అప్పటికి రెయి లెక్కి రెండురోజుల మధ్యాహ్నం అయింది. వెళ్లి నప్పుడు ఎవ్వరితో చెప్పనూలేదు. భార్యమాత్రం అడిగింది—

"ప్రయాణ మేమిటి?" అని.

"ఆఁ, సెలవు అయిపోవచ్చింది."

౬

"అప్పుడే వెళ్లిపోయేట్టా?" అన్నారు అమ్మలక్కలు.

"ఎంతండీ! సెల్లాళ్లు సెలవ అన్నమాటేగాని యిట్టే తిరిగిపోతాయి రోజులు" అంది వెంకట్రావు భార్య, సహనభావం మూర్తీభవించినట్టు.

"ఎంచక్కా అన్నావే తల్లీ! ఇంకా నిన్నగాక మొన్న బండీలోంచి దిగుతూన్నట్టు మాకే అనిపిస్తూ ఉంటేనూ?" అంది ఓ అచ్చక్క.

"మరేం. నేతిలో యీగని తీసి పారేసినట్టు ఎలాగ అనేసిందో! అయినా యిప్పటి కాలపువాళ్లకి మొగుడంటే బొత్తిగా చీపురుకట్టను లెక్క!" అంది మరో బుచ్చక్క.

ఇంతో నాలుగురోజులు పోయేసరికి ఆమె జాతకం చూపించడంకూడా అయింది. ఊళ్లో వున్న పుకారు స్థిరమయిన భోగట్టా అయి ఊరుకుంది.

"వాళ్ల అమ్మాయిని తీసుకువెళుతున్నాట్టగా, పెనిమిటీ?" అన్నాడు ఒకాయన, ఓనాటి ఉదయాన్నే చెంబుపుగట్టున మొహం కడుక్కుంటూ, గుణ్లు తేలేసి నాలిక సగం తెగేలాగ గీస్తూనే.

"విఘ్నేశ్వరుడు పెళ్ళికి వెయ్యివిఘ్నాలు! ఈ వూరినుంచి అమ్మాయిని యెక్కించుకుని బండీ కదలాలి, అప్పుడు అనుకోవాలి"

యింకో ఆయన సమాధానం చెప్పేడు.

"అహఁ, పట్నంలో యిల్లు కుదిరిందిటగనూ?"

"తీసుకువెళ్లాలని ఉంటే యిన్నాళ్లూ యిల్లే కుదరకపోయిందీ! అసలు పెళ్లాన్ని వొదిలేసినవాడికి యిల్లెందుకూ అంట!" కంఠంలోతు నీళ్లలో నుంచుని జపం చేసుకుంటూన్న సిద్ధాంతి యీమాట కాస్తా అనేసి, సగంలో ఆపేసిన జపం తిరిగీ ఆరంభించేడు.

"షడ్వైశ్వ దిశే యాళ్చ దేవతాః యాః సంతి తే..."



# కీ. శే. వంగోలు వెంకటరంగయ్యగారు

శ్రీ మోచర్ల రామకృష్ణయ్య

ఆంధ్ర విద్యావయోవృద్ధులలో గణ్యులగు శ్రీ వంగోలు వేంకటరంగయ్యగారు విరోధివత్సర జ్యేష్ఠశుద్ధ త్రయోదశి గురువారము (9-6-49) సాయంకాలము నాలుగుగంటలకు దమ దైహికజీవితము నుపసంహరించిరి. తెలుగువారికి వీరి పేరు సుపరిచితము. దిక్ప్రదర్శనప్రాయముగా వీరి జీవితవృత్తాంతికముల నియ్యెడ సంగ్రహించుచున్నాను.

ప్రభవసంవత్సరమున ఆశ్వయుజ బహుళ పంచమి (18-10-1867) సూర్యోదయకాలమున మృగశీర్షా నక్షత్రయుక్త తులాలగ్నమున వీరు జన్మించిరి. అప్పటి గ్రహస్థితి సూచించు రాశిచక్ర మిది :

| | | | |
|---|---|---|---|
| | | చం | |
| కే<br>గు | | | |
| | | | రా |
| | శ | ల శు<br>కు బు<br>ర | |

ఇరువదిరెండేండ్లలోపలనే వీరు బి. ఏ. బి. యల్. కాగలిగి నెల్లూరులో న్యాయవాదిత్వములో ప్రవేశించి, యించుమించుగా నేబదిసంవత్సరముల కాలము వ్యావహారికజీవితము సాగించి యెనుబదిరెండవయేట స్వర్గీయులైరి. వీరు సహస్రచంద్రదర్శనము కావించు భావగలిగిన పుణ్యపురుషులు.

“ఆయుః పితృదిశేశాభ్యాం-ప్రథమయోః ఉత్తరయోర్వా దీర్ఘం” అను జైమినీయసూత్రముల ననుసరించి లగ్నాష్టమాధిపతి చరరాశియగు తులలో నుండిన హేతువే వీరి కీ పూర్ణపురుషాయుష్యము నిచ్చినది కాబోలు !



వీరు బహుభాషాకోవిదులు. ఆంధ్రాంగ్లగీర్వాణములయందును, గన్నడము అఱవము హిందీ ఉర్దూ పారసీకభాషలయందును వీరి ప్రజ్ఞ పరిణతమైయుండెను. వీరు ‘భారతి’ వంటి సుప్రసిద్ధసారస్వతపత్రికాముఖముల ప్రకటించిన వ్యాసములు శతాధికములు. త్రిలింగరాష్ట్రమునంగల ద్వాదశలింగములు,— రామాయణములోని వానరులు నరులు కారా ? నిజముగా వానరులే యగుదురా ? అను విషయములనుగూర్చియు, ప్రాచీనకాలమున సంస్కృతము దేశభాషగా నుండెనా ? ఆంధ్రులెవరు ? అను సమస్యల నుద్దేశించియు, ఆనందరంగరాట్ఛందము ననుసరించియు, శ్రీ పంతులుగారు వ్రాసిన వ్యాసము లమూల్యములు.

వీరు గొప్ప పరిశోధకులు. బ్రాహ్మణక్రోశశాసనము, వెలిచెర్ల శాసనము మున్నగు శాసనములను వీరు ప్రకటించిరి. చారిత్రకదృష్టితో 'కొందఱు నెల్లూరు గొప్పవారు' అను శీర్షికతో రాజమంత్రిప్రవీణ - పల్లె చెంచల్రావుగారు, వేదము వేంకటరాయశాస్త్రులుగారు, జెన్నెలకంటి సుందరరామయ్యగారు, శనగవరపు పరదేశశాస్త్రులుగారువంటి మహనీయుల పవిత్రజీవితచరిత్రములను వ్రాసి ప్రచురించిరి. మఱియు భరతముని ప్రణీతనాట్యశాస్త్రములోని చతుర్థాధ్యాయాంతర్గత తాండవలక్షణమును విలక్షణముగా వివరములతో నాంగ్లేయభాషలోని కనువదించిరి. ఈ గ్రంథమును 1936 సంవత్సరమున అన్నామలై విశ్వవిద్యాలయమున నాచార్యులుగా నుండిన మాన్యులు మహోదారాశయులు నగు శ్రీ విజయేటి నారాయణస్వామి నాయుడుగారు ప్రకటించియున్నారు. ఈ ప్రకటనము విషయమై శ్రీనాయుడుగారొనర్చిన కృషి శ్లాఘాపాత్రమైయున్నది. ఈ తాండవలక్షణాంగ్లానువాదము పాశ్చాత్యదేశములలో నాట్యవిద్య నభ్యసించు వారికి పఠనీయగ్రంథముగా నియమితమైయున్నది. న్యూయార్క్ నగరమున 1940 సంవత్సరమున నెలకొల్పబడి వర్ధిల్లుచున్న నాట్యవిద్యాకేంద్ర మొకటి కలదు*. ఆ కేంద్రవిద్యాప్రణాళికలో ఈ తాండవలక్షణము విద్యార్థిజనుల కుపాదేయమై యలరారుచున్నది. శ్రీపంతులుగారి యశఃపతాకను శాశ్వతముగా నిలుపుటకీ పుస్తక మొక్కటి చాలును.

శ్రీ వెంకటరంగయ్యగారు జననముచే నియోగులయ్యను, లౌకికముగా న్యాయవాదివృత్తియం దుండినవారయ్యు, బాల్యప్రభృతి వీరవైదికాచారనిష్ఠాగరిష్ఠులు. మడితోడక్క మంచినీరేనియు ద్రావువారు కారు. కాని సంఘసంస్కరణములపట్లగాని, తత్త్వవణులయెడగాని వీరికి ద్వేషముగాని వైముఖ్యముగాని లేదు. ఆజానుబాహులు. మంచి దేహదార్ఢ్యము కలవారు. నిరంతరవిద్యావ్యాసంగపరాయణులు. మరణపర్యంతము వీరు విద్యార్థులు. వీరి పరశ్శతవ్యాససంచయములను గ్రంథరూపముగా బ్రకటించుటకు వలయు యత్నము కావించుట ఆంధ్రుల కర్తవ్యము. ఈ యత్నము ఫలించుకేని తెలుగుసారస్వతమునకును, ఆంధ్రచారిత్రకపరిశోధనశాఖవారి సాధుపరిశ్రమమునకును నిరుపమానపరివస్య జరపుట యగు నని విశ్వసించుచున్నాను.

* *Ethnological Dance centre—New York—attached to this there is the School of Natya founded by La Meri and Ruth St. Denis.*



కథానిక:

# 'బలీయసీ కేవలమీశ్వరాజ్ఞా'

●

శ్రీ ఇ. సరస్వతీదేవి

ఆ నాడు వైశాఖపున్నమి. బ్రాహ్మణులను, బీదసాదలను ఆ ఊరి జమీందారిణి ఆదినము సత్కరించే అలవాటు. అరఎకరము ఆక్రమించిన ఆ భవనముచుట్టూ తాటియాకు పందిళ్లు వేశారు.

పాడ్యమినుండి జమీందారిణికి తీరిక లేదు. దానధర్మాలకు ఎవరికి తగినట్లుగా వాళ్లకు పట్టిక తయారుచేయించి వస్తుసామగ్రి సిద్ధపరిచింది.

పౌర్ణమినాడు తెల్లవారుజామునలేచి తలంటి నీళ్లు పోసుకుని దైనికపూజ ముగించుకొని పందిటిలో ప్రవేశించింది. సుమారు ఏడుగంటలకు సత్కారము ప్రారంభము చేసింది. బ్రాహ్మణులు మంత్రసూక్తాలు, శ్లోకాలు, పద్యాలూ చదివి ఇచ్చినవి పుచ్చుకొని దీవించిపోతున్నారు. సాధువులనూ, బీదలనూ ఆమె స్వయంగా సత్కరిస్తున్నది; కాని ఆమెవిశాలనేత్రాలు పందిట్లోకి వరుసగా వచ్చే గుంపులను వెతుకుతున్నాయి. ఆదుర్దాగా ఇటూ అటూ చూస్తూ, ఇంకా రాలేదేమని నోట్లో గొణుక్కుంటున్నది. సహస్రకిరణుడు చరచర పైకెక్కి వస్తున్నాడు. ఇక ప్రతీక్షింపలేక, "వీరయ్యా, ఇంకా చెల్లమ్మ రాలేదు. అక్కడికీ నిన్న సాయంకాలము కబురు పంపాను సుమా. నీవు వెళ్ళిస్వయంగా తీసుకురా. అద్దాలబండి తీసుకువెళ్ళు." మాట సాంతముకాక ముందే వీరయ్య కదలివెళ్లాడు.

అంగవస్త్రాల చెంబులదొంతరలు తరిగిపోయాయి. బీదల కిచ్చే ధాన్యపుబస్తాలు ఖాళీఅయాయి. రవిక పీసీల పళ్లేలు వట్టిపోయాయి. పందిట్లో జనసమ్మర్దము పలచనయింది. వెళ్లిన అరగంటకే వీరయ్య బండితో వచ్చాడు. బండిలోనుంచి ముప్ఫయియేళ్ల చెల్లమ్మ ముందుగా దిగి చేతులు పట్టుకొని రామయ్యను దింపింది. కొయ్యకాళ్లతో, చేతుల క్రింద పెట్టుకొన్న కర్రల సహాయంతో రామయ్య నిమిషానికి ఒక అడుగు వేస్తూనూ, చెల్లమ్మ అతనికి ఆసరాగా ప్రక్కనుంచి నడుస్తూనూ వస్తుంటే హృదయవిదారకమైన ఆ దృశ్యానికి జమీందారిణి కళ్లవెంట ఆపలేని అశ్రుప్రవాహము బయలుదేరినది. కొత్తగా ఆదృశ్యము చూసేవారికి కళ్లవెంట వచ్చేవి నీళ్ళు కాదు, రక్తపుబొట్లు. ఆదృశ్యము ఆమె నాలుగు సంవత్సరాలుగా చూస్తూనే ఉంది. ప్రతీఏటా గుండె పగిలే ఆ దుఃఖము ఆమెకు కలుగుతూనే ఉన్నది. ఏనాడు ఆదంపతుల దర్శనములో తన హృదయము విప్పారి ప్రేమాంకుర మేర్పడినదో ఆ వైశాఖ పున్నమి నుండి దాని స్మారక చిహ్నముగా ప్రతిఏటా బ్రాహ్మణ బీదసాదల సత్కారము ప్రారంభించింది.

* * *

జమీందారిణి శకుంతలాదేవి వేసవికాలములో తన భవనమును చల్లగా ఉంచే ఏర్పాట్లు చేయిస్తున్నది. ఫిబ్రవరి నెలలోనే 'నీలగిరి వెళ్ళటమా బెంగుళూరు వెళ్లటమా' అని ఆలోచించి ఏర్పాట్లు చేసుకునే ఆమెకు, రెండేళ్లక్రింద పెద్ద విపత్తు తటస్థించింది. బలంగా లేచి తిరుగుతూ తిరుగుతూన్న జమీందారుకు రెండు దివాల జ్వరంతో మాటనిలిచిపోయింది. స్థలము కదల్చకుండా చికిత్స చేసిచూడాలని ఘనవైద్యులయిన స్థానికులు తంటాలు పడుతున్నారు. అందుకనే పందిళ్లతోటి, తడకలతోటి ఉన్నచోటనే చల్లదనము ఆపాదించాలని సకలప్రయత్నాలూ చేస్తున్నది జమీందారిణి.

ఆ ఉదయమే మేదరిగుడిసెలలోనుంచి చెల్లమ్మ రామయ్యల జోడా జమీందారుగారింటికి తడకలు తీసు

కొని బయలుదేరింది. పల్లెపదాలతో, యౌవనపు సరాగాలతో, ఒకరి నొకరు తోసుకుంటూ, రాసుకుంటూ రాచభవనము సమీపించేసరికి ఎనిమిది దాటింది.

"పడమరన ఉన్న గదికుందర వసారా మాదిరిగా వంపుగా తడక కట్టిస్తే ఎండరొక్క తీక్షణం లోపలికి రాకుండానూ, గాలి వచ్చేటట్లుగానూ ఉంటుం"దని జమీందారిణి శకుంతలాదేవి మేదరి రామయ్యకు చెప్పి తన గదిలోకి వెళ్ళిపోయింది.

"మామా, అక్కడొక్కటీ ఇక్కడొక్కటీ గడలు పాతు. పురికొస జేబులో పెట్టుకో. నిచ్చెన వేసుకో. ఊఁ, దోవతి పైకి కట్టు..."

"చెప్పేదానివే గాని చేసేదానవా ఏమన్నా నా? గునపము తీసుకురా."

గజములోతు గుంటలు తవ్వి గడలు దింపుతున్నాడు రామయ్య. గడ్డపార తిరగవేసి మట్టితో పూడ్చినమీదట దిమ్మిసచేస్తున్నది వెల్లమ్మ. ఈ రెండూ పూర్తి చేసి రామయ్య గోడకు నిచ్చెన వేసుకున్నాడు. సుమారు పన్నెండుగజాల ఎత్తునుంచి ప్లోపు దింపుకుంటూ, ఆరేడు గజాల ఎత్తుకు తీసుకొని రావాలి. ఒక నిచ్చెన పొడుగు చాలక రెండింటిని కలిపి, తాళ్లతో గట్టిగా బిగించి కట్తున్నాడు.

"మామా, రెండింటిని—ఒకదానితో ఇంకో దాన్ని కలిపి, తాటితో గట్టిగా బిగించి కట్తున్నావు కదూ. నీ బిగింపు సళ్లిచ్చినా, రెంటినీ బంధించే తాడు బలహీనమయినా ఏ మవుతుందో ఊహించావా మామా."

"ఊహించలేం? రెంటినీ బంధించే యీతాడు సన్నగిల్లినా, బిగింపు సళ్లిచ్చినా, ఊగుతూ, ఏ క్షణానికి విడిపోతామో అన్నట్లుగా ఉంటాయి నిచ్చెనలు. నేనయితే గట్టిగానే కట్తున్నాలే."

"పై కెక్కే ముందర చెమట తుడుచనీ. గంజి నీళ్లు కాస్తా అరిగిపోయినట్లుంది అప్పుడే. కాస్త చద్ది అన్నము మూటకట్టుకొచ్చాలే. ఈ పైపు తడక కట్టిన తరువాత తిందుగాని."

"నే నొక్కన్నా?"

"నేనూను. నేనే కలిపి ముద్దలు చేస్తాకదూ?"

కూనిరాగాలు తీస్తూ నిచ్చెన మెట్లు ఎక్కుతున్నాడు. పురికొస, పెద్దకత్తి, మేకులు జేబులో పెట్టుకొని, కిందికి చూస్తూ పైకి ఎక్కిపోతున్నాడు.

"నిచ్చెన గట్టిగా పట్టుకోవే."

"గడియలో యీ తడక మేకులకి తగిలించేయి. చూద్దాము నీ పనితనము"

కిటికీలోనుంచి జమీందారిణి వీరిద్దరి కబుర్లూ వింటున్నది. వీళ్లిద్దరి సరాగాలూ చెవిన పడుతూనే ఉన్నాయి.

"ఏమిటే, మీరు మాటలతోటి పొద్దు పుచ్చుకోవటానికి వచ్చారా? పని జరగటం లేదు."

"కొరసానీ, నన్ను పనిచెయ్యనివ్వకుండా మాటలతోటే పాటలతోటీ అడ్డుపెట్టాలని చూస్తోంది. కాని, నాచేతులు పనిచేస్తూనే ఉన్నాయి." అన్నాడు పైకెక్కుతున్న రామయ్య.

"ఏయ్ అమ్మీ! నీవు సిగ్గయినా లేకుండా వాడి నెందుకు ఊరికే పలకరిస్తావు? పనికి అడ్డం కదూ!"

"అమ్మా! నామాటలు వింటుంటేగాని ఆయన పని చేయలేడు. పోనీ, కాస్త నే వట్లా వెళ్తాను; నిజంగా ప నెంత సాగుతుందో చూడండి."

"ఆఁహాఁ. అదోకటా యీ మేదరివాడికి?"

జమీందారిణిని లోపలికి పోనిచ్చి, "వాళ్లలాగ నోరుమూసుకొని చేయమంటే మనకు పని ఎక్కడ సాగుతుంది? ఎవరి గదిలో వాళ్లు కూచుని పొద్దు పుచ్చుకుంటారు. వాళ్లకూ ఎక్కువమాటలే ఉండవు. మామా, ఎక్కు పైకి."

"మాటా ముల్లే కట్టి ముసలోళ్లతో చెప్పి రెంకి భద్రాద్రి వెళ్దామా?"

"మామా, ముసలోళ్లు ఏరీ మనకు?"

"నేనా ఆపాట పాడింది? వెళ్లేటప్పుడు చెప్పటానికి, ఎక్కడయినా చూడు ముసలివాళ్లను. పోనీ లే. ఏదీ ఇంకో పదము."

"నాసిన్నితమ్ముణ్ణి నా కియ్యర రావోయి ఏడుకొండలవాడ వెంకటేశ్వరులా."

నిచ్చెనమీద కాళ్లు ఆనించి, ఒకచేత్తో మేకు పట్టుకొని, ఇంకో చేత్తో మేదరికత్తి తిరగవేసి కొట్టు న్నాడు రామయ్య. ధ్యాసంతా మేకుమీద కేంద్రీ కరించి కొట్టున్నాడు.

ఇంతలోనే పైనుంచి పెద్ద బరువు కిందపడ్డ చప్పుడు! 'అయ్యో! అయ్యో!' అన్న కేకలు పక్క గదిలో ఉన్న జమీందారిణికి వినబడ్డాయి. ఆమె యివతలికి వచ్చి చూసేటప్పటికే కూలీలంతా వాళ్ల చుట్టూ మూగారు. అందరూ ఒక్కసారే, "ఏమయింది-ఏమయింది? ఎట్లా పడ్డాడు?" అని అడుగుతున్నారు. రామయ్యరెండుకాళ్లూ మోకాళ్లక్రిందనుంచి ఊగు లాడుతున్నాయి; ముఖమునిండా రక్తము! మాట లేకుండా మూలుగుతున్నాడు.

"అయ్యో, మామా, కాళ్లు...కాళ్లు విరిగి పోయాయా!" అంటూ తడిబట్టతో ముఖము తుడిచి విసరుతున్నది చెల్లమ్మ.

అంతకు ముందు 'మన కే'మని ఘనీభవించి ఉన్న జమీందారిణిహృదయము ఆ దృశ్యానికి ద్రవిం చింది. వెంటనే కారులో రామయ్యను ఆసుపత్రికి పంపివేసి, కూడా వెళ్తానని చెల్లమ్మ ఏడుస్తుంటే బల వంతంగా ఆపుచేయించి, తానూ అక్కడే అరుగు మీద కూర్చుంది. కూలీజనమంతా చెల్లమ్మను ఓదా ర్చటములో నిమగ్నమయింది.

"అయ్యో! మామకు కాళ్లు విరిగిపోయాయి. గడ్డంక్రింద రాయి లోతుగా దిగపడిపోయింది. కింద పడేవరకూ నేను చూడనేలేదు. అయ్యో మామా!"

"ఏడవకు పిల్లా. ఇప్పుడే కట్టుకట్టి తీసుకొ స్తారు. నీవు చేసిందే మున్నది యిందులో? ఎందు కేడుస్తావు?"

"ఎంత పాటు పడ్డాడు! ఇంకా నేను అన్నము తినిపిద్దామనుకున్నాను. గంజినీళ్లు అప్పుడే అరిగి పోయాయని పిలుద్దామనుకున్నాను. అయ్యో! ఎప్పటి వలె నడుస్తాడా మా మామ? లేచిన వేళ మంచిది కాదేమో. బయలుదేరేటప్పుడు వాళ్ల పిల్ల తుమ్మింది. అబ్బా! ఎంత రక్తము కారింది!" అంటూ చెల్లమ్మ ముఖము తిరిగి పడిపోయినది.

ఇంతసేపూ మాట్లాడకుండా కూర్చున్న శిలం తలా జీవిమనసు స్పందించింది. "ఇంత ఆరాటమూ, మానసికోద్రేకమూనా? కాకపోతే ఇన్నాళ్లనుంచీ కాపురం చేస్తున్న పెనిమిటికి దెబ్బ తగిలి రక్తం కారు తుంటే మనసులో కష్టంగా ఉండవచ్చుగాని ఇ జేమిటి! వాడికముందు సంపాదించి తనను పోషించ లేడేమో నన్న భయమా దానికి?" అని అనుకుంటూ రెండుగజాల దూరాన నిల్చుని, "ఇటు చూడు. నీ పెని మిటికి కాళ్లు విరిగిపోతే, ఇక ఎట్లా నిన్ను పోషిస్తాడా అని ఏడుస్తున్నావా?" అని కొంచెము ధీమాగానే అడిగింది.

"అమ్మా, వన్నాయన పోషించలేకపోతే, నేనే పోషిస్తాను. నాకు మేదరిపని వచ్చు; తడకలు అల్లుతాను. అన్ని మేదరిసామాన్లూ తయారుచేస్తా. డబ్బు గడిస్తా. కాని, మామామ నవ్వుకుంటూ నడుచు కుంటూ మరి రాగలడా? అని. అమ్మా, నేను వచ్చి నాలుగేళ్లయింది. ఒక్కనాడయినా నేను మా అమ్మ గారి గూడెము పోలేదు; మా మామ తాను కలుపుకొని అన్నము తినలేదు. అయ్యో! మామ కెంతపాటి దెబ్బ తగిలిందీ?"

"మీకులంలో మారుమనువు లేదూ?" అన్నది జమీందారిణి.

"అమ్మా, మారుమనువు ఎవరికి కావాలి తల్లీ! మీ పాదాలకు మొక్కుతాను. మా మామ మనసిచ్చి మనసును గుంజుకునే శక్తి కలవాడు. ఒక్క పొల్లు మాట, ఒక్క కల్లబొట్టు ఎరగనివాడు." చెల్లమ్మకు నాలుక ఎండిపోయింది. మాట్లాడే శక్తి లేక నేల మీదికి ఒరిగిపోయింది. అంతవరకూ ఊరికే చూస్తూ నిల్చున్న జమీందారిణి ఇక పట్టలేకపోయింది హృదయాన్ని. మంచినీళ్లు తెప్పించి చెల్లమ్మ గొంతులో పోయించి, అరుగుమీద చాపవేయించి

పడుకో పెట్టించింది. తాను విస్మయంతో అక్కడే నిలబడిపోయింది.

* * *

జమీందారిణి శకుంతలాదేవి కాపురానికి వచ్చిన పదిహేనేళ్లలో నలుగురుపిల్లల తల్లి అయింది. బాల్యంలో తల్లిదండ్రులు ఆమెకు విద్య చెప్పించే విషయంలో ఎక్కువ శ్రద్ధ వహించలేదు; కాని దాసదాసీజనాన్ని అదుపులో ఉంచుకోవటమూ, జమీందారీఠీవిలో మెలగటమూ, కొంచెముగా సంగీతములో ప్రవేశమూ కలిగించి పంపారు అత్తవారింటికి. ఆమె అహంభావము కల మనిషి కాదేమో కాని నలుగురితో కలిసిమెలిసిమాత్రం ఉండలేదు. తనతో మాట్లాడవచ్చిన వారితో ముఖాముఖి మాట్లాడదు; ఆమెసమక్షంలో ఆమెదాసి 'అమ్మగారిట్లా అంటున్నా'రని చెప్పవలసినదే. బిడ్డలనయినా ఎప్పుడో దగ్గరికి పిలవటమే గాని ఒక గంటసేపయినా దగ్గర ఉంచుకొని ఎరుగదు. ఒకసారి బిడ్డకు ప్రమాదకరమయిన జబ్బు చేసింది. బిడ్డచర్యలు గమనించవలసిన దని డాక్టరు చెప్పి వెళ్లాడు. మరునాడు ఆయన వచ్చి అడిగినప్పుడు, ఆమె ప్రతివిషయమూ దాసీని ఆయనముందరే అడగవలసివచ్చినది. "నిద్రలో మూలుగుతున్నాడా, దాహమని అడిగా[illegible]?"అని అడిగినప్పుడు దాసీది తృప్తికరమయిన జవాబు ఇవ్వలేకపోయింది. అప్పుడాయన, "యిటువంటివాటికి దాసీలమీద ఆధారపడకూడదండీ" అని అన్నందుకు కోపగించి, "నా కేం కర్మమని తెల్లవార్లూ నిద్రపోకుండా కూచోవాలి" అ[illegible]ని వెంటనే వైద్యుని మార్చివేసింది. భర్తవిష[illegible] అంతే. నిర్ణీతసమయంలో—అధికారితో [illegible]వలె సమావేశమే గాని, స్వేచ్ఛగా, కుతూహలంతో, ఉత్సాహంగా వాళ్లిద్దరూ కలిసిమెలిసి ఎరుగరు. వారి భోజన మేమిటో, వారి రుచు లేమిటో, వారి పద్ధతు లేమిటో ఆమె ఎరుగనే ఎరుగదు. వారిద్దరి గదులూ వేరు. వారికి కావలసినవి తెలుసుకొని చేయటానికి ప్రత్యేకంగా సేవకులు ఉండటమువల్లనూ, ఒకరి విషయాలను ఇంకొకరు తెలుసుకోవలెనన్న కుతూహలము తక్కువగా ఉండటమువల్లనూ ఆ దంపతులు ఒకరి నొకరు ఎరుగవలసినంత ఎరుగరు. అందువలననో—మరెందువలననో ఆమెకు వారివద్ద ఉండవలసినంత చనవు ఏర్పడలేదు. ఆమె ఆ విషయంలో ప్రయత్నించనూ లేదు. జమీందారుకు యిటీవల కలిగిన అనారోగ్యము దీర్ఘవ్యాధిలాగ మారే సూచనలు కనబడుతున్నాయి. వారి దర్శనము చేసి ఎన్నిదినాలయిందో ఆమె! వారి వ్యాధిని గురించి ఆమె ఆత్రుతతో వారి నడగలేదు. అడిగినప్పుడయినా వారు సుముఖంగా జవాబియ్యనూ లేదు. అటువంటి ఆమెకు ఈ పేదరికిల్ల పరిపక్వమైన హృదయము చూస్తే వింతగా ఉంది. ఆమెహృదయానికి యీ పేదరిదంపతుల చర్యలు మొదలు విపరీతముతో కూడిన ఏహ్యముగా కనబడి, చివరకు హృదయానురంజకము లయినవి. ఇంతవరకూ ఆమెహృదయము వారివిషయంలో విచ్చని మొగ్గగానే ఉంది.

"సా కిం న రమ్యా, స చ కిం న రంతా
బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా!"

లాగ ఉన్నది తమ దాంపత్యపు ధోరణి.

తన జీవితఘట్టాలను సింహావలోకనము చేసుకుంటున్న శకుంతలాదేవి పేదరిచెల్లమ్మదగ్గర మనిషిని కాపలా ఉంచి, చివ్వున లేచి జమీందారుగదికి చరచరా నడచింది. తలుపు దగ్గరగా వేసిఉన్నది; సేవకుడు మంచముదగ్గర ఒరిగినాడు; నీరసించిన దేహముతో పక్కకు ఒత్తిగిలి పడుకొని ఉన్న పెనిమిటిని ఒక్కసారి ఆపాదమస్తకమూ వీక్షించినది. సేవకుని బైటికి పంపి, వారికి నిద్రాభంగము చేయలేక పాదములదగ్గరగా స్థాణువువలె నిలిచిపోయినది! కాలికి తగిలిన స్పర్శవల్ల మెలకువ వచ్చి జమీందారు చివ్వున లేచి, చప్పున కాగితము కలము అందుకొని, "దొరసానిగారు యిట్లా వచ్చిన పని ఏమిటి? దాసీ లేమయినారు?" అని వ్రాసి చూపించాడు. ఆమె అది చదివి, "ప్రభూ, నేను మీకు 'దొరసానిగారి'ని కాను. మీ పాదదాస్యము చేయదలచిన అర్ధాంగిని. మన యిద్దరి మధ్యన ఇకనుంచి దాసీలు ఉండరు!" అంటూ మోకరిల్లినది. అత్యాశ్చర్యంలో మునిగిపోయిన జమీందారునికి వెంటనే 'ఆఁ' అంటూ రెండేళ్లనుంచీ నిలిచిపోయిన మాటలు తిరిగి రా నారంభించినవి!



# విమర్శనము



**పుష్పావతి (శృంగార ప్రబంధము)**

కృతికర్త: దుర్భాక రాజశేఖర శతావధాని గారు, ప్రొద్దుటూరు. పబ్లిషరు: యన్. విశ్వనాథం గారు, మదరాసు. వెల రూ. ౨-౦-౦

రాజశేఖరశతావధాని గారు రాయలసీమయందే కాక రాష్ట్రమంతటను ప్రఖ్యాతి జెందిన మహాకవులు. కవిపరమేష్ఠియగు శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారును, కవికులగురువులగు విశ్వనాథ సత్యనారాయణ గారును వారి కవితా వైశద్యమునుగూర్చి ప్రశంసించినవు డింక తక్కిన ప్రశంసలు జగద్విఖ్యాతిముందలి సన్న దీపములు. "ఏకఏవ రసో దంగీ శృంగారో వీరఏవ వా" అను నాలంకారికోక్తి ననుసరించి, వీరరసావిష్కరణమున రాణాప్రతాపచరిత్రమూలమున కవితా వీరులైన వీరు శృంగారరసావిష్కరణమున దమకు గల యసమానచాతుర్యమును జూపుట కీ 'పుష్పావతి' కావ్యమును సంతరించిరి. ఈ 'సంతరించినది' 'నిండు జవ్వనమునయందు' గాదు. 'పదునాఱేడులనుండి హృదయదౌర్బల్యమున పదయుగ్మమును గదల్చి బైట జరియింపని' స్థితిలో. అయిన కృతిరచనమనగ మంచినీళ్ల ప్రాయము. కృతిరచన ము 'నెలో—పదినాళ్లో—కాక తపస్సు కాదు'. అదియు సర్వాంగసంపన్నముగ మూర్తీభవించినది.

పుష్పావతి వేయిపద్యములకు పైబడిన ఐదాశ్వాసముల కావ్యము. కథ మాళ్వాలో 'రీవా' ప్రదేశమున మహాశాదుర్గమున, క్రీ. శ. ౧౧౯౨ లో జరిగినది. కాబట్టి చరిత్రాత్మకమైనది. ఇందు పుష్పావతీ నలినీరంజనుల యాకస్మికసమావేశము, పుష్పావతిని పులినోటనుండి తప్పించుట, వారి ప్రణయాభివృద్ధి, పుష్పావతీ వివాహప్రయత్నము, తండ్రి నరసింహరాయడు ఋణవిమోచననిమిత్తముగ పుష్పావతియభిప్రాయమునకు వ్యతిరేకముగ మోహను డను అపాత్రున కిచ్చి పెండ్లిసేయు తలపు, పుష్పావతి కోలనిలో దూకుట, నలినీరంజనుడు రక్షించుట, గంభీరసింహుని మంతనము, పృథ్వీరాజచంద్రుని యాజ్ఞానుసారము పుష్పావతీనిరంజనుల వివాహము వర్ణితములైనవి. ఆయా సందర్భములలో సంభాషణయందు 'ఉపన్యాసములు' నెలకొల్పబడినవి. ఆకాలమున స్వయంవరము రాజకన్యకలకు విహితముగా నున్నట్లు పృథ్వీరాజ, సంయుక్తావివాహమే తెలుపుచున్నది. నవ్యతకొఱకు కవిగారీ యాకస్మికసమావేశమును గల్పించియుందురు. సముచితములగు వర్ణనలతో శృంగారరసము నవీనకాలానుగుణముగ బోషింపబడినది. పూర్వకవిసంప్రదాయానుసారముగ 'శ్రీ'తో కావ్యము ప్రారంభమైనది. 'స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం' అను మంగళాశాసనగద్యముతో సమాప్తమైనది.

ప్రసన్నగంభీరమగు సమాసరచన, జాతివార్తాచమత్కారములు, అసమానధారాధోరణి కవిగారికి వెన్నతో బెట్టినవి. అచ్చటచ్చట నరసున్నలుండవలసినచోట లేకపోవుట, ఉండకూడనిచోట నుండుట, 'నీవును వచ్చితి వింతకన్న మోదము కలదే' అను యతిభంగము—ఇట్టి నెరసు లున్నను నవి పాటింపదగినవి కావు. ఈ ఉత్తమసాహిత్యవిద్యార్థుల కిట్టి గ్రంథములు ముఖ్యపఠనీయగ్రంథములుగా నుండదగినవి. విశ్వవిద్యాలయాధికారులిట్టి యుత్తమకృతులను నాదరింతురుగాక!

'విద్యారత్న'.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press.
No. 7, Thambu Chetty St., G. T., Madras.Editor— S. Sambhu Prasad



ఆప్తులనుండి ఆప్తవర్తమానాలకోసమై రణవీరుల ఆత్రం

(కాశ్మీరు యుద్ధరంగ దృశ్యాలను చిత్రిస్తూ రచితమైన వర్ణచిత్రాల ప్రదర్శనం గతవారం మద్రాసులో జరిగింది.
అందులో ఇది ఒకటి—చిత్రకారుడు శ్రీ కన్వాల్ కృష్ణా)

(By the kind permission of Army authorities)